శ్రీ

# శివభక్తి

తిరుపతి వేంకటీయము



ప్రథమముద్రణము

బెజవాడ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

కొండా లక్ష్మీనరసయ్యచే

ముద్రింపఁబడియె

1941

32

# పీఠిక

షష్టిపూర్తి దాదాపువఱకును మా రచించిన పుస్తకములలోని గాథలు కొన్ని పురాణములనుండి గైకొన్నవియుఁ గొన్ని యనుభూతములును గొన్ని పెద్దలవలన వినినవియు నై యున్నవి.

మాఘే మేఘే గతం వయః

అనునట్టులు నానావిషయములు వానిలో గతార్థమగుటచే నిటీవల నేదేని గృతిగా నెవరేని గోరినచో రచించుటకు శక్తి యున్నను నింతకు మున్ను వర్ణించిన విషయములే వర్ణించుట,

"చర్వితచర్వణ"

మగునని యెంచి యాపనికిఁ గడంగుటయే లేదు. ఇట్లుండఁగా నా జాతకమునకుఁ బ్రధానముగా బలిష్ఠుఁడును గవిత్వకారకుఁడు నగు శుక్రుఁడు శనిమహాదశలో నంతర్దశాధినాథుఁడుగా వచ్చెను. వీనికిఁ బూర్వమున వచ్చిన—

కేత్వంతర్దశయే

మారకము చేయు నని కొందఱు దైవజ్ఞు లభిప్రాయపడిరి కాని యట్లు జరుగ లేదు.

శుక్రాంతర్దశ

ప్రవేశించుట తోడనే వీని పూర్వవృత్తాంతము జ్ఞప్తికి వచ్చి నాకు భయ మంకురించినది. వీఁడు పట్టి కవిత్వము మాత్రము చెప్పించి యిన్న కుండఁడు. ఏవో వివాదాలు (కవితా సంబంధము కలవే) కల్పించుటకు కూడఁ గలదు. అందుచేత నాకు వీనిరాక యన్న మిక్కిలిగా భయము. ఇప్పటి నా యోపిక యెంతలో నున్నదో తెల్పుటకై ఆయీ శివశక్తి కృతికి వీ బెజవాడకు వచ్చు ప్రయాణ సందర్భమునఁ జెప్పిన పద్యములలో నొక పద్య ముదాహరించినఁ జాలు ననుకొందును—

మ॥ పరలోకమ్మున కేగుచేని యెటులో బ్రాల్మాలి తప్పించుకోం
దెరు వూహించినచోఁ గనంబడెడిఁగానీ యీ ప్రియాణం బెటుల్
సురుఁగ॥ జూచినయేని దప్పనియటుల్ చూపట్టు నీ సత్కృపా
భరమే సర్వము నిర్వహింపవలె నంబా నమ్మ కామేశ్వరీ.

ఇంతటి యసమర్థత్వములో నున్న నన్ను సకుటుంబముగా రప్పించుటయేగాక ఆయీ సందర్భములో నాకు-

గ జా రో హ ణో త్స వ ము ను

గూడఁ జేయనెంచిన కృతిపతి యుత్సాహము వర్ణనీయము. నా శక్తి

గ జా రో హ ణ ము న కు

తగియుండ లేదని చెప్పినపిమ్మట నా యుద్యమము విరమించి కొన్నను త్రికరణశుద్ధిగా సంకల్పించుకొన్నయంశ మగుటచే నదికూడ జరిగినట్లే నేను సంతసించుచు నా యలఘుఁడుగూడ నట్లు సంతృప్తిపడుటకయి దీని నిందుదాహరించితిని. ఈ శివభక్తియందలి,

ఇ తి వృ త్త ము

పురాణస్థము కాకున్నను సర్వవిధములఁ బురాణస్థము లగు పుణ్యపురుషుల చరిత్రములంబలె భక్తిజ్ఞాన వైరాగ్యాదుల కావాలముగ నుంటచేఁ గవిత్వమెట్లున్నను నావార్ధక్యమున కిందుమూలమున ధన్యత్వ మార్జించుకొన్నట్లయిన దని సంతసించు చున్నాఁడను. ఇఁకఁ గవిత్వమో?

"వృద్ధో యాతి గృహీత్వా దండం" అనునట్లుండు ననుకొందును. యమకాదిశబ్దాలంకారములకు మేము వయఃకాలమందే కొంత విముఖుల మని మా కబ్బములే చెప్పును. ఆ ముచ్చట మాకుఁ గొంత సంస్కృతరచనలో (కాశీసహస్రాదికము చూ.) తీరినది. ఆంధ్రమున రచనకు దిగిన తోడనే, భావప్రధానరచనయే కాని యితరమునకు మేము కుతూహలపడినదే లేదు. ఇఁక నిప్పుడో:—

"త్రిదోషహరము తిప్పతీఁగె"

అన్నమాదిరిగా సర్వవిషయములందును ప్రవృత్తి నడచుటచేతఁ గవిత్వముకూడ నట్లే యుండునని చెప్పుట స్వభావోక్తి. అయినను ప్రస్తుత విషయమునకు సహృదయు లధికారులు గాని గ్రంథకర్త కాఁడు. కృతికర్త బాగుగ నుండ దనుకొన్నది పాఠకులకు బాగుగను నుండవచ్చును, బాగుగ నుండునని తలఁచినది అన్యవిధముగను నుండవచ్చును. అన్నిటికన్న దీనికి ముద్రణసౌకర్య మెక్కుడుగా లభించినది. ఇంత త్వరలో నింత నిర్దుష్ట ముగా ముద్రించి నా జీవితకాలములో నన్ను సంతోషపెట్టిన,

గ్రంథాలయ ప్రెస్సువారిని

మిక్కిలిగా మనఃపూర్వకముగా నభినందనపూర్వకముగా నాశీర్వ దించుచున్నాఁడను. ఇందే యఱుసున్నలో, యే న. స. ప. శ. అను నక్కర ములో తప్పు,దిద్దఁదగిన ప్రసక్తియేలేకున్నను ఆచారనిర్వహణార్థ మొక్కింత తప్పొప్పులపట్టిక యిచ్చుచున్నాఁడను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 15 | 20 | మరి | మఱి |
| 24 | 18 | వవు | వవుఁ |
| 26 | 14 | శుద్దు | శుద్ధు |
| 116 | 13 | నొంప | నూఁప |
| 172 | 16 | నెవి | నెది |
| 184 | 6 | యన్న | యున్న |
| | | వాక్రుచ్చఁగ= | వాక్రువ్వఁగ= |

షరా. నా జీవిత కాలములో నింత పరిశుద్ధముగా నచ్చుపని ముగించిన ప్రెస్సు నే నెఱుఁగను.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,

శతావధాని.

15-11-41.

ప్రస్తుతపు మకాం - బెజవాడ.



కృతిపతి

శ్రీయుత చందూరి వెంకటరెడ్డిగారు, వారిధర్మపత్ని.

శ్రీమత్పరదేవతాయై నమః

శుభమస్తు - అవిఘ్నమస్తు





శ్రీ

# శివభక్తి

## తిరుపతి వేంకటీయము

### ప్రథమాశ్వాసము



చ॥ సిరులు త్రిలింగపీఠికి విశేషముగా గలిగించుచు న్నిరం
తర మటఁ బూజలన్ గనెడి దైవశిఖామణి వేంకటేశ్వరుం
డురువగు నాయువున్ సిరియు నున్నతియున్ గలిగించి ప్రోచుఁ జం
దురికులమౌళికిన్ గుణమహోదధి వేంకటరెడ్డి శ్రేష్ఠికిన్. ౧

క॥ తలిదండ్రులు గలరఁట తా, తలలో నొక తాతఁ దక్కఁ దక్కిన తాతన్
దెలియమఁట? అట్టి దేవర, దలఁచెద విఘ్నాద్రికోటిదంభోళి నెదన్.

మ॥ అమృతానంద గురూత్తమాంఘ్రియుగళీ వ్యాసక్తచిత్తాబ్జుఁ ద
ద్రమణీయార్థ మహోపదేశమధుసర్వస్వావగాహిన్ గృహ
శ్రీమహాస్తవ్య సదర్యవంశముని నిష్పందోన్నతైశ్వర్యు ను
త్తము మా వేంకటరెడ్డి నీశ్వరుఁడు సత్సంతానుఁ గావించుతన్.

మ॥ ఎట "దేవుం డనువాఁడు లేఁ డనెడి యుద్వృత్తాత్ములం గూడ నే
నిట నున్నాఁడను రండు రం" డని కుభృచ్ఛృంగమ్ముపై నిల్చి యా
దట నాహ్వానము సేయు వేంకటనగాధ్యక్షుండు రక్షించు వేం
కటరెడ్డిన్ సతితోఁ దనుం గొలుచు భక్తశ్రేష్ఠు శ్రేష్ఠ్యన్వయున్. ४

మ॥ అమృతానందుని బోధయే తనకు సర్వైశ్వర్యసంధాయి యం
చు మది న్నమ్మి నికేతనం బతనిచే శోభిల్లఁ దన్నామధే
యముతో నిర్మితిఁ జేసికొన్న ఘను నుద్యచ్ఛ్రీకుఁ జుండూరివం
శమణిన్ వేంకటరెడ్డి నయ్యమృతుఁ డాశాసించు భాసిల్లఁగన్. ౫

మ॥ గురుభక్తుల్ గల రెందఱేని యిపుడుం గోమట్లలో వేంకటే
శ్వరభక్తుల్ గల రచ్చటచ్చట, మహైశ్వర్యమ్మునం దున్న య
న్నరులం దుండదు భక్తి రిక్తులయెడన్ వర్తించు నీ రెడ్డి బల్
సిరికిన్ బేరయి భక్తుఁడౌ కతన నాశీఃపాత్రమై మించెడిన్. ౬

ఉ॥ సంతతి లేదుగా! యను విచారము సుంత యెఱుంగఁ డెప్పుడున్
గాంతయుఁ దాను వేంకటనగస్థిరవాసుఁడు శ్రీనివాసు న
మ్మంతరమున్ జపించు మతిమంతుఁడు మిత్రుఁడు నాకు వీనిపై
స్వాంతము సంతసించి కృతిసంతతిమంతు నొనర్ప నెంచితిన్. ౭

శా॥ దేవబ్రాహ్మణభక్తితత్పరమతిన్ ధీశాలి నీ రెడ్డి స
ద్భావుం గాంచినదాది యాతనిఁ గృతిద్వారమ్మునన్ ధన్యునిన్
గావింపం దలపెట్టి యొక్కయెడ వక్కాణించితిన్ రెడ్డి సం
భావించె న్మదుదీరితమ్ము రచనాప్రారంభమున్ జేసితిన్. ౮

క॥ చేసి "కత నీవ యొసఁగిన, చో సల్పుదుఁ గబ్బ" మనుచు సూచించితి న
ట్లే సమ్మతించి యొసఁగెన్, జేసితినది గాంచు దీని క్షేమపికోలఁదిన్.

క॥ శృంగారమ్మును వీర,మ్మం గరుణముమఱియు హాస్యముంగల కబ్బా
లం గట్టు వయసు గాదిది, వంగినకాయమ్ముఁ జూచువారలు నగరే.

తే॥ గీ॥ సెట్టి వయసువాఁడయ్యును జిత్త మెపుడు
దైవభక్తిమయం బయి తనరు కతన
"నొక మహాభక్తు చరితమ్ము నొసఁగు" మనియెఁ
దనకుఁ గృతిగాఁగ; నేను సంతసముఁ గంటి. ౧౧

చ॥ అలికులవేణులం గుఱిచి యాపదమస్తక మెంచి యెంచి యు
త్పలములుఁ జంపకమ్ములు సదా వృథ సేయుటకన్న దైవభ
క్తులచరితమ్ము పద్యములకున్ గుఱి చేసి రచించు భాగ్యవం
తులు కవులందు ధన్యులని తోఁచెడి వృద్ధున కింత యొప్పదే. ౧౨

క॥ ఈ వార్ధక్యమ్మున గో,దేవి పతివ్రత సుశీల ధీకొలఁది న్నేఁ
గావించితి భక్తిజ్ఞా, నావిర్భాతికి నిదాన మా పొత్తమ్ముల్. ౧౩

తే॥ గీ॥ అఖిలమును దీరినట్టి వయస్సునందు
సెట్టి యెట్టిది గోరునో? చివర కనుచు
సంశయించుచునుండ నా సత్త్వముండు
పరమభక్తుచరిత్రంబు బంపెఁ నాకు. ౧౪

తే॥ గీ॥ సెట్టి యీ చరితంబు దక్షిణపుదేశ
మందు మున్నెప్పుడో విని యదియు మొదలు
కావ్య మొనరింపఁ జేసెడి కాంక్షతోడ
నుండె ఫలియింపఁజేసె దేవుండు నేఁడు. ౧౫

శా॥ బీ, యే, ప్యాసొనరించికూడ నెపుడుం బ్రేమించు దేవున్ మదిన్
ధ్యేయుంగా; సుకృతంపుఁ గార్యములకున్ ధీ గొల్పు వేదాంత వి
ద్యాయుక్తమ్ముగ జీవితమ్ముఁ గడపన్ యత్నించు నీరెడ్డి దీ
ర్ఘాయుర్దాయము సార్థకం బగుతమం చర్థింతు నిల్వేలుపున్. ౧౬

క॥ ఇలువేలుపు కామేశ్వరి, గలదుగదా యనుచుఁ జెప్పఁగడఁగితి నాకున్
బలమెప్పుడు నా యంబయె, తలఁచుట యేతడవు కోర్కెల్ తానెఱవేర్చున్.

తే॥ గీ॥ కనకదుర్గాంబగుడికి దాపున నితండు
ధర్మసత్ర మ్మొకఁడు నిల్పఁదలఁచి పని కు
పక్రమించె శ్రావణమాస బహుళపక్ష
మందున గృహప్రవేశమహంబు జరుగు. ౧౮

తే॥ గీ॥ "అప్పటికిఁ బూర్తి గావలె ననఘ! కృతియు,
ననుచు రెడ్డి లిఖించెను వ్యవధి రెండు
మాసములు మాత్ర మున్న దమ్మా! యొకింత
పాటి యారోగ్య మి మ్మిదే వ్యవధి చాలు. ౧౯

శా॥ నీసాన్నిధ్యమునందు సత్ర మొకఁడు న్నిర్మించు నీరెడ్డి త
ద్ధీసౌభాగ్యము వేఱె యెన్నవలెనే? దేవీ! స్వయంవేద్యమే
గా? సౌశీల్యము గల్గువారలపయిన్ గామేశ్వరీ! సర్వథా
నీ సద్భావము పొంగి పొర్లు ననుచు న్నే నెంతు నత్యంతమున్॥ ౨౦

శా॥ ఏనా? భక్తుఁడ నీకు, రెడ్డి మఱి యెంతే నీదు భక్తుండు ద్ర
వ్యానం గాఁదగు కార్య మేదియును నీ కర్పింప లే నేను, నీ
గానం బూరక ముక్కు మూసికొనుచు న్గావింతు, రెడ్డన్న! నీ
ధ్యానంబుం బొనరించు, ద్రవ్యమున నీ దాస్యంబునున్ జేసెడిన్. ౨౧

తే॥ గీ॥ అంబ! "శుష్కప్రియములు శూన్యపుఁ గరములు"
ననెడి లోకోక్తి కేను లక్ష్యంబు, రెడ్డి,
అట్లు గాదని నీ చిత్తమం దెఱింగి
అతనికోర్కికి నా కిమ్ము హాయి కొంత. ౨౨

క॥ చుండూరి వంశజుం డొక, డొండొక భారతము కృతిగ నొందుక తనధ
న్యుండయ్యె రెడ్డియును ధ,న్యుం డగున ట్లేపొనర్పు మో జగదంబా!

ఉ॥ దేహబలమ్ము తగ్గినది ధీబల మింకను దగ్గలేదు సం
దేహముతోఁ బనేమి? భవదీయకృపాబల మున్నదంచు నే

సాహసమూని యిందులకుఁ జాచితి హస్తము; మత్ప్రవృత్తికిన్
"దోహదముం బొనర్పు"మని దోయిలి వట్టితిఁ ద్వత్కృపాప్తికిన్.

మ॥ ఎపుడు న్నిన్నును నీపతి న్మనమునందే నిల్పి భావత్కమా
కృపకున్ దోయిలి యొగ్గి వర్తిలుట నీకేఁ జెప్పఁగా నేల? వ
ద్యపుసందోహమె సాక్ష్యమిచ్చు నదె సంధానించె నన్గొందుఁ బు
ణ్యపుఁగార్యం బగు నీ కథారచనము న్నాకిప్డు నాతల్లిరో? ౨౫

తే॥ గీ॥ సప్తసంతానముల నిది చాలఁ గాల
ముండు సంతానమని నే యథోచితముగ
రెడ్డితో నంటి నాతఁ డూరీకరించి
రచనకై సారె సారెఁ బ్రేరణ మొనర్చె. ౨౬

క॥ దినదినగండమ్ముగ నుం,డిన నే నిప్పనికిఁ బూనుటే యొకతప్పా
నిను నమ్మి పూనితింజుమి, జననీ! నీభక్తు నెఱిఁగి సాఁకఁగవలయున్.

మ॥ ప్రతిపాద్యం బిట శైవభాగవత దివ్యద్వ్యచారిత్ర మే
నతిభక్తుండను నీకు, రెడ్డివిషయం బాద్యంతమున్ సాధు స
మ్మతమే నీ కెఱిఁగింపఁగా వలెనె? సామగ్రి సమాయోగ మీ
కృతికిం గూడినయట్టు లేకృతికి నిం కే నాఁడునుం గూడెనే. ౨౮

మ॥ అగుదు న్నీకృపచేఁ గృతార్థుఁడను నే నస్మత్సుహృన్మౌళి సా
ధుగుణాఢ్యుండును సాధుసమ్మతుఁడు నిర్దుష్టాంతరంగుండు రె
డ్డి గడించున్ మిగులన్ యశోభరము; వర్ధించున్ స్వవంశంబు పూ
ర్తిగఁ దృప్తింగనఁ బుణ్యభక్ష్యముల? నీ తేజన్నియున్ గూర్చెడిన్.

ఉ॥ ఎన్ని పురాణజాలముల నెంత విచారణ చేసి చూచినన్
బున్నెముదక్క మానవుని పుట్టువు ధన్యముఁ జేయునట్టి దొం
డున్నటు దేల దయ్యదియు నొక్కవిధం బనరాద యెన్ని యో
తెన్నులు దాని కున్నవి కృతిగ్రహణం బొకఁ డట్టి తెన్నులన్. ౩౦

తే॥ గీ॥ కృతులతోఁ బాటుగాఁ గృతిపతులుగూడ
విశ్వమందున నిల్తురు శాశ్వతముగ
నదిర? శివభక్తి కృతినందినట్టి సుకృతి
కృతులకెల్లను దా నలంకృతియె జగతి. 3౧

మ॥ గుడులున్ గోపురముల్ సరోవరములుఁ గూపమ్ములుఁ సత్రముల్
చెడు నెల్లప్పుడు నిల్వనేరవు కృతిస్వీకారమో! అట్లు తాఁ
జెడఁబో దక్షయమౌచు నక్షరవిదుల్ సేవింప నీలోకమె
ల్లెడ సంచారము సేయుచుండుకతనన్ గృత్యాయువుత్కృష్టమౌ. 3౨

తే॥ గీ॥ సత్రనిర్మాణమే కాదు సాధుసమ్మ
తములు పండిత సత్కృతుల్ రమణ సలిపె
వర్తకుఁడు రెడ్డి అవచితిప్పనకు సాటి
యగునని తలంతుఁ గృతికి సాయమ్ము గమ్మ. 33

మ॥ అమృతానందగురుం డుపాధి నిలపైఁ ద్యాగమ్మొనరించి బ్ర
హ్మము తాఁగూడిన నున్నయట్లగొలుచున్ మాన్యుండహో! రెడ్డి ని
త్యమునున్ దద్గురుమూర్తి నా ఘనుని బోధంబుం దలందాల్చుఁ ద
త్త్వము నొక్కప్పుడు నేమఱండు గురుమంత్రంబుఁ జపించుఁ సదా.

తే॥ గీ॥ ఆజ్ఞయే శ్రీగురునిరూప మన్నమాట
యంబ! నీరూపమే గురుం డన్నమాట
భక్తులందఱు నీదు రూపములె యాట
యెఱుగ రెవ్వరు మనరెడ్డి యెఱిగినట్లు. 3౫

తే॥ గీ॥ కొలదికాలంపు మితుృఁ డగుటఁ దదీయ
పుణ్య కార్యమ్ము లన్నియుఁ బూసగ్రుచ్చి
నట్లు నేనెఱిఁగింప లేనైతి నీ వె
ఱింగియే యుందు నేను జెప్పంగ వలెనె. 3౬

ఉ॥ ఆతనిఁ జెప్పనెంచఁ దగు టంతగ భావ్యము గాదు గోప్యపుణ్
దాత యతండు పాత్రమునఁ దత్సుకృతంబులు చేర్చునం చెదన్
భీతిలు నక్కతాన నినుఁ బెట్టితి పూటగ నీవె రెడ్డి ప్ర
ఖ్యాతి జగత్ప్రసిద్ధి గనునట్టు లొనర్పుము దేవి! శాంకరీ. ౩౭

ఉ॥ కీరితిఁ గోరి రెడ్డి యొకకృత్యమునుం బొనరింపకుండఁగా
కారయుదాన మీ వగుట నాతనికీరితి లోకమెల్ల సం
చార మొనర్చు నట్టులుగ సల్పుట నీవిధి యంచు నెంచి యీ
భారము నిన్నుఁ బూన్చితిఁ గృపన్ భరియింపఁగదమ్మ శాంకరీ. ౩౮

తే॥ గీ॥ ధనవిహీనులు తరియింప దార్లు కొన్ని
వఱలుఁగాని ధనాఢ్యుల తరణమునకుఁ
గీరితియె తక్క వేఱొండు దారి లేదు
గావ నిన్నిట్లు గోరితిఁ గనకదుర్గ. ౩౯

మ॥ చేసెన్ జేయుచునుండెఁ జేయఁగలఁ డీ శ్రీరాశియా రెడ్డి బల్
వాసిన్ బొల్చెడి పుణ్యకార్యములు వాలాయమ్ము నీ పున్నచో
వాసంబబ్బెఁ బురాకృతంబున భవద్వాత్సల్య మీ రెడ్డిపైఁ
గాసంతుండినఁ జాలుఁ గీర్తిధనుఁడై కైసేసెడిన్ లోకమున్. ౪౦

క॥ కనిపెట్టినాఁడ నే నీ,తని చెయ్వులు భార్యగూడఁ దగినది యీరె
డ్డనకున్ దొరకిన దీతం,డనఘుండై యిహపరముల నార్జింపఁడెటుల్.

ఉ॥ “కీరితి యొందు” కంచనెడి కిల్బిషచిత్తులు గొంద ఱుందు ర
వ్వారలు లేశమున్ దెలియు వారలు గారు తరించుమార్గ మ
వ్వార లెఱుంగ రిందులకు భారతభాగవతాదులే పరి
ష్కారము చేసి తెల్పెడిని గాథలఁ గొన్నిటి యుక్తబోధలన్. ౪౨

తే॥ గీ॥ దేనికల్మి నింద్రద్యుమ్న భూనిలింప
పతి నిలింపపురం బేగెఁ బదపడి యట
నుండి యెది లేక ధరణికి నూడిపడియె?
మరల దివి కెట్టు లేగెఁ సన్మాన్యుఁ డగుచు. ౪౩

క॥ కావున సత్కీర్తికినై, దేవీ! తమశక్తి కొలఁది ధీరులు యత్నిం
త్రె వెడఁగులొ? పిడివాదము, లేవో పొనరింతు్రు వారి నేటికిఁ దడవన్.

తే॥ గీ॥ కపటము నసత్యమును నూఁతగాఁగఁ గొంద
అజ్ఞులు యతింతు్రు కీర్తికయ్యది యిహమ్ము
మాత్రమేకాదు పర మను మాటకూడ
నవలికి న్నెట్టు రెడ్డి యయ్యదియు నెఱుఁగు. ౪౫

క॥ తనమదికి న్నచ్చిన కత, గనుక నె తనజాతి భక్తు కత కావ్యంబున్
బొనరింప నా కొసంగెను, గని పెట్టితి రెడ్డిహృదయగతి నే దీనన్.

ఆ॥ వె॥ నాకుఁగూడ నిట్టి నాణెంపుఁగతలపై
మనము నిల్చు నిట్టి మధురచరిత
గలుగువారిఁ గూర్చి కవిత చెప్పుటె కదా
కవనశక్తి తనకుఁ గలుగు ఫలము. ౪౬

మ॥ భగవద్భక్తుఁడు రెడ్డి మిత్రుఁ డట ? సద్భక్తుండు వంకాదరన్
దిగధీశాంశము వర్ణనీయ మఁట ? సందేహింపఁగా నేల నా
దగు వార్ధక్యము ధన్య మయ్యె సుగుణఖ్యాతుండు శ్రీ రెడ్డి తా
నగుతన్ సర్వవిధాల నంచు నిది నే నారంభమున్ జేసితిన్. ౪౭

వ॥ కథారంభం బొనరించుచు సుకవివతంసుల యాచారం బగుటం జేసి కృతినాయకుని వంశంబులలోఁ దొలుత జన్మవంశంబు వక్కాణించి పిదప విద్యావంశంబుఁ గూడ నభివర్ణించెద. 'వంశో ద్విధా విద్యయా జన్మనాచ' అనికదా ? అభియుక్తులు వ్యాఖ్యానించిరి. ౪౮

వంశావతారము

తే॥ గీ॥ అల సురజ్యేష్ఠు నూరువులందు జనన
మందె వైశ్యాన్వయం బందు నలరు శాఖ
లొక్కకొన్ని తెలుఁగుదేశ మూరుజులకు
వన్నె తెచ్చిన దని చెప్పవాఁడ నేను. ౧

తే॥ గీ॥ కారణం బెట్టి దనఁ గన్యకామహావ
తార మీా తెల్గుదేశాన నూరుజకుల
మందు సంభూతిఁ జెందె నయ్యంబ యప్ప
రాంబికాంశం బటన్న మా తాడ రెవరు. ౨

క॥ ఆ కన్యకాంబ కరుణా, పాకమునకుఁ దావలమ్ము బహుళైశ్వర్య
ప్రాకటమును "సుందరస", శ్రీకముగోత్రమ్మొకండు చెన్నలరారున్.

తే॥ గీ॥ ఘంటశాలాపురమ్మునఁ గాపుర మ్మొ
నర్చు నీ గోత్రజులయం దనర్ఘమైన
సిరియు సంపద గల్గి చుండురికులంబు
వన్నె గనె నందుఁ గలరు ధూర్వహులు ఘనులు. ౪

శా॥ అందున్ వేంకటరెడ్డి నాఁ దనరు విఖ్యాతుండు ద్రవ్యార్జనం
బందే కాక యుదారతాగుణమునం దత్యంతమున్ మేటియై
కం దే మాత్రము లేని సద్యశముతోఁ గ్రాలెన్. గుబేరుం డటం
చుం ద న్నర్థిజనంబు సారెకుఁ గడున్ స్తోత్రమ్ము గావింపఁగన్. ౫

క॥ ఖ్యాతుం డగు నాతనికిన్, సీతారామార్యుఁ డర్యశేఖరుఁడు తనూ
జాతుండుద్భవమయ్యెన్, దాతయుఁదాతయును గృతివతంసునకితఁడౌ.

తే॥ గీ॥ సంస్కృతాంధ్రమ్ములందునఁ జక్కనైన
పాండితిని సేకరించి యీా వైశ్యమౌళి

టిప్పణి "౪" ఈ గోత్రజులు = ఈ సుందరసగోత్రజులు.

యెప్పుడుఁ బురాణగోష్ఠితోనే యనేహ
మెలమితోనెట్టె నెట్టె సుకృతియొ యనఁగ. ౭

తే॥ గీ॥ "గొల్లి" వంశమ్మునం దుద్భవిల్లినట్టి
వెంకమాంబిక కడు నకలంకచరిత
నితఁడు పెండ్లాడి నలువురు సుతులఁ గాంచెఁ
దనదు వంశమ్ము తామరతంపరగను. ౮

వ॥ రత్తయ్య, కాంతయ్య, అప్పయ్య, నాగభూషణము అను నీ నల్వు
రలోఁ బ్రకృతకృతినాయకుని తండ్రి యగు తురీయుండు. ౯

తే॥ గీ॥ నాగభూషణుఁ డెల్లప్డు నాగభూష
ణునియెడల భక్తి గల్గి యనూనమైన
ధనము గణియించి యల కుబేరుని విధాన
నలరె పేరులు తనసిరి నభినుతింప. ౧౦

తే॥ గీ॥ గుప్తదాత యితం, డెంత గుప్తదాత
యనిన? నిరువదిరూపికల్ దినమునకు ని
తండు దాన మ్మొనర్చు నాత్మకు వినాగ
నియ్యది యొకింత యన్యుల కెఱుఁగఁబడదు. ౧౧

శా॥ లచ్చల్ లచ్చలుగా గడించె ధన మీ లక్ష్మీతనూజుండు; వి
ద్వచ్చందుల్ నుతియింపఁగాఁ దగిన సత్కార్యమ్ము లెన్నే నిఁ యీ
సచ్చారిత్రుఁ డొనర్చె నాత్మగృహమే సత్రమ్ముగా విద్యకై
నిచ్చల్ వచ్చు కలార్థులన్ మనిచె వర్ణింపంగరాదే ఘనున్. ౧౨

ఉ॥ జీతము లిచ్చి పాత్రములుఁ జేలము లిచ్చియుఁ బేర్మిమైఁ దనూ
జాతుల తోడిపాటుగఁ బసాపడ నన్నము వెట్టి స్వీయసు
జ్ఞాతుల కెంద తెందఱికొ సాయ మొనర్చి యొసంగె విద్య నీ
దాతృశిరోవతంస మని తజ్ఞులు సెప్పఁగ నాలకించితిన్. ౧౩



కృతిపతి తండ్రిగారు

శ్రీయుత చుండూరి నాగభూషణంగారు.

ఉ॥ ఈ విషయమ్మునం దితని నింత నుతించుటకన్న భార్య ఆ
శ్రీవనితావతార మగు శీలవతీమణి లక్ష్మినర్సమ్మక్
భావుకరూపశాలిని స్వభావవినమ్రి నుతించు టొప్పుఁగా
దే! విభుఁ డేమిసేయఁగలఁ డీ యమ యందుకుఁ దోడు గానిచో. ౧౪

శా॥ ఆ కారమ్మున లక్ష్మియే యనుచు నా యమ్మన్ వచింతు ర్తదీ
యాకార మ్మటువంటిదా కతననే యన్యోన్యం దు నా సాధ్వి దా
నే కాలమ్మునఁ గాలుపెట్టె నపుడే యీ నాగభూషార్యుఁ డిం
కే కోమట్లును దీటుగాని సిరితో నెంతెంతొ వృద్ధిం గనెన్. ౧౫

చ॥ ఒకయమ కాలు పెట్టి విభు నుచ్ఛతరస్థితి కెక్కఁజేయు నిం
కొకయమ కాలు వెట్టి సిరి నూడనిఁబాడఁగఁ జేయు నం చిటుల్
సుకవులు చెప్పుచుండు నుడి సూనృత మిందు నొకంట సాక్షిగాఁ
బ్రకృతపధూటి నర్సమను వాకొనవచ్చు ననంశయమ్ముగన్. ౧౬

క॥ ఈ నాగభూషణుండే, తా నల బెజవాడపురికిఁ దనదునివాస
స్థానమును మార్చె నటుపై, శ్రీనెగడన్ జొచ్చె వన్నెచిన్నెల కిరవై.

ఉ॥ వ్రాసితి సంగ్రహమ్ముగను బావనశీలను లక్ష్మినర్సమా
శ్రీసురభిన్ గుఱించి, గుణసేవధి నీ యమ నెంత మెచ్చినన్
వాసి యెదో సశ్లేష మయి భావము గుంజదొడంగు సాధ్వి ల
భ్యాసము సేయఁగాఁ దగిన యన్నిగొనమ్ములరాశి ఈమెయే. ౧౭

ఆ॥ నాగభూషణుండు నాఁ డెంతయో తప
మ్మాచరించి గౌరి కమ్యొ భర్త
నాగభూషణుండు శ్రీగన్య నీ లక్ష్మి
నర్సమాంబఁ దపమునన్ గణించె. ౧౮

క॥ ఐదుగురు కొమరులును నా,పై దుహిత యొకర్తుగా నపత్యశ్రీ పూ
ర్వోదిత దంపతులకు ల,క్ష్మీదయితుం డిచ్చె సిరికిఁజెలువుదయింపన్.

ఉ. పేరికి నార్వురంచు నిటు పేర్కొను మాత్రమె కాని నిక్క మ
వ్వారికి బిడ్డ లెంద అన? వాకొన శక్యము గాదు బీదలా
వారలపిల్ల లెల్లరును వారల సంతతిలోనివారె సం
సారము వారి దెంతటిదొ? సాధ్యము గా దిదమిత్థ మంచనన్. ౨౧

క॥ తమ కాలము వారినిటు౯్రపే, మము మెయిసాఁకుచునుద్విజకుమారకులకున
త్రమునసదుపాయ మొనర్చుచు, సుమహితుఁడీనాగభూషుసుకృతంబన దే?

వ॥ ఈ దంపతులిర్వురును సుకవివర్ణనీయులు. అందును నీలక్ష్మీనరసమాంబ
దానదయాసంపత్తి కియత్త కనుపట్ట దని చెప్పికొందురు. ఈ సాధ్వీ
లలామ పుట్టినింటివారు వేములవారుగాని, యీమెవర్తనమత్యంత
మధురము. కృతినాయకుండు వేంకటరెడ్డి నిన్న మొన్న యొనర్చిన
శిశువులంగూర్చిన మహాధర్మకార్య మీూపె పేరటనే కావించె. దుర్గ
గుడియొద్ద నిల్పినసత్రము తండ్రిపేర నని యెఱుఁగనగు. ౨౩

క॥ కవిత భగవంతుఁ డిచ్చుట, కవితథముగ దైవమునకు నర్పించుటయున్
సవిశేషమ్మగ నీదృశ, సువివేకుల మెచ్చికోలుఁ జూ? ఫల మరయన్.

వ॥ ఈ పుణ్యదంపతుల సంతానమ్మునందుఁ బ్రకృతకృతినాయకుఁడు
వేంకటరెడ్డి తృతీయుండు. కాంతయ్య, సీతారామయ్య అనువార
లీతని యన్నలు. అప్పరావును, రంగయ్యయు నీతని తమ్ములు. లక్ష్మీ
దుర్గాంబ యను శ్రీమతి యీ యేఁగురకును జెల్లె లని యెఱుఁగఁ
దగు. మఱియుఁ గృతినాయకుం డిప్పటికి నొనర్చిన సుకృతంబులలో
నా యెఱిఁగినవ ట్టింతకు మున్న పీఠికలోఁ బ్రసక్తానుప్రసక్తంబుగ
నుదాహరించితిం గాని యింకను బెక్కులున్నట్లు వింటిని. కొన్ని
యిందుఁ బ్రస్తావించెద. ౨౫

సీ॥ శ్రీశైలమల్లేశు సేవించి యచ్చోట
శాశ్వతమ్ముగ ధ్వజస్తంభ మెత్తె
వృషము దాన ఘటించు టెఱిఁగి వృషోత్సర్జ
నం బొనర్చెను వైభవం బెలర్ప
ఆకాశిసేతుపర్యంతమే కాక తీ
ర్థాటనం బొనరించె నవులఁగూడ
నల్ల నెల్లూరి బృహస్పతిసవనాన
కర్పించె దక్షిణ నడిగినంత
తే॥ గీ॥ ఇచ్చె నొక్క బ్రాహ్మణునకు గృహము గట్టి
యేదొ మిషమీఁద వందల కిచ్చుగా న
నేకులను బోషణము సేయు టెల్ల రెఱిఁగి
నట్టిదే వేలుపులగిడ్డి యగును రెడ్డి. ౨౬

శా॥ 'బీ.యే' ఆంగ్లమునందు; సంస్కృతమునన్ విద్వత్త నార్జించె నెం
దో యే మాత్రమొ కాదు వ్యాకరణమందుంగూడ సంస్కారిగా
నే యుండెన్ గులవృత్తిలో నితనికిన్ దీ టెందుఁ గన్పట్ట దెం
దో యుండున్ సుకృతాత్ముఁ డీదృశమహోద్యోగుండు గోమట్లలో.

చ॥ పిఱికితనంబు కోమటులబిడ్డలపాలని యందురుగాక త
త్పరిచితి పీనిపట్టున యథార్థము గాదని చెప్పనొప్పు ని
ప్పురముఁడు చెన్నపట్నమునఁ బచ్చపకాలెజి నున్ననాఁటి య
చ్చరితము సాక్ష్యమిచ్చుఁ గడుసాహసి యీతఁడటంచుఁ జెప్పఁగన్.

ఆ॥ వె॥ నాకు వర్తకమ్మునంగల మర్మముల్
దెలియ వక్కతమునఁ దెలుపఁజాల
నితఁడు మట్టి చేతనెత్తి యద్దాని బం
గరువు సేయఁజాలు ఘనుఁడు ధ్రువము.

చ॥ ఇరువది యేండ్లకే తనదునింతిని గాంతమఁ గోలుపోయె నే
సరసిజనేత్రినే స్వజల జాయఁగఁ జేసికొనంగ మేలు నా
గలువలు చెప్పినప్పటికిఁ గాదు "సనేమిర"యంచు నీతఁడె
వ్వరికిని లోఁగఁడయ్యె నటువత్సరముల్ సనె కొన్ని రిత్తమై. ౩౦

గీ॥ అప్పు డీ బుద్ధిశాలి విద్యాగురుండు
నాగభూషణాహ్వయుఁడు విజ్ఞానఘనుఁడు
మంత్రిమును బ్రీతి నొసఁగిన మాన్యుఁ డితని
పిలిచి యొప్పించి చేయించెఁ బెండ్లి యెట్లొ. ౩౧

క॥ ఎపు డమృతానందుం డను,తపస్వికృప రెడ్డియందుఁ దవిలెనొ సకలం
బపుడే చేకుఱె సుస్థితి,కృపగల దేశికు లొసఁగని శ్రేయము లున్నే.

చ. సుకృతపుఁ గార్యముల్ సలుపఁజూచు సదా యితఁ డుత్త మోత్తముం
డకుటిల వర్తనుండు సతి యత్యనఘాత్మిక భర్తృభక్తి కా
పెకు సరి చెప్ప నేఁటిపృథివిన్ గలవారలలోన నెక్కడే
నొకరిత చిక్కుఁ బూర్వమున నుగ్మలు లిట్టిరు పెక్కు రీ భువిన్. ౩౩

గీ. పేరు లక్ష్మమ్మ వేఱొక్కపేరుగూడఁ
గలదు కనకమ యని యాపె నలఘుమతిని
మధురమృదుభాషిణిని గన్నమాన్యుఁ డెన్న
నందిపాటికులుండు గోవిందరాజు. ౩౪

క॥ సతిగూడ నీతనికి స్వన్మతి పతిభక్తిప్రవీణ మాధవపూజా
రతి దొరకుట యితని పురా,కృతమని నేసంతసించియిందునొడివితిన్.

తే॥ గీ॥ ఇతఁడు బెజవాడవాసి స్వగృహము నల్ల
గురువుపేరనె కట్టించె మఱవఁ డెపుడు
గురుని యుపదేశములు మది స్మరణసేయు
నిహముకన్నఁ బరమ్మునకే యతించు. ౩౬



కృతిపతి పరమేష్ఠి గురువులు

బ్రహ్మశ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు.

క॥ ఇందుధరునికృప వైశ్యుఁ డ,మందానందుండుజ్ఞానిమదినెపు డమృతా
నందగురుని యుపదేశము, లం దిడి తనవర్తకమ్మునందు మెలంగున్.

ఉ॥ ఆగురువర్యునం దితని కత్యధికమ్మగు భక్తియున్న, ద
య్యాగమవేదిపేర గృహ మాడట నీతఁడు గట్టె సర్వదా
ఆగురు నేమఱండు గురునన్వయ మక్కఁ తనన్ లిఖింతుఁ ద
ద్దీగణనీయదేశికుఁ డుదీర్ణగుణుండు మహానుభావుఁడున్. ౩౮

వ॥ తపోనిష్ఠాగరిష్ఠుండును గృష్ణానందనాథ దీక్షానామవిరాజితుండు నగు మల్లాది యచ్యుతరామగురుండు, మన వెంకటరెడ్డికిఁ బరమేష్ఠి గురుండు. శిష్టకులదీపకుండు, పండితాఖండలుండు మహాకవిగేయుండు నగు కృష్ణమూర్తి మనీషివరేణ్యుని శిష్యుండును, జగత్ప్రసిద్ధ విద్వన్మహాకవివరేణ్యుండు నగు కోరాడ రామచంద్రశాస్త్రివర్యుని కుమారుండు, యోగానందనాథ దీక్షాభిధాలంకృత నాగేశ్వర గురుండు మన కృతినాయకునకుఁ బరమగురుండు. ౩౯

క॥ కోరాడ వంశజుండు ను,దారుఁడు నాగేశ్వరాహ్వాయ ప్రథితుఁడు నా
సూరికి నంతర్ముఖునకు, నేరుఁ సరిగారు సుకృతి యితఁడుకృతులలోన్.

వ॥ కృతినాయకు ననుగ్రహించిన ఘనుం డమృతానందనాథాభిధా శోభితుం డగు నాగభూషణగురుండు హరిహరాత్మకతత్త్వ సమగ్రుం డగుట నమ్మహనీయుండు కృష్ణభూషణుం డనియుఁ బ్రథితుండు. సదా ఆనందోపాస్తి సలుపుటచే నానందస్వామి యనియు నమ్మహనీయుండుఁ బిలువఁబడుచుండు. మరియును యావద్భారత విజ్ఞాన సంరక్షక సర్వతంత్ర స్వతంత్రకళాశాలా నిర్మాణమునకై నిరంతరము ప్రచారము సలుపు శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యా పీఠంబునకు సంస్థాపకుం డగు శ్రీమ దమృతానందనాథనామాంకుండగునాగభూషణగురుండుమంత్ర

విద్యాగురువంశమండనాయమానుండుగను శ్రీచుండూరి నాగ
భూషణాహ్వయుండు జన్మవంశకలశపాథోరాశి శీతమయూ
ఖుండుగను నుండి యెసకమెసఁగు నీ కృతినాయకుండు వేంకట
రెడ్డి యింకను జేయఁదలంచినవి పెక్కు సుకృత కార్యంబులు
గలవు. పరమేశ్వరానుగ్రహంబున నన్నియు సఫలంబు లగుంగాక.

ఉ॥ సోమరి గాఁడొకప్పుడును సూరుల సఖ్యము నేమఱండు ని
ష్కాముఁడె యయ్యు నెల్లపుడుఁ గర్జములన్ జరియించు రెడ్డి వి
ద్యామహితుండు వీని హృదయంబు నెఱుంగుట దుర్ఘటం బగున్
భూమిని నీదృశుల్ తఱచు పుట్టరటం చనుకొందు నే మదిన్. ౪౧

వ॥ ఏతాదృశ సుగుణగణ గరిష్ఠుండును జ్ఞానగణ్యుండును బహుజన
పోషకుండును గురుచరణ నిరంతర సంసక్త చిత్తుండును అప్రమత్తుం
డును మన్మిత్రుండును నగు శ్రీచుండూరి వేంకట రెడ్డికి సతీసమేతు
నకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా రచింపంబూనిన శివభక్తియను
పరమభక్తచరిత్రంబునకుఁ గథాక్రమంబు. ౪౨

## కథాప్రారంభము

శా॥ కైలాసాచల మొప్పుమీఱుఁ ద్రిజగత్కల్యాణ సంధాయియై
నీలగ్రీవనివాసమై యమరగాణిక్యోల్లసద్గానవి
ద్యాలాస్యాదిక రంగమంగళదరీ ధాళంధళీ వ్యాప్తది
క్పాలోద్యత్పుటభేదన ప్రథితమై భాస్వచ్ఛుభశ్రీకమై.

శా॥ ఆకాశమ్మునఁ గొన్ని మైళ్ళవఱకిడ్డాయాయి వైమానికుల్
ప్రాఁక న్నేర్చిరి గాని వారలిటకున్ బ్రాఁకం బ్రయత్నించియున్
వీఁకం గోల్పడి కూలఁగాఁ బడుటయే వించుందు మచ్చోటికిన్
బ్రాఁకం గోరెడివారు గావలెఁ దపఃప్రాగ్భారపాథోనిధుల్.

తే॥ గీ॥ ఎట్టి దుర్లభ మైనది యేని తపము
కలిమికి వశం బగు నటండ్రు గాని తపము
కలియుగంబున సాధింపఁ గలుగువారు
వేల లక్షలఁ గోట్ల లభించు టరిది.

మ॥ అలకాపట్టణ మమ్మలం బొలుచు యక్షాధీశ్వరుం డప్పురం
బెలమిం బాలన సేయు నీశునెడ నాయీ శ్రీదుఁ డత్యంత భ
క్తులలో నగ్రణియౌటఁజేసి యెపుడుం దోరంపుఁ బ్రేమమ్ముతో
మలరాకూఁతుమనోహరుం డచటనే మన్నించి వర్తించెడిన్.

చ॥ శివునకు భక్తులందుఁ గల స్నేహము దేవతలం దిఁకేరికిం
దవులదు బాణుపట్టణపు ద్వారమునందు వసించినట్టి యా
భవునకు వెండికొండపయి భక్తునికై వసియించు టొప్పదే?
కవు లెవరేని యిందులకుఁ గాదని వాదొనరింప నేర్తురే.

క॥ ఇరువురు కొమరులు సాక్షాత్పరమేశ్వరియైన భార్య పరిచర్యాత
త్పరులగుప్రమథగణంబులు,పొరిఁబొరి సేవింపశివుఁడుపొలుచుం గేస్తై

సీ॥ అలకాధిపతి మేడలందుండు మని వేడు
శివుఁడు కందరమె వాంఛించుచుండు
శ్రీదుం డొసఁగుచుండుఁ జీనిచీనాంబరా
ల భవుండు తాల్చు వ్యాఘ్రాజినంబు
అగురు గంధము యక్షుఁ డర్పించు భక్తితో
ఫాలనేత్రుఁడు పూయు భస్మ మెపుడు
మణిహారము లొసంగు మానవహాయుఁడు శ్రీ
గళుఁడు పుఱ్ఱెలు పూను గళమునందు

తే॥ గీ॥ రకరకాల్ భక్ష్యభోజ్యముల్ రాజరాజు
దినదినము భక్తిమై నివేదించు, హరుఁడు

కందమూలమ్ములనె తృప్తిఁ గాంచు 'నిస్ప్ర
హస్యతు తృణం జగ' త్తను టనువు పడఁగ. ౮

తే॥ గీ॥ తనదు. మాయావిలాసంబు తథ్య మనుచు
నీశ్వరుఁడు నమ్మినప్పుడే యీ సమస్త
భోగముల కిచ్చగించెడి నాగభూషుఁ
డాదిమతపస్వి వాని కే యది రుచించు ! ౯

క॥ ఏనాఁటి ముసలియెద్దో!, దీనికి విశ్రాంతి యిచ్చి తేజీనో! మే
లౌ నాగంబునో!కొను మనఁగా నాతండేదిగూడఁగైకొనఁ డెపుడున్.

క॥ శివభక్తి గలుగుమానవు, లవుదురు కోటీశు లందు రందుకు సాక్షి
ప్రవరుఁడు కుబేరుఁడే ఆ, నవనిధు లాతనికిఁ గలుగునా? యొండేనిన్.

మ॥ శివభక్తుం డని కాదె? లక్ష్మి వరియించెన్ శ్రీహరిన్, నాటుకో
ట్లవనీపాలురఁ జేరికిన్ గొనని దివ్యద్వైభవం బొప్పఁగా
రవణింపంబడు లెక్కతాన ? శితికంఠస్వర్ణపూజామహో
త్సవసంసక్తికతానఁ గాదె? శివభక్తత్వంబు సామాన్యమే ? ౧౧

తే॥ గీ॥ పయికి నొకగేస్తువలెఁ గనంబడెడిఁ గాని
నిర్గుణబ్రహ్మ మాతండు నివురు గప్పు
నిప్పుచందంబువాఁ డిది నిఖిల మతని
సొత్తె యొకఁ డిచ్చు టేలాటి దత్తపసికి. ౧౨

తే॥ గీ॥ తానె సర్వాధినాథుఁడై తపము సేయు
టేరిఁగూరిచి? ఫలదాత యెవఁడు తనకు?
ననెడి ప్రశ్నకు నుత్తరం బసలె లేదొ?
ఉన్నదో! యెవ్వఁ డెఱుఁగు నయోమయంబు. ౧౩

తే॥ గీ॥ అట్టి పరశివునకు భక్తుఁడై మహాధ
నాఢ్యుఁడై సేవకుసికన్న నధిక వినయ

వినమితుండయి వర్తించు ఘనుఁ గుబేరుఁ
బొగడఁగాఁ దరమౌనె? నా బోటి కవికి. ౧౪

సీ॥ అభిషేక మొనరించు టనలె యక్కఱ లేదు
గంగ మూర్ధమున నుప్పొంగి పొరలు
భూషణంబు లొసంగి పూజింపఁ బనిలేదు
బాల చంద్రునిఁ జూపుపాటి చాలు
వస్త్రయుగ్మపు సమర్పణ మనావశ్యకం
బష్టదిక్కులె చేయు నట్టిసేవ
యజ్ఞోపవీతంబు లర్పించు టెందుల
కహిరాజులే తీర్తు రట్టిలోటు
తే॥ గీ॥ విషము భక్షించువానికి వివిధమధుర
భక్ష్యముల్ గూర్ప నేటికి? భక్తతతికి
నింత సులభుఁడౌ దేవర యెందుఁ గలఁడె?
భక్తి కుదిరినఁ జాలు సర్వమ్ము గలదు. ౧౫

ఉ॥ భక్తిఁ బరీక్ష సేయునెడఁ బాపముఁ బుణ్యము నుంతచూడఁ, డ
వ్యక్తపుఁ గోరికల్ వలయు నంచు విధించుఁ "దనూజు వండి మ
ద్భుక్తికిఁ బెట్టు మం"చనఁడె? "భోగపుసానిని దెచ్చి యిమ్ము మ
ద్రక్తి కటం" చనండె;యొకరాట్సుతు భక్తిఁ బరీక్ష సేయుచున్.౧౬

ఉ॥ ఇచ్చెడిపట్లఁ జేతియెడ నెమ్మనుమంతయు లేనిదాత, యే
యచ్చరలచ్చలేని కవి కప్పన సేసెడిదేవు!, డీతఁ డే
మిచ్చిన నిచ్చు భక్తి తన కెచ్చుగ నచ్చినపట్ల, నెందుకో?
యిచ్చతురుల్ గవు ల్విడిచి యేగుదు రేడకొ బిచ్చ మెత్తఁగన్.౧౭

ఆ॥ వె॥ నాటుకోట్ల కిచ్చి నరపాలురకు నిచ్చి
పేరులకు నొసంగి పేరుఁ బెంపుఁ

దెలిశి తేట గలుగు ధీరులు కవులకు
న్గొనఁగుపట్లు శివుఁడు విసిగికొనునె?

తే॥ గీ॥ కాని కవులలో నంతటి జ్ఞాన మున్న
వారు మృగ్యులు, చనుచుండు వారివారి
దేవురింపంగ నలమహాదేవుఁ గొలుచు
వారికి నిహంబుఁ బరమును వశము గాదె?

సీ॥ కన్నిచ్చి చక్రింబుఁ గైకొన్న శ్రీ మహా
విష్ణుదేవుఁడు జగద్విభుఁడు సాక్షి
తలలు హోమము చేసి త్రైలోక్య రాజ్యంబు
వరముగాఁ గొన్న రావణుఁడు సాక్షి
నడునెత్తి పగులఁగా నడిచి పాశుపతంబు
చూఱఁగొన్నట్టి యర్జునుఁడు సాక్షి
చెప్పున్న కాలితో సేవించి వాంఛితం
బార్జించికొన్న కన్నప్ప సాక్షి

తే॥ గీ॥ నమక మొకసాక్షి మఱియు స్కాందంబు సాక్షి
యుపనిషత్తులు సాక్షి దేవోత్తముండు
శివునను గ్రహ మెట్టిదో? చెప్పుపట్ల
ముని మృకండుతనూజుండు ముఖ్యసాక్షి.

తే॥ గీ॥ శివుఁడు భిక్షాటకుఁ డటంచుఁ జెప్పువారె
కాని బిచ్చ మ్మిడినవారు కానఁబడరు
అంతపాటి దేవర బిచ్చమడుగఁ బోవ
నెవఁడు పెట్టఁదగిన గేస్తుఁ డిందు నందు.

తే॥ గీ॥ విష్ణు పున్నాఁ డతఁడు బిచ్చ పెట్టఁ గలఁ డ
టన్న "జోగికు జోగియు" నన్నమాట

యెదుటఁ బ్రత్యక్షమానాతఁ డెంత సిరికి
భర్త యైనను బిచ్చమ్ము పట్టెఁ గాదె? ౨౦

చ॥ ఎవని శరీరభాగములె యీ జగమై విలసిల్లునో? అనే
కవిధపు విద్దె లెవ్వని సకాశమునుండి జనించెనో? మహా
కవియగు కాళిదా సెవనికాంతకు దాసుఁడో? వాఁడుగో? సదా
శివుఁడన? వానిపే రొసఁగు శ్రేయ మెవం డెటు లుచ్చరించినన్. ౨౧

తే॥ గీ॥ 'శివ' యనెడి శబ్దమందున్న శ్రేయమునకు
వలచికాక రెండవపెండ్లి వాని శూలి
గౌరి వరియించునే? దాని గౌరవమున
కింతకన్నను సాక్ష్య మొం డేది వలయు? ౨౨

తే॥ గీ॥ ఆయువే లేనివారల కాయు వొసఁగు
హాయి లేకున్నవారికి హాయి నొసఁగు
నెఱిఁగి తన్ను భజించిన నేదియేని
యొసఁగు నడుగనిదే పాప ముగ్రపట్ల. ౨౩

తే॥ గీ॥ ఎంతటి యరిష్టములు మూఁడెనేని జాత
కమున కవియెల్ల నీశ్వరు కతన నురుఁగు
నిట్టి పరమేశుఁ డెల్లెడ నెసఁగువాఁడె
యయ్యుఁ గైలాసమునఁ దఱ చధివసించు. ౨౪

క॥ ప్రమథగణమ్ములుగొలువఁగ
రమణీమణి గిరిజతో సురలతోఁ గొలువుం
డ మునిప్రవరుఁడు నారదుఁ
డమూంత మాకసము నుండి యచటికి దిగియెన్. ౨౫

వ॥ డిగి యప్పురాణదంపతులకు యథావిధిగ సాష్టాంగదండప్రణామం
బొనరించి యిట్లు సన్నుతించె. ౨౬

శ్లో॥ ప్రపంచచరితం విచార్యనిరతం పరాత్పరతరే రతిం కురు సఖే
నమ శ్శివాయోం నమశ్శివాయోం నమశ్శివాయోం నమశ్శి. ౨౭

శ్లో॥ పరాయచ పరాత్పరాయచ మహా
త్తరాయచ మహామహాయ భవతే॥ నమః. ౨౮

శ్లో॥ న రు జ్ఞచ జరా న శు జ్ఞచ మనో
వ్యథాఽపి న విప చ్ఛివార్పితధియామ్ ॥నమః॥ ౨౯

శ్లో॥ ఇహాఽపిచ శివం పరత్రచ శివం
శివస్మరణతః కిమ స్తి సదృశమ్॥ నమః. ౩౦

శ్లో॥ దిగంబరతయా స్థితోఽపి స దిశే
ద్దిగీశ్వరపదం స్వసేవనజుషామ్॥ నమః. ౩౧

శ్లో॥ శివేతి హర శంకరేతి గిరిశే
త్యచంచలమనా స్స్మర స్మరహరమ్॥ నమః. ౩౨

శ్లో॥ నరోఽ స్త్వపిచ వానరో స్త్వపి శివ
స్మృతి ర్దిశతి సద్గతిం జనిమతే॥ నమః. ౩౩

శ్లో॥ నహి స్మరకృతం కృతం కృత మభూ
దితఃప్రభృతి జాగృహి స్తుహి శివమ్॥ నమః ౩౪

శ్లో॥ స్వపన్నపి లప న్నపి స్థితి ముపా
గతో గతి ముపాగతోఽపి భజ తమ్॥ నమః. ౩౫

శ్లో॥ అనేకజననార్జితం జిత మఘం భవే
చ్ఛివజపా న్న తత్ర విశయః॥ నమః. ౩౬

వ॥ ఇట్లనేక ప్రకారమ్ములు సన్నుతించు నారదునకు సుప్రసన్నవదనుండు
మదనదమనుండు పరమేశ్వరుం డిట్లనియె. ౩౭

ఉ. ఎక్కడనుండిరాక? యిపు డెక్కడ నెట్టివిశేషముల్? హావి
ర్భుక్కులపట్ల భూసురులు పూజకులై సుఖమున్నవారె? యే
దిక్కునఁగాని దుర్మదు లుదీర్ణతమై మరియాద దక్కి యు
క్కెక్కి యకార్యముల్ సలుపరే? కద, నారద నిర్వచింపుమా! ౩౮

క॥ ఎంతో ఖిన్నంబుగ నీ, స్వాంతము పొడకట్టుచుండె సంసారపరి
భ్రాంతికి లోఁగని నీకుఁ, జింత ఘటించిన నిఁ కేమిచెప్పఁగవలయుఁ.

వ॥ నావుడు నారదుండు దేవా! దేవర సర్వజ్ఞుల రయ్యు నేమియు నెఱుఁగనియట్లు కించిజ్జుండనగు నన్నిట్లు ప్రశ్నించిన నేమి విన్న వించుకొందును? ఐనను దేవరయానతి యనుల్లంఘనీయం బగుటం జేసి నా చింతకుఁ గతంబు విన్నవించుకొందు. మధ్యమలోకమ్మున కిప్పుడు వాటిల్లిన ధర్మోపప్లవం బే కల్పమ్మున నే కలియుగమ్మునం గూడఁ గలిగియుండదని తోఁచెడి నని మఱియును. ౪౦

## అర్ధనారీశ్వరములు

శ్లో॥ శివ శివ శంకర శివ శివ శంకర శివ శంకర శంకర శివ శంభో.
పరమదయాకర! భయహర! శుభకర! భక్తిందిశ ముక్తిందిశ శంభో!

శ్లో॥ ధర్మములను పేరిట నపధర్మము లెన్నియో పుట్టుచున్నవి శంభో?
అవి కల్పించెడి వారవివేకులు గారు వివేకులె నిక్కము శంభో! శి॥

శ్లో॥ చేతనాయుధముకలదని పూసినచెట్టు నఱకెదరు శివ! శివ! శంభో!
ఎండినచెట్టున కా పూవు లతికి యేమో చేతురటయ్యాయొ! శంభో॥

శ్లో॥ నీవున్నావని నీమిత్రుఁడు శ్రీహరి యున్నాఁడని యెఱుఁగరు శంభో!
గుడిలో నున్నది ఱాయే యని నిశ్చయ మేర్పడ్డది వారికి శంభో॥

శ్లో॥ బ్రాహ్మణబ్రువులు వేదశాస్త్రములు వెక్కిరించుటకు వెఱవరు శంభో!
ఇట్టి విపర్యాసము చూచియు నీవేలాగున నూరకుంటి శంభో॥ ౪౬

శ్లో॥ కులంగాంచినవారికిఁబూర్వము కొండంతపున్నె మనిగద శంభో !
ఇప్పుడు కులంగాంచినవారికి నెట్టినరకమో తెలియదు! శంభో॥

శ్లో॥ జాత్యుత్కృష్టత నేఁటివారలకు నెందులకుఁ గొఱగాదఁట! శంభో!
ఇచ్చి పుచ్చుకొను నప్డుకూడఁ గుల మెట్టిదైన సరియేనఁట శంభో॥

శ్లో॥ ఉన్నారింకను ధర్మవేత్త లగు నూర్జితమతు లచ్చటచట శంభో !
వారిమాటలను వినువారు లేరు నూటి కొకరైన మచ్చుకు శంభో॥

శ్లో॥ ఇది యేమి ఘోరమిదియేమి పాప? మిది యేమి ధర్మ మెట్లోఁక శంభో!
జాతిభేద మంతరించినప్పుడె చచ్చె భరతఖండము శివ ! శంభో॥

శ్లో॥ కాకులనుగొట్టి గ్రద్దలకు వేయు పనులు మొదలు వెట్టిరి గద? శంభో!
ఇవి యిహానకే కాక పరానకు హానికరములని యెఱుఁగరుశంభో॥

శ్లో॥ ఓనమాలు వచ్చిన ప్రతివాఁడును పండితబిరుదాంకితుఁడే శంభో!
పండితశబ్దానకు నెంతటి దురవస్థ పట్టినదొ చూడుము శంభో॥

శ్లో॥ వశముగాని సంస్కరణము లెత్తిరి జగచ్ఛ్రియమున కంచును శంభో!
ఇవి తుద నెగ్గిన నెగ్గక యున్నను నిప్పు డెంద ఱికొ ముప్పగు శంభో॥

శ్లో॥ అప్పుల నెగఁగొట్టుట దోసము గాదని యొక్కఁడునొక్కి చెప్పశంభో!
వ్యభిచరించుటయు వివాహ మేయనిమఱియొక్కఁడుపన్యసించుశంభో॥

శ్లో॥ మునిఁగిపోవుచున్నదిగద? లోకము ముప్పులలో నిఁక నాగదుశంభో!
అప్పులు పోయెడి నెగఁబెట్టినచో ముప్పు లటులు పోవవుగద!శంభో॥

శ్లో॥ ముప్పునుండి తప్పించి లోకమును గాపాడుట నీ భారము శంభో!
నీయునికి దెల్పి లోకము నెటులో నిల్ప సమయ మిది గదయ్య!శంభో॥

శ్లో॥ దేవాలయములు పాడఱుకాలము సమీపించినది కంటివె? శంభో!
ఎక్కడనుండెద వీ పైని నీకుఁ జోటే కనుపడదుగదా? శంభో.౫౭

శ్లో॥ మలయమారుతము, వలెఁగద? పాప్రజ్ఞులు మసలుకొనుటమున్నుండెను
ఇప్పటిపాప్రజ్ఞులనడవడి వేసఁగి, గాడుపు,కన్నను, ఘోరము శంభో॥

శ్లో॥ ఎవ రెట్టిపాట్లు, పడినను బరమం, దేదో యున్నద,నియెగద?శంభో
అట్టిపర మ్మొకఁ, డసలే లేదని, అందఱికిఁ దెలియ,వచ్చెను శంభో॥

శ్లో॥ అందుచే "ఋణం,కృత్వాఘృత"మను,పండితోక్తి ధ్రువ, మయ్యెను
ఎంతమంచికా,లముఁజూపించితి, వెచ్చుజీవితము, నిటు లిడి శంభో॥

శ్లో॥ అల్లుళ్ళకిచ్చు,కట్నంపు ఋణము,లన్నియు ఋణదా,తలవే శంభో?
మేడలు మిద్దెలు, ఋణదాతలె క, ట్టిపెట్టిరేకా, రణమో? శంభో॥

శ్లో॥ ఏడువ నేర్చిన, వ్యవసాయమ్మని, యెల్లపెద్దలం, దురుగద? శంభో
అట్టిగేస్తు లవ,కాశము దొరకిన,నప్పులు తీర్పఁ, దలంతురె?శంభో॥

శ్లో॥ పరద్రవ్యమది, లోష్టంబనియెడి, భావ మంతరిం, చెనుగద? శంభో?
పరద్రవ్యమది,బెల్లంబనియెడి,భావమెల్లయెడఁ, బ్రబలెను శంభో॥

శ్లో॥ వేయిమాట లిఁకఁ, జెప్పఁగనేటికి, వేదశాస్త్రములు,తప్పులుశంభో!
యెవరోచెప్పెడి,పొల్లుమాటలే, యిప్పుడు వేదము, లాయెనుశంభో

శ్లో॥ ఎట్లు గృహస్థుల,జీవితమ్మునకు, హాయి ఘటించెడి, నియ్యెడ శంభో
"పిల్లికిఁజెలగా,టమ్మునెలుకకుఁ, బ్రాణపోక",డిదియగుఁగద ॥

శ్లో॥ భ్రమప్రమాదం,బులు తప్పవుగద?,మానవబుద్ధుల, కెందును శంభో?
తత్ఫలితం బిత,రులపై రుద్దుట,తగని దోసమగుఁ,గదయ్యా? శంభో॥

వ॥ ఇట్లేదో పట్టరాని చింతాభరమ్మున నారదుండు తాను యతియయ్యుఁ దన్నియమమ్ముగూడఁ జాలవఱ కుల్లంఘించి గేయసరణిని జగదుపప్లవంబును విన్నవించుటయు మహాదేవుం డయ్యనఘున కిట్లనియె.

ఉ॥ నారద? నీ వచించినది నా మది కెక్కె యుగానుసారులై
పాఱులు లోనుగాఁ గలుగువారలు వర్తిలుచున్నవార లీ

తీరు నవీన మౌనె? భవదీయమనం బిది విస్మరించెనే?
మాఱుపు లిట్టి వష్టపుడు మానవు వచ్చుచుఁ బోవుచుండెదుర్. ౬౮

వ॥ నావుడు నారదుండు. ౬౯

చ॥ ఎఱుఁగుదు విస్మరింప మఱి యెన్ని యుగమ్ములనాఁటి గాథలో
తిరిగెడి నా తలఁ; బ్రకృతదీనత బ్రాహ్మణజాతి కెన్నఁడుర్
బొరసినయట్లు లేదనుచుఁ బొక్కెద బ్రాహ్మణజాతి ధర్మముల్
దొరఁగిన భారతావనికి దుర్దశ పూర్తిగ మూఁడి రూపఱుర్. ౭౦

తే॥ గీ॥ ఎన్నఁడో భర్త వీడి యెందేనిఁ జనిన
యాపె కొడుకున కిడియెఁ గన్యక నొకండు
మఱియొకం డాపెకూఁతును బరిణయంబుఁ
జేసికొనియె బ్రాహ్మణ్యపుఁ జేవఁ గంటె. ౭౧

ఉ॥ వారలఁ "ద్రోసిరా" యనుచు వంగడము న్నిలఁబెట్టుకోఁగ నే
దారియు లేదు తాదృశుల తండము హెచ్చుగ నుంటఁజేసి దు
ర్వారముగాఁ బయింబడి కరంబు భరంబయి శుద్ధుల న్నమ
స్కారము సేయఁజేసెదరు కాలమహత్త్వ యిటుల్ పొకాలెడిర్. ౭౨

తే॥ గీ॥ కాపురము వీడి పోయిన కాంత యుండు
గాక వారలు సంతతిఁ గాంతుగాక
మరల వత్తురె? వచ్చి సంబంధబాంధ
వములు సేతురె? తోయమ్ము వారితోడ. 23

చ॥ "ప్రవర" లటంచుఁ జెప్పెదరు పాఱులు పెండిలి వేళ; దీన నా
ప్రవర యెటుల్ వచింపవలెఁ బ్రాథమికంబొ? అనంతరమ్మునం
దవిలినదో? పురోహితులు ధర్మ మెటుల్ నేఱవేర్చిరో? కటా!
శివ! శివ! యిట్టిరోఁతలకు జింతజనించి వృథా కృశించెదర్. ౭౪

మ॥ కులభేదమ్ములు లేనిదేశములకే గొండాటయ్యుఁ లేదు దు
ష్కలికాలం బగుఁగాక యింతటి మహాకాశ్మల్య మీనాఁటి పె
ద్దలు సైరించుచు మిన్నకుండెద రెదో ధర్మమ్ము శాసింప వా
రల సంఘం బది హెచ్చి వీరల కమర్యాదల్ పొరిఁ మూఁడెడిఁ. ౭౫

తే॥ గీ॥ ఎవనికర్మము వానిదానేని యింత
గా విచారింపఁ బనిలేదు కశ్మలమిది
కులము సర్వమ్ము చెఱిచెడి గోడు మూఁడె
నెట్లు సైరింపవచ్చు మహేశ? చెపుమ. ౭౬

క॥ ఇది యొక్కటిమాత్రమె కా
దెది చూచిన నిట్టె యున్న దిది మఱియుఁ బె
ట్టిదముగ నుండుటచే నా
హృదయమునకు వెగటు గదిరి యిటు చింతింతుఁ. ౭౭

వ॥ నావుడు మహాదేవుండు మందస్మితం బొనర్చి యిట్లను. ౭౮

క॥ ఎవఁడో చేసిన దురితం, బెవనికొ ఘటియించు ననుటయే వెఱ్ఱి, అటుల్
దవులదని మిన్నకుండిన, నవుఁబాటని కట్టుఁబా టొనర్చెద రార్యుల్.

ఆ॥ వె॥ ఎన్ని కట్టుఁబాటు లేర్పాటు చేసిన
స్వార్థపరులు వాని నవల నెట్టి
అవకతవక పనుల నాచరించుచు నుందు
రిపుడె పుట్టెనొక్కొ? యిట్టి దొసఁగు. ౮౦

వ॥ అది యటులుండె నేనును హరివిరించనులును శక్త్యధీనుల మని చెప్పుచో నితరలోకులం గుఱిచి వక్కాణింపవలసి యుండదు. అప్పరశక్తి సగుణయనియు నిర్గుణయనియు ద్వైవిధ్యంబు గలయది. నిర్గుణశక్తికే పరాశక్తి యని నామాంతరంబు. తన్మహిమమ్ము తన్మాత్రగోచరం బగుట నస్మదాదుల కగమ్యం బని వెండియు. ౮౧

శా॥ ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యుం డయ్యజుం డయ్యుకా
రాంకుం డాతనితండ్రి విష్ణువు మకారాంకుండ నేనాదుఁ ద
త్సంకేతమ్మున నుత్తరోత్తరము ప్రాశస్త్యమ్ము వాటిల్లు ని
శ్శంకన్ బైఁ దగునర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్. ౮౨

తే॥ గీ॥ ఆపెచే గీలుబొమ్మలై యఖిలజగము
నందు నర్తించు జీవులం దగ్రగణ్యు
లేను హరియు విరించియు నింత నిజము
సకలజగమును నాపె వశమ్ము నమ్ము. ౮౩

ఉ॥ ఆపెవిలాసముల్ జగము నట్టిటు లూఁగఁగఁ జేయు గొంద ఱే
దో పొనరింతు రయ్యదియె యుక్తమటంచుఁ దలంతు రొంద ఱే
దో పొనరించి యయ్యదియె యుక్తమటంచుఁ దలంతు రేది మం
చో పరికింప నేర్చినది సూనృతవేత్త్రి పరాంబమాత్రమే. ౮౪

వ॥ నావుడు నారదుండు, ౮౫

తే॥ గీ॥ ధర్మమున కప్పుడప్పు డధర్మపీడ
దగులుచుండెడి దానిని జగదధీశు
లైన తాము వారింపరయేని జగము
ధోగతికి వచ్చునే కాని బాగుపడదు. ౮౬

వ॥ కావున నేదేని సదుపాయం బాలోచింపవలయు ననుడు మహాదే
వుండు కెలన నున్న పరమభక్తుఁ గుబేరుం జూచి. ౮౭

తే॥ గీ॥ నారదుం డాడుమాట విన్నావు గాన
ధర్మవిప్లవ మణఁగింప ధరణి నీవు
మనుజమూర్తిగఁ బుట్టి ధర్మమ్ము నిలిపి
మరలఁ జనుదెమ్ము నావుడు మనుజహాయుఁడు. ౮౮

వ॥ కరమ్ములు మొగిచి నమస్కరించి సకరుణమ్ముగ నిట్లు వక్కా-
ణించె. ౮౯

క॥ నను మనుజజన్మమునకుఁ, జనుమని మీ రానతీయఁ జనునే? గర్భం
బను నరకాలయ మొందుట,కు నేమి నే ద్రోసఁగు చేసికొంటిని దేవా!

తే॥ గీ॥ గర్భమున కెక్కుడగు నరకమ్ము లేదు
పురువు లంగమ్ములను బట్టి పొడుచు నాఁక
లి యధికమ్ముగఁ బీడించు లేవరాదు
పదినెలలకష్ట మియ్యది పార్వతీశ. ౯౦

తే॥ గీ॥ దారుణమ్మగు యోనియంత్రమ్ము వెడలి
పడుట యొకకష్ట మా మీఁద బాల్యమం ద
నేకములు కష్టములు చెప్పనేల? దీని
నేవగింతురు తత్త్వజ్ఞు లెఱుకకలిమి. ౯౨

క॥ ఏనాఁటి పుణ్యముననో, యీనాఁడు దిగీశపదవి కే నర్హుఁడనై
నీ నేస్తమ్మున మనియెద, మానవజని నెత్తి యెట్లు మననేర్తు శివా. ౯౩

చ॥ బ్రతుకుచునుంటి హాయిగ భవత్పదపూజన మాచరించుచుఁ
శితిగళ! నన్ను నేమిటికిఁ జిక్కుల కిల్లెరఁజేయ నెంచి తే
నతితరభక్తిఁ దావకపదాంబుజముల్ భజియించుచుంటి స్వ
ర్గతుల కనర్హమైనది ధరాస్థలిఁ బుట్టుట కెట్లు లొప్పుదుఁ. ౯౪

మ॥ నినుఁ బూజించుకతాన నే నిధులకు న్నేతృత్వముఁ గంటి నా
ధన మెంతో అది లెక్క పెట్టుటకు నేతండేనియు న్నేరఁ డ
ట్లని నీపూజన మేను మాననుగదా! అంహోవహంబైన దు
ర్మనుజత్వమ్మున కేల పంపెదు ననుఁ రాజేశు రాట్ఛేఖరా. ౯౫

ఉ॥ ఏ నొనరించుపున్నె మది యెల్ల వ్యయంబయి పోమెనేని నే
మానవలోక మేగు టది మాననిదే, నిజ మీవ చెప్పు మ

శైనయేర్క జనింతు నట; నట్టులు గామియె నిక్కమేని న
న్మానవుఁగా జనింపు మనుమాటకు నర్థము లేదు దేవరా. ౯౬

వ॥ ఇట్లు సోపపత్తికంబుగను సభక్తికంబుగను సయుక్తికంబుగను ఖండి
తంబుగను బ్రశ్నించు నుత్తరదిగధీశునకు నీశానుండు సబహుమాన
మ్మగ నిట్లను. ౯౭

తే॥ గీ॥ నీదు సుకృతం బిపుడ కాదు మీఁదఁగూడ
నెన్ని కల్పమ్ములకు నేని యింకఁబోదు
మనుజలోకమ్మునందలి జనియుఁగూడ
ఘనత కే కాని మఱియొండు గాదు సఖుఁడ. ౯౮

క॥ శ్రీనాథుఁడు మన్మిత్రుం, డేనును నరజన్మమెత్తమే? అది నీచం
బే? నరజన్మము; నరుఁడును, శ్రీనారాయణుఁడు నెత్తరే?మనుజజనిన్.

క॥ శ్రీరాముఁడు నరుఁడేకద?, ఆ రాముని కున్నఘనత అజునకు శ్రీమ
న్నారాయణునకు నాకు ను,దారగుణా? లేనిమాటతథ్యమెఱుఁగుమా?

క॥ తారకమంత్రము రాముని, పేరంగల యక్కరములె ప్రేయసితో నో
రార జపియింతు నరుఁడని,యేరా రాము నెడఁ బ్రీతి నెనయరు సఖుఁడా.

ఉ॥ భారతభూమిలోన జని ప్రబ్బిన పుణ్యులకన్న నాకిసం
సారు లదృష్టవంతులె? నిజంబు వచించెద నున్పులాఁగదా ?
దూరపుఁగొండ లక్కతనఁ దోఁచియె తోఁచకొ కొంతమంది సం
సారులు కోరిచేయుదురు స్వర్గమొసంగెడి యజ్ఞయాగముల్. ౧౦౨

చ॥ సురపతిమెచ్చి స్వర్గమిడఁజూచిన వల్దదు వల్దదంచు ధి
క్కరణముఁ జూపినట్టి మునికాంతుల నెండఁజూడలేదు భూ
వరుఁడు విదేహుఁడాది గలవారలు జ్ఞాను లనేకు, లెన్నియో
దురితహరమ్ములందలి నదుల్; నరలోక మనంగ నల్పమే. ౧౦౩

తే॥ గీ॥ ఇతర పుణ్యలోకస్థుల కెపుడొ పెట్టి
పుట్టినట్టి పున్నెము వ్యయపెట్టుకొనుటె
కాని నరలోక వాసులు కర్మపరులు
పున్నె మార్జించుకొను తోవ లెన్నొ కలవు. ౧౦౪

శా॥ ఎన్నో క్షేత్రము లుండెఁ గాశి మొద; లే నిందెప్పుడో గాని యుం
డ న్నాముఖ్యనివాస మయ్యెదియొ జన్మంబందుఁ బ్రాప్తించు నే
ని స్సీ చాతివినీచమైన పురుగు న్నిక్కంబు నా రూపునో?
నన్నో పొందెడిఁ గాశిఁ బోలఁగలవే? నాకమ్ములుం గీకముల్.

ఉ॥ ఉత్తరమందె కాదు మఱి యున్నవి దక్షిణమందు క్షేత్రముల్
చిత్తహరమ్ము లెన్నియొ ప్రసిద్ధము, లేనును మత్సఖుండు న
య్యుత్తమతీర్థరాజముల నందుము కాపుర, మల్లవాని పే
ళ్ళెత్తి వచింపనేల? స్వయ మేగియె చూచెదు కొన్నినాళ్ళలో. ౧౦౬

వ॥ అదియునుంగాక. ౧౦౭

ఉ॥ భూపరిపాలనమ్మునకుఁ బొమ్మని పంపుట లేదు దానిలోఁ
శాపము చుట్టుముట్టు ననుభావము నీకుదయింపవచ్చు దు
ర్వ్యాపృతులై సనాతనరహస్యములన్ దెలియంగలేని య
ప్పాపుల నుద్ధరించుటకుఁ బంపెద నీ కెఱుఁగంగఁ జెప్పితిన్. ౧౦౮

క॥ లోకవ్యాపారమ్ములు, సోఁకవు ని,న్నితర మెట్టి శోకము నీకున్
దాఁకదు జ్ఞానధనుఁడవై, నాకార్యము సేయుమయ్య! నా ప్రతినిధివై.

తే॥ గీ॥ మాయ నీ చాయనేనియు డాయఁబోదు
నేను గాపాడుచుండెద నీకు దీనఁ
గలుగు దోసంబు పీసంబు గానరాదు
దీని కియ్యకొనఁగదయ్య? మానవహాయ? ౧౧౦

వ॥ మఱియు మానవలోకమ్మున. ౧౧౧

మ॥ వివిధమ్ముల్ నదు లుండు నందొకటి కావేరీనదీరాజ మా
సవిధమ్మందున రంగనాయకుడు నిచ్చల్ వొల్చు దేవేరితో
భవుకాధాయినియైన యవ్విరజకున్ బైదానిఁగా దాని వై
ష్ణవు లుత్కృష్టులు గౌరవింతు రనఁ దన్మాహాత్మ్య మింతింత యే.

శా॥ కావేరీతట మందొకంట నలరున్ గావేరి యన్పత్తనం
బావాసం బది సర్వవిద్యలకు భవ్యైశ్వర్యధుర్యంబు భూ
దేవాదుల్ మఱినాల్గువర్ణము లటన్ దీపించు విద్యుక్తస
ద్దైవోపాస్తికి నాలవాలములు నిన్ దద్వాటికిం బంపెదన్. ౧౧౩

మ॥ మన కిచ్చో నొక కల్పవృక్షములె సామాన్యమ్ముగా నుండె మో
హనమైనట్టి కవేరజాతటమునం దగ్గడ్డ రంభాకురు
ట్పనసానోకహ నారికేళకుజ నీపక్ష్మాజముల్ నిత్యయా
వనసంపత్తికిఁ దానకమ్ము లగుచున్ వర్ధిల్లు సిద్ధౌషధుల్. ౧౧౪

ఉ॥ ఎంత మనోహరంబొ ! అది యియ్యదియే వచియించు శ్రీరమా
కాంతుఁడు రావణానుజుని గాదని లంకకు నేగ కన్నదీ
ప్రాంతమునంద యాఁగె నది వాసి చనన్ మదిరాక, ఆడ కే
ధ్వాంతచరాధినేత చని తద్విభుఁ బూజలఁ దన్పు నేఁటికిన్. ౧౧౫

ఉ॥ చెప్పెడి దేమి! యన్నదివిశేషము, లచ్చటి పుణ్యతీర్థముల్
గొప్పగు దేవళమ్ములును గోపురముల్ పురముల్ గిరుల్ ముదం
బుప్పతిలంగఁజేయు, నిది యొండు నిమిత్తము సంఘటించుటన్
దప్పక యేగి కన్గొనెదు తత్తదశేషవిశేషసంపదల్. ౧౧౬

క॥ ఒకకావేరీతటమునఁ, బ్రకటప్రాభవము లుండె బహుతీర్థము లో
పిక కల్గి చూచువారల,కికఁ దీర్థము లెన్నొ కల వహీనములు భువిన్.

సీ॥ కైలాసమునకన్నఁ గడు హెచ్చనినఁ జాలుఁ
గాశిని వినుతింపఁగలఁ డెవండు?
వైకుంఠమునకన్న వైభవంబున మిన్న
శ్రీరంగమును జెప్పి చెప్పవలెనె?
ముల్లోకముల తీర్థముల మూలకందంబు
శ్రీశైలపుమహత్త్వ చెప్పనేల?
పిలిచిన వెంటనే పలికెడి తిరుపతి
వేంకటేశ్వరుని సేవింపవలదె?
తే॥ గీ॥ ఆదిశక్తులు వసియించునట్టి మధుర
కాంచి బెజవాడ లోనుగాఁ గలవు కొన్ని
తీర్థములు వానినెల్లను దిరిగి చూడఁ
గలవు మానవజన్మంబు గాంచుపిదప. ౧౧౯

మ॥ బెజవాడం గల కృష్ణలో మునిఁగి భూభృన్మౌళిపై సర్వధా
భజనీయమ్ములు దుర్గపాదములకున్ భక్తిన్ బ్రణామిల్లి యే
కుజనుం డేనియు నొక్కవత్సరములోఁ గూ్రరాఘముల్ వాసి బల్
సుజనుండౌఁ జుమి? నమ్ము మీ విషయమున్ శోధించి వాక్రుచ్చితిన్. ౧౨౦

తే॥ గీ॥ అర్జునుం డిచ్చటనె తపం బాచరించి
నన్ను మెప్పించి కైకొనె నా కతమునఁ
బాశుపత మస్త్రరాజ మీ పర్వతమును
బోలు పర్వతములు మృగ్యములు ధరిత్రి. ౧౨౧

శా॥ భూలోకంబన నీసడించెదరు స్వర్భోగమ్ములం జొక్కి యా
నైలింపాంగన లాసఁజేయఁదగు విన్నాణంబు లాలోకమం
దోలాడున్ బ్రివరాఖ్యుఁ డెవ్వఁడు మనుష్యుండేకదా? వానికై
వాలాయమ్ము వరూధినీగణిక ముక్ వాంఛించు టాలింపమే. ౧౨౨

శా॥ ఈ కైలాసముమాత్ర మెక్కుడిదహో! పృథ్వీధరేంద్రంబ కా
దే? కన్గొమ్ము హిమాద్రిశృంగములలో నీ పర్వత మ్మెక్కుడా?
లోకాలోకము మేరుమందరము లా లోకమ్ములో నున్న వే
నీకుం జెప్పఁగనేల నీవెఱుఁగవే నీచంబులే భూగిరుల్. ౧౨౩

మ॥ క్షణముక్తీశుఁడు కోటిలింగపతి ద్రాక్షారామ భీమేశుఁడుం
మణిమంత్రౌషధముల్ మహానదులు సామ్రాజ్యాధిపత్యాంకితుల్
గుణరాసుల్ నృపతుల్ పతివ్రతలు భూగోళమ్మునం దెల్లెడన్
గణనాతీతముగా నెసంగెదరు సత్కావ్యగ్రణుల్ పేర్కొనన్. ౧౨౪

శా॥ నీ కొండొక్క విమానముండె నదియు న్నీ వెంతొ భద్రమ్ముగా
వీఁకన్ డాఁచుక యుండు వీ పయిని బృథ్విం గొన్నినా ళ్ళైగుచో
నాకాశమ్మున డేగలన్ బలె విమానానీకముల్ పర్వెడు
న్నాకంబే యగు భూతల మ్మఖిలము న్నామాట పొల్లెట్లగున్. ౧౨౫

ఉ॥ వేలకువేల యామడల విక్కడి యంత్రము లేగుదెంచు మే
ఘాలకుఁ బైకిఁబోయి కడఁకన్ మఱి యక్కడనుండి దూఁకఁగా
జాలెడి శక్తి పుట్టు మనుజన్ముల కింకొక కొన్నినాళ్ళ కు
ద్వేలవిచిత్రచిత్రములు పృథ్వి జనించు నెఱుంగఁజెప్పితిన్. ౧౨౬

మ॥ ఎపుడో రాఁగలవాని కేమి? యిపుడే యీ స్వర్గలోకాదు ల
వ్విపులన్ బోలవటంచుఁ జెప్పఁదగు నిర్వేలంపు సౌఖ్యమ్ము లం
దపురూపమ్ము లనేక మున్నయవి నీ వందేగి యప్పుణ్యలో
కపుసౌభాగ్యము సుప్రతిష్ఠయును జక్కన్నిల్ప యత్నింపుమా?

వ॥ అని మఱియును. ౧౨౭

ఉ॥ లోకము చాలమంచిదియె లోకులు నట్టిరె కాని వీఁక దు
ర్ధీకులు గొంద ఱుద్భవిలి దేశపుబాగున కంచు సద్ధ్విజా

నీకము లేర్పరించిన మనీషిహితాచరణమ్ములం దనా
స్థాకత గల్గఁజేసెదరు దానిని నీ వుడిగింపఁగా వలెన్. ౧౨౯

క॥ మనుజుం డేది యొనర్చినఁ
దనబుద్ధి ప్రమాణ మనుచుఁ దలఁచి సలుపరా
దనఘము వేదము దానిన్
దనబుద్ధికిఁ దోడు సేయఁదగు నెప్పట్లన్. ౧౩౦

క॥ వేదము లపౌరుషేయము
లాది యెపుడో చెప్పఁజాల మజుఁడే హరియున్
గాదని వానిం ద్రోయుచు
నేది యొనర్చినను దురితమే యేర్పడెడిన్. ౧౩౧

తే॥ గీ॥ పయికి మంచిగాఁ దోఁచియుఁ బాప మిచ్చు
కార్యములు గొన్ని కన్పడుఁ గశ్మలముగఁ
బైకిఁగన్పట్టియును బుణ్యబహుళమైన
కార్యములు గొన్ని కన్పడుఁ గనుము సఖుఁడ? ౧౩౨

క॥ తా నెంతటి వాఁడైనను,వీని వినిర్ణయముపట్ల వేదమునే స
మ్మానింపవలయు నొజ్జగఁ, దానై యొనరించెనేని దగ్ధపటలమా.

క॥ కలుగు ననర్థపరంపర, లిల తలకిందులగునట్లు లెన్నియొ యిపు డెం
దుల కావిలయముత్వరలోఁ,గలుగదుభయపడకుమరుగఁగాఁదగుభువికిన్.

క॥ ఇపు డొక్కనాస్తికతయే, ప్రపంచమున మొలకలెత్తి రాఁబోవు నన
ర్థపుఁ దెరఁగుఁదెల్పుచున్నది,కృపాణమై దాని నీవు గీటడఁపవలెన్.

వ॥ అని కొండొక యోజించి వెండియు. ౧౩౬

క॥ కలియుగముగనుకనెట్లున్,గలుగు ననర్థములు వాని కాశ్మల్యమ్మున్
దొలఁగింప నెవరితరమగు?,బలమెక్కుడు దానిదనియు భావింతు నెదన్.

క॥ యుగబలముకలిమి మూఁడెడి,
విగర్వ్యాయములఁ నాఁగనెంచు విధమదియును వె
ల్తిగనే కన్పడు ననియు నె,
ఱుఁగుదు నెఱింగియును నీబరువు నినుఁ బూన్తుక్. ౧౩౭

తే॥ గీ॥ నారదుం డేగి చూచి యాఘోరములను
నన్నుఁ జేరి రేచినం గాదు నాక నేను
యత్న మొనరింతు నంటిని "నవులనుండి
నటికికొని రమ్మ"టన్నమా టెఱుఁగవాకొ. ౧౩౯

ఉ॥ "కంటికి ఱెప్పరీతి" నినుఁ గాచుచు నుండెద నీకుఁ బాతకం
బంటఁగనీను జ్ఞానఘనివై జనియించెదు వైశ్యునింట నే
మంటివయేని బ్రాహ్మణులయందును క్షత్రియులందు భీతి లే
కుంటయు వైశ్యులందు నదియుంటయు నేఁ గనిపెట్టితింజుమీ. ౧౪౦

చ॥ ఇతరకులమ్ము లేవి యెటు లెంతగ నుత్ప్రథగాములైన దు
ర్గతియెడ నంతొ యింతొ మదిఁ గాతరభావము గల్గి యేమొ? న
మ్రతయును దైవభక్తియును మంచియుఁ జెడ్డయుఁ జూచుబుద్ధి దా
తృత యివి వైశ్యులక్ విడిచి యేగినయ ట్లగుపట్ట దిప్పుడుక్. ౧౪౧

మ॥ ధనమార్జించెడి నేర్పె కాద అది యుక్తంబౌగతిక్ గర్చు వై
ట్టను నేర్పున్నది వైశ్యజాతి యొకటే, డాబుల్ మఱిక్ దర్పముల్
"పనికిక్ మాలిన" వం చెఱింగినది యీవైశ్యాన్వయ మ్మొక్కటే.
యని ని న్నీ కులమందుఁ బుట్టుమని నే నంటిక్ సుహృత్సత్తమా?

తే॥ గీ॥ బిరుదు లన్నిటికన్నను బెద్దబిరుదు
సజ్జనుం డను నదియును సాధువనెడు
నదియు నీ శబ్దములు వైశ్యులందుఁ గవులు
వాఁడుచున్నార లిది మహాభాగ్య మనఘ!. ౧౪౩

చ॥ ఇదియునుగాక వైశ్యులకు నే కవియైనను బోల్కి చెప్ప న
య్యదన నిన్ స్మరించుటది యంద తెలుంగుదు రట్లుగాన భా
గ్యదమగు వైశ్యసత్కులమునందు జనింపు మపారమైన సం
పద గలఁ డొక్కవైశ్యమణి మన్మనమందు స్ఫురించె నియ్యెడన్.

మ॥ శివనేశుం డను వైశ్యసత్తముఁడు సుశ్రీకుండు కోటీశ్వరుం
డవనీపాలురకన్న మిన్న యతఁ డైశ్వర్యపర్యాప్తుఁ డ
య్యు వశీభూతమనస్కుఁడై సతము నుద్యోగించు "నీ లోకమం
దవలంగూడఁ దరించుటె" ట్లనుచు సారాచారసంపన్నుఁడై. ౧౮౫

మ॥ ధనసంపాదన కెన్నియో గల విలన్ దత్తన్మహోపాయముల్
ఘను లవ్వానిఁ బరీక్షచేసియె వణిగ్వ్యాపారమే శ్రీకరం
బని వాక్రుచ్చిరి కాని యందు నియతంబై వంచకత్వంబు నె
మ్మనముల్ గుంజఁ దొడంగుటన్ బుధులు సమ్మానింప రీవ్యాపృతిన్

వ॥ బాగుగఁ బరిశీలించినచో నియ్యది వ్యక్తిగతదోషంబు గాని
వృత్తిగతదోషంబు గాదని వెండియు. ౧౮౬

మ॥ ఒకవాణిజ్యమునందె కాదు మఱి యే యుద్యోగమం దేని వం
చకతన్ జూపెడివారు చూపుదురు సత్త్వాంతుల్ ప్రతివ్యాపృతిన్
ముకుసూటిన్ జరియింతు రట్లగుటచే మూర్ఖుల్ వినా యేరు వ
ర్తకవృత్తిన్ దెగడం గడంగ రనఘుల్ దానం గలా రెందఱో.

మ॥ అలఁతుల్ సల్పెడి దుష్కృతుల్ ఘనులపై నందందుఁ గొందర్మనీ
షు లుదారత్వము లేమిఁ బొల్పుదురు విజ్ఞుల్ చాల శోధించి య
ప్పలుకుల్ తప్పని త్రోసిపుచ్చి గొనముల్ బాటింతు రే వృత్తియున్
ఖలునిన్ జేరి యయోగ్యమౌ,సుజనునిన్ గామించి పూజార్హమౌ.

మ॥ ప్రకృతింబున్ విను మీతఁ డెన్నఁడు నుడిం బల్కం డసత్యంబు వ
డ్డికి నీఁ డొక్కట నిచ్చుచో మిగుల దండింపండు లెక్కించుచోఁ

బ్రికటించున్ దయ రిక్తులందు మఱియున్ బంధువ్రజమ్మందు బ్రి
హ్మాకులమ్మందును, మానఁ డెన్నఁడు దపస్స్వాధ్యాయ సంతర్పణల్

ఉ॥ ఊరుజవృత్తి వర్తక మదొక్కటిమాత్రమె కాదు జీవనా
ధారపువృత్తియైన కృషి తత్కులవృత్తియె ఆలపాలన
మ్మూరుజవృత్తియే తుదకు నొక్కటితక్క సమస్త మంఘ్రిజుల్
చేరి భజించి కైకొనిరి సేవకులై యుగధర్మవిప్లుతిన్. ౧౫౧

క॥ చేకొండ్రుగాక వైశ్యులు, గైకొని సేద్య మ్మొనర్పఁ గాపులువారిన్
డీకొని వారింపమి విను, లేకొండఱొ చేయుచుండ్రు కృషిగోరక్షల్.

క॥ మన శివనేశుఁడు నట్లే,
తనవృత్తులలోనివౌటఁ దత్కృషిగోపా
లనముల నొనర్చు వర్తక,
మును బొనరుచు జపమును దపమును బొనరించున్. ౧౫౩

మ॥ విపరీతంబగు లాభమున్ గొనఁగ నువ్విళ్లూరఁ డేనాఁడు త్రా
మపుఁగోర్కుల్ మదిఁ బుట్టనీయఁడు యథామాత్రంపులాభానఁ దు
ష్టిపడున్ బొంకఁడు బొంకువారల దరిన్ జేర్పండు చేరండు శ్రే
ష్ఠిపదుం డా శివనేశుఁ డయ్యనఘుఁ దండ్రింగాఁ గొనం బోలదే?

క॥ కావేరితీరమ్మునఁ
గావేరీ పురమునందుఁ గాపుర మతఁడున్
దేవేరియు నుందురు విను
మే వైశ్యులుఁ గూడ నతని కెనఁగారు భువిన్. ౧౫౫

తే॥ గీ॥ అతఁడు పరమపవిత్రుఁడు ననృతదూరుఁ
డన్వయాచారపరుఁడు వేదాంతవేత్త
అర్థిజనకల్పవృక్షంబు స్వార్థరహితుఁ
డతనికిఁ గుమారుఁడవు గమ్ము వితతయశుఁడ. ౧౫౬

క॥ యజనాధ్యయనమ్ములు దా
నజపము లేమఱఁడు యాజనమునకునై యెం
దుఁ జనం డనధికృతికిఁ బో
వఁ జనదు కలిగించుఁ బ్రత్యవాయ మ్మనుచున్. ౧౫౭

తే॥ గీ॥ శక్తి గలిగియు నెందనక్క శాస్త్ర మొప్పు
నంతదనుకనె యధికార మనియు 'న విధి
నాకృతం' బను వాక్యమందలి యథార్థ
మరయుటే శ్రేయమనియు నల్లతఁడు తలఁచు. ౧౫౮

వ॥ ఆతని సత్ప్రవర్తనముంగూర్చి వ్యాఖ్యానించవలసి వచ్చుచో నెంతేనియుం గలదు ప్రకృతం బెంతవఱ కవసరమో అంతమాత్రంబ వ్యాకరించితిని. తక్కినది "అనుక్తమన్యతో గ్రాహ్యా" మ్మను నభియుక్తోక్తికి వదలితి నని యెఱుంగునది యని వెండియు. ౧౫౯

క॥ ఆతనికి నిప్పటికి నొక, కూఁతురుమాత్రమె జనించెఁ గొడుక వగుము నీ
వా తలిదండ్రులసుకృతము, భూతలమెల్లెడల వెలసి పొగడికఁగనఁగన్.

తే॥ గీ॥ పుత్రసంతానమునకు నప్పుణ్యపురుషుఁ
డెదురుచూచుచు నున్నవాఁ డెవఁడు తగిన
వాఁ డనుచుఁ జూచుచుంటి నీ వంటివాఁడు
దక్క నతనికిఁ గొడుకుగాఁ దగఁడు ధ్రువము. ౧౬౧

మ॥ ధనధాన్యాది సమృద్ధిమంతులకు సంతానంబు దవ్వౌటకున్
జనిదోషం బనుకొం డ్రెఱుంగనిజనుల్ సత్యంబు గాదద్ది శ్రీ
ఖనులౌ జీవులుదక్క నిక్క మచటం గాల్వెట్ట వీల్గాదు జీ
వనికాయమ్మునఁ జాలఁ దక్కువగదా? భాగ్యాలవాలాత్మకుల్.

మ॥ గతజన్మమ్మునఁ బెట్టిపుట్టినజనుల్ గర్విష్ఠులై భావిసం
గతి యోజింపక పొట్టకై తినుటయే కానీ పురాకాలసం

భృతదోషమ్మున రిక్తులో జనులపై నే మాత్రిమ్ముఁ గూడ దా
తృత వర్షింపక చచ్చిపుట్టుదు రెటో దీనత్వపర్యాప్తులై. ౧౬౩

వ॥ అని వెండియు. ౧౬౪

మ॥ శివ నేశుం డన నెట్టిఁడో తెలిపితిఁ శ్రీమంతుఁ డన్మాత్రిమే
యవుచో నేనినో పుత్రిఁగాఁ బనుచుచో నాక్షేపణం బుండ దె
న్ని విశేషంబులో మూర్తిమంతములుగా నిచ్చెద్ గుమింగూడి యి
ట్లవనింబుట్టె మదాంతరంగికుఁడు సుమ్మా? వాఁడు యక్షాధిపా.

ఉ॥ వానికి నిన్నొసంగుటయె వైభవచిహ్నము వానివంటి స
న్మానికి నే సుతుండుగఁ జనం దగ దేమన నేను రిక్తతా
ధీనుఁడ వానిగేహము మదీయభవంబునఁ జేసి రిక్తతం
బూనునొ? యేమొ? నీవనినఁ బుత్తెడిపిచ్చుక వే నెఱుంగుదుఁ.

తే॥ గీ॥ నాదు భక్తు లైశ్వర్య సనాథు లగుట
యీ వెఱుంగుదు వదియ నా కిష్ట మేను
శ్రీకి సూచకమగునట్టి చిహ్నములను
దాల్చుటకు నిష్టపడను యథార్థ మింత. ౧౬౫

తే॥ గీ॥ ఏనుమాత్రిమ కాదు విజ్ఞానధనులు
చక్రవర్తులు సైతము చాలవఱకు
సర్వసామాన్య వేషభాషావిశేష
ములనె వర్తింతు రిది ముదమ్ముఁ గలిగించు. ౧౬౬

తే॥ గీ॥ ఇట్లు పరమేశ్వరుం డాజ్ఞ యిచ్చుకతన
శ్రీదుఁ డిష్టము లేకయుఁ జిత్త మనుచుఁ
దనదు నూరీకృతిని దెల్పెఁ జనియె శివుఁడు
సభను జాలించి నందికేశ్వరుఁడు గొలువ. ౧౬౭

## ఆశీర్వచనము

క॥ చుందురి వేంకటరెడ్డి క
ఖండైశ్వర్యమ్ము నాయు వారోగ్యమ్ముఁ
దండిగఁ గలిగించుత మా
ర్కండేయనుతుండు శివుఁడు గడుఁ బ్రేమమునన్. ౧౭౦

## గద్య

ఇది శ్రీ తిరుపతివేంకటీయం బగు శివభక్తి యను పరమభక్తచరిత్రంబు
నందుఁ బ్రథమాశ్వాసము, శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీమత్పరదేవతాయై నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.



శ్రీ

# శివభక్తి

## ద్వితీయాశ్వాసము



తే॥ గీ॥ సంపదకు వన్నె దెచ్చు విజ్ఞాన గరిమ
గలిగి వర్తించు నీయెడఁ గరుణ నించి
పార్వతీజాని యగు నల్ల పరమశివుఁడు
కంటికిని ఱెప్పగతి సదా కాచుఁగాక. ౧

వ॥ అవధరింపు మనంతరకథావిధానంబు. ౨

శా॥ కావేరీపురవాసి శైవమతభక్తశ్రేష్ఠుఁడౌ సెట్టి పు
త్త్రావిర్భావముపిమ్మటన్ దన కపత్యప్రాప్తి దూరమ్ముగా
దేవేరిం గని పల్కు "నో లలనరో! దేవుం డొసంగెన్ సుత
న్నా వంశ మ్మిది నిల్పునే! కొమరుని న్నాకీయఁడేమో కదే!" ౩

మ॥ దశపూర్వమ్ము దశాపరమ్ము దుహితృద్వారమ్మున న్వంశదు
ర్దశ శాంతించుట వింటిఁగాని యెది పుత్త్రప్రాప్తి లేకున్నచో
నశనింబోలె దహించునో, అది సుతాద్వారాన శాంతింప దీ
దృశచింతన్ గృశియింతుఁ బున్నరక మే నెట్లీఁగఁగా నేరుతున్. ౪

వ॥ అదియునుంగాక. ౫

ఉ॥ కూఁతురు పెండ్లి కీడగుటకున్ మది సంతస మందికూడఁ జిం
తాతుర మయ్యెడిన్ “జనెడి” నంచుఁ, గుమారునివంటి దాన్కో
కూఁతురు; పెండ్లి చేసి యిటకున్ జనుదె మ్మిట నుండు మన్న జా
మాత అటుల్ పొనర్చునె? కుమారుఁడె యింటికి నిండు సర్వధా. ౬

ఉ॥ అల్లుని కెంత మేపినను నప్పటి కప్పుడె జీర్ణమై యెటో
యెల్లి ప్రయాణ మన్న నుడియే పొరి నేకరువెట్టుఁ బేదకున్
బిల్ల నొసంగుఁగాక యలపేదకుఁ గన్నులు నెత్తి కెక్కు స
పల్లలితుండె కొంత మృదుమార్గమునన్ జను నల్లువాండ్రలో. ౭

ఉ॥ పూటకు లేనివానిఁ దోడి పూసి యనర్ఘములైన చేలముల్
నీటుగఁ గట్ట నిచ్చి మెయినిండ నలంకృతులన్ ఘటించి యే
మాట యెటాడినన్ బదులుమాట వచింపక యెంత వంగి మో
మోటమిఁ జూపినన్ దుదకు నూడనిఁబాడెడి నల్లుఁడుగ్రుఁడై. ౮

తే॥ గీ॥ “మామగూడ నల్లుఁడె” యను మాట నెఱిఁగి
యే వచించెద నల్లురె యెల్లమగలు
కాని యిల్లటపల్లుండ్రె కైపు సైఁప
రాని దని చెప్పుదురు పెద్దలైనవారు. ౯

వ॥ అది యట్లుండుఁగాక. ౧౦

ఉ॥ కూఁతురు గన్న యక్కొడుకుఁగూడఁ గుమారుని వంటివాఁడె త
త్పైతృకవర్గమున్ దనువుఁ బాపును బున్నరకంబు, వేదని
ష్ణాతులు దీని కొప్పుదురు సర్వము సత్యమ కాని యైహిక
మ్మాత్రనివల్ల ముచ్చటది యేదియును న్నెఱవేఱ దెన్నఁడున్. ౧౧

మ॥ “మనయా” యంచును గొడ్కుకొడ్కు వలుకన్ మాయావుమీయావటం
చను భేదించి కుమారికాసుతుఁడు, వాక్యమ్మట్టి దాలించినం

దనచిత్తమ్ము చివుకుఁ మంచని యొరుల్ దత్తుం గొనంగా యతిం
చునువానిఁ గొనువారిపాటులు కడుఁ శోచ్యంబు లబ్జాననా! ౧౨

చ॥ కడుపునఁ బుట్టు పుత్త్రికులు గాఢిదగత్తరగాఁ జరించినం
గడు మధురంబ యా నొరులకానుపు తాదృశమైనచోఁ గడు
న్నిడుకఁ దొడంగు గేస్తుఁ డినుమిక్కిలిగా; నిది యేది లేకయే
బడుగు సుఖించు దత్త్వమును బట్టి బడల్పడఁ జేయునిన్నియుఁ. ౧౩

ఉ॥ కూఁతులసంతు నమ్ముకొనఁ గూడదు దత్తునికన్నఁ జిత్తముఁ
గాతరపెట్టువాఁ డెచటఁ గానఁగ రాఁడు పరాత్పరుండు శ్రీ
శీతనగాత్మజాధవునిఁ జేతమునందున నిల్పి పూజలఁ
జేతముగాక వాఁడె దయచేసెడిఁ బుత్త్రికు జీవయాత్రికుఁ. ౧౪

ఉ॥ ఏయది గోరికొన్న నదియే దయచేసెడి దేవుఁ డుండ న
బ్జాయతనేత్రి? చింత మన కన్యులతోఁ బనియేమి? పూజలఁ
జేయుద మప్పరాత్పరుని శీతమయూఖశిరోవిభూషు; సు
శ్రీయు యశమ్ము సంతతియుఁ జేకుఱు దీర్ఘతరాయురున్నతుల్. ౧౫

వ॥ అనవుడు నయ్యనఘు నర్ధాంగి జ్ఞానకల భర్తయుద్దేశమ్మున కుపోద్బ
లకమ్ముగా నిట్లు వక్కాణించె. ౧౬

మ॥ మనకావేరికిఁ గొంత దూరమున సన్మాన్యుండు యోగీశ్వరుం
డనఘుం డుత్తముఁ డెంతొ వృద్ధుఁడు తపోవ్యాసక్తుఁ డున్నట్లు విం
టిని గావేరితటప్రదేశమున; నేఁడే దన్మహాభాగు ద
ర్శనముం జేసిన మంత్రి మేదియొ సుపుత్త్రప్రాప్తికీ కుంభునే! ౧౭

సీ॥ వరుణమంత్రి జపమ్ము జరుగుపిమ్మట హరి
శ్చంద్రుండు సంతానశాలి యయ్యె
దశరథక్ష్మాజాని తనయుల నల్వురఁ
గనె బుశ్యశృంగుని కరుణ వడసి

యువనాశ్వుఁ డను ఱేఁడు యువతి గాకయు మంత్రి
జల మాని కనెఁ దనూజాతు నొకని
నుపమన్యుఋషిమంత్రి ముపదేశ మిడిన పి
మ్మటఁ గాదె? కాంచెఁ గోమాళ్ల శౌరి
తే॥ గీ॥ కలవు మంత్రబలమ్మునఁ గలిగినట్టి
సంతతులు పెక్కు; మనశివస్వామి మును మృ
కండునకు శాశ్వతాయుష్కు నొందు కొమరు
నీఁడె తడవంగఁ బని లేద యితరచరిత. ౧౯

క॥ ఆ యోగి దర్శనమ్మున, కై యరిగి తదీయకరుణ నాశీస్సందద్
దాయాదుఁడుదయమగుదీ, ర్ఘాయుర్భాగ్యాదియుక్తుఁడనుడునతండున్.

వ॥ వల్లెయని యొక్కనాఁడు శుభోదర్కంబగు ముహూర్తమ్మున ఫల పుష్పాదికంబులు గైకొని యమ్మహానీయు దర్శించి నమస్కరించి తదాజ్ఞం జేసి యుచితస్థలమ్మున నుపవిష్టు లగుటయు నయ్యోగి పుంగవుండు. ౨౦

చ॥ తెలిసె భవన్మనోరథ ముదీర్ణగుణాఢ్యుఁడు శైవభక్తిసం
కలితుఁడు శ్రీదునంశమునఁ గానుపుగా జనియించు మీకు; ని
క్కలియుగదోషపుంజమును గాల్చి జగానకు మేలు గూర్పఁగాఁ
దలఁచి సదాశివుం డిటకుఁ దత్సఖుఁ బ్రేరణ చేసి పంపెడిన్. ౨౧

చ॥ కులము తరించు భూప్రజలకున్ గడు మేలగు శైవభక్తిసం
కుల మగు దేశ మెల్లయెడ గోవులు విప్రులు నిర్భయస్థులై
మెలఁగుదు రార్తకోటి యినుమిక్కిలి సంపద దొప్పఁ దోఁగి శో
భిలుమరు నీకుమారుఁ డభివృద్ధిని జెందుకొలంది ధీనిధీ. ౨౨

ఉ॥ ఆలయముల్ కడున్ వెలయు నన్న మొసంగెడి ధర్మసత్రముల్
ప్రోలునఁ బ్రోలునన్ బలియుఁ బున్నెమునందలి యాస్థ హెచ్చి భూ

పాలురు వేదవేత్తలగు బ్రాహ్మణులఁ బిలిపించి యగ్రహా
రాల నొసంగి నిల్పుదురు రాముని రాజ్యము జ్ఞప్తిఁ గొల్పుచున్. ౨౩

కII ఇది యంతయు నీ కొమరుని
యుదయముకతనన్ ఘటించు నుత్తముఁడవు నీ
సదవతియు నీకుఁ దగిన
ట్టిది కొమరుఁడు సుగుణగణపటిష్ఠుఁడు గాఁడే! ౨౪

వII ఇట్లు భావికాలశుభోదయంబు వక్కాణించు నయ్యోగిపుంగవునకుఁ
బునఃపునఃప్రణామమ్ము లొనర్చి యాయన దీవనలం బడసి యప్పుణ్య
దంపతులు స్వగృహమ్మునకుఁ జనిన కొన్నాళ్ళకు. ౨౫

తేII గీII జ్ఞానకల కంకురించెను గర్భచిహ్న
ములు క్రమమ్ముగ నభివృద్ధి మొనసె గర్భ
ముచితకాలానఁ బుంసవనోత్సవంబు
జరిపె శివనేశుఁ డానందసాంద్రుఁ డగుచు. ౨౬

వII పదంపడి కొన్నినాళ్ళకు. ౨౭

తేII గీII ధర్మకర్మాధినేత లిద్దఱుఁ బరస్ప
రాలయమ్ములఁ బ్రాబల్యమంది యుండ
మంచి లగ్నమ్మునఁ గుమారు మగువ గనియె
జాతకర్మాదికంబును సలిపె శ్రేష్ఠి. ౨౮

కII తిరువంకాడరనెడి పేరఱవమ్మున మంచియర్థ మలరారెడి ద
చ్చిఱుతకు నిడె వణిజుఁడు భూసురకోటికి దనిపె నెల్లసురలఁ దనిపెన్.

వII అబ్బాలుండు శుక్లపక్షపాకరునింబోలెఁ గ్రమక్రమమ్ముగఁ నభి
వృద్ధి నొందుచు నాడుకొనియెడి పాంసుక్రీడలయందు సయితము
శివభక్తి ప్రవృత్తి వెలువరించుచుండె. ౩౦

తే॥ గీ॥ ఇసుముతోఁ శివలింగము లేరుపఱచి
పూలఁబూజించి నైవేద్యమునకుఁ దాను
దినెడి తీపిపదార్థముల్ దినదినంబు
వాడుచుండును దనుఁ గనువారు మెచ్చ. ౩౦

తే॥ గీ॥ అయిదువత్సరముల ప్రాయ మప్పు 'డోంన
మశ్శివాయ' యనియెడి సన్మంత్రి మెలమి
నక్షరాభ్యాస మొనరించె నర్భకునకుఁ
దన పురోహితు ననుమతమ్మున వణిజుఁడు. ౩౧

క॥ అంతర్గర్భిత శివభ, క్త్యంతఃకరణుండు బాలుఁ డడిగెన్ దండ్రిన్
వింతగమంత్రార్థముధీ,మంతుఁడుజనకుఁడు వచించె మంత్రార్థమ్మున్.

చ॥ గురువు నిమిత్తమాత్రముగఁ గోమటిబిడ్డఁడు విద్దియన్ గడున్
ద్వరగ గ్రహించి తల్లికిని దండ్రికి బందులకున్ ముదమ్ముగా
బెరుఁగుచునుండె నూరఁ గల పిల్లలకెల్లను వానిపొత్తు మేల్
పరిమళమిచ్చు పూవువలె భాసిలుచుండె సమస్తభంగులన్. ౩౪

క॥ అపరప్రహ్లాదునివలె, నెపుడున్ భగవంతుస్మరణ నేమఱఁడు రమా
ధిపతికి భక్తుఁడతఁ డుమా,ధిపతికి భక్తుండితం డిదే భిద తెలియన్.

క॥ శివభక్తులపట్లను గే,శవునకుఁ గేశవునిభక్తసంఘముపట్లన్
శివునకుదయయుదయించెడి, శివకేశవమైత్రిఁ దెలిసి సేవించునెడన్.

తే॥ గీ॥ ఎన్నియొ పురాణవాక్యమ్ము లిట్లు నొడువు
చుండినను వీనిఁ బాటింప కొండొరువులు
వృథగ ద్వేషించుచుందురు విజ్ఞు లెఱుక
గలిగి సమదృష్టిగా నెందు మెలఁగుచుండ్రి. ౩౭

క॥ తిరువంకాడరు నట్లే,హరునెడఁగడుభక్తుఁడయ్యు హరియెడ లవమున్
భూరయఁడు ద్వేషంబిరువురు,నిరువురెమహనీయులనెడిమెఱుకజరించున్

తే॥ గీ॥ అక్షరాభ్యాసమైన యయ్యూహము మొదలు
సర్వదా శైవ మంత్రమ్ము జపము సల్పు
నేమ మొక్కప్పుడును గూడ నెంతపున్న
మఱఁడు పెట్టి పుట్టెనో ? జన్మమన్న నదియె. ౩౯

క॥ అల్లారుముద్దుగా నిటు, లెల్లరుఁ దను మెచ్చికొనఁగ నెదిగెన్ బాలుం
డల్లరి నెఱుఁగఁడు తూఱుపు, దెల్లవడకమున్న లేచు దేవుఁదలఁచుచున్.

తే॥ గీ॥ ఇట్టి నియమస్థుఁ డొక్క నాఁ డినుఁడు వొడుచు
పయిని సైతము లేవక బడలినట్లు
గుఱ్ఱు వెట్టుచు నిదురింపఁ గొడుకుదరికి
వచ్చి చూచి విచారించె నిచ్చఁ దండ్రి. ౪౧

ఉ॥ ఎన్నఁడుగాని వేకువకు నించుక పూర్వమె మేలుకాంచి యా
పన్నగభూషు నంచుమలపట్టిమనోహరు నెంచువాఁడు నా
పున్నెముపంట నేఁ డకట ! పూషుఁడు కొండొక యాకసమ్ముపైఁ
జన్నను లేవకుండుటకుఁ జాలిన దొండు నిమిత్త ముండెడిన్. ౪౨

క॥ నేమముగాఁ బన్నుండు, న్నేమమ్ముగ లేచుఁ జదువు నేమమ్ముగ. నెం
దేమఱఁడు వీని కింతటి, పామాదికతాభరమ్ము పైకొను టేమో ?

వ॥ అని పెక్కుతెఱంగులఁ దనలోఁ దాన వికల్పించుకొని. ౪౪

ఆ॥ వె॥ వెన్ను దట్టి లేపి చిన్నారి నాయన్న ?
లోకబాంధవుండు ప్రాఁకె దివిని
జాలదూర; మెల్ల సరసిజాకరములు
నిదుర లేచి కళల నివ్వటిల్లె. ౪౫

శా॥ కావేరీనదిలోనఁ గ్రుంకి ద్విజు లక్కంజాతమిత్రున్ దగం
గా వేదోక్తవిధిన్ యజించి గృహమార్గం బంటి యేతెంచినా

రీ వెన్నుండును నింత నిద్ర గొన వి ట్లీనాఁడు నిద్రించుచో
ప్పో వత్సా ? మది కళ్కుజం బగుఁ గతం బూహింప లే నయ్యెదన్.

చ॥ శివునభిషేకపున్ ఘటము శీర్షమునన్ ధరియించి తూర్యపున్
రవము లెసంగ నీశు నల నాగము భోగమువాండ్రమేళపున్
రవణలతోడ దేవుగుడిరథ్య నదే చనుచున్న దేల క
న్గవ మొగుడం దొడంగె జతనంబున లేపినయేని పుత్రికా. ౪౭

వ॥ అని మొగంబు కేల నెత్తి. ౪౮

క॥ ఆరోగ్యం బే మాత్రము, మాఱంగా లేదుగద? సుమాళమ్మగ నీ
కీ రాత్రి నిదుర వట్టెనె? గారాపుఁగుమార? తెలుపఁగద వే? నాకున్.

క॥ అని గ్రుచ్చిగ్రుచ్చియడిగెడి, జనకున కిట్లనియెఁ గొడుకు జనకా? కలదొం
డునిమిత్త మిందులకు నేఁ, జనినాఁడన్ వెండికొండ సవిధమ్మునకున్.

తే॥ గీ॥ అనెడు నర్ధోక్తిలో వణిఘ్నుఁడు మరలఁ
బలుకు నా తండ్రి! కైలాసపర్వతం బ
దేడ? కావేరి యెక్కడ? యెట్టులచటి
కరిగి యింతలో వచ్చితివయ్య! యిటకు. ౫౧

ఉ॥ అక్కజ మయ్యె నీకునుడి యున్నగ మెక్కడ! యుత్తరాశలో
నెక్కడనో? యొకానొకట నేరికి గమ్యము గానిచో హావి
ర్భుక్కులగమ్యమై తనరుఁ బుత్రిక? యోగులుదక్కఁ దన్నగం
బెక్కినవారు లేరు పరమేశ్వరుఁ డయ్యెడ నుండు నింతితో. ౫౨

ఉ॥ అక్కడి కెట్టు లేగనగు నర్భక? స్వప్నము వచ్చెనేమొ? నా
చక్కనికూఁత్రు? స్వప్నములు సత్యమకా గనుపట్టు నేదియో
మిక్కిలి భాగ్యమున్నపుడె మేకొను నీదృశమైన స్వప్నముల్
మక్కువ నీయెడం గల దుమాపతి కింతకు నేమి కావలెన్. ౫౩

తే॥గీ॥ మంచి స్వప్నమ్ముఁ గంటి వుమామహేశు
లెపుడుఁ గంటికి జెప్పలై కృప దలిర్ప
నిన్నుఁ గాపాడుదురుగాక నీకు సకల
శివము లబ్బునుగాక ఆ శివుల కతన. ౫౪

వ॥ ఇట్లు పరమానందమ్మున దీవించు తండ్రికిఁ గొమరుం డిట్లను. ౫౫

మ॥ జనకా ! కాల్నడఁ గాదు నే నెమిలిపై స్వాంతస్ఫురద్వేగినై
చనినాఁడర్క యువకుం డొకండు మొగముల్ షట్సంఖ్యగానున్న శో
భనగాత్రుం డరుదెంచి రమ్మనిన నేఁ బ్రస్థానముం జేసితిన్
మును పెప్డో కనినట్టిచోటె యది నే మమ్మాటికిం జెప్పెదన్. ౫౬

సీ॥ అర్ధదేహము పూరుషాకారముగఁ దోఁచె
నర్ధంబు స్త్రీ మయమ్మగుచుఁ దోఁచె
నుభయులశిరమున నొక చందమామయే
కొంగ్రొత్తవెన్నెలల్ గురియుచుండె
సర్పరాజొకరి శీర్షపుభాగమున నుండెఁ
బూసరా లొకట నింపుగ నెసంగె
వ్యాఘ్రాజినమ్మొక్క పార్శ్వానఁ గనుపట్టె
నొకట హేమాంబరం బొప్పు లొలికె

తే॥గీ॥ నేమి చెప్పుదు నా తేజ మేను జూడ
లేక మిఱుమిట్లు గొంటిఁ దల్లియును దండ్రి
యనుచు నను వెంటఁ గొనిచన్న యతఁడు తెల్పి
నన్ను మ్రొక్కించె దీవించినారు వారు. ౫౭

క॥ తెల్లని నల్లనిమేనులు, నల్లనిమెఱ్ఱని గళములు నామది కెంతో
యుల్లాసము గలిగించెను, దల్లావణ్యము నుతింపఁ దర మేరి కగున్

వ॥ ఇట్లు తన్మయమ్మగు చిత్తమ్ముతోఁ దన్మాత్రలక్ష్యమ్ముగ నుపన్య

సించు *పట్టణత్తారుం గుమారుం గాంచి శివనేశుం డింకను గొమరునకు నిద్దురమత్తు వదలలేదనియు నక్కతమ్మునఁ దన్మయుండై దానినే సారెసారెఁ జెప్పినదే మరలఁ జెప్పుచున్నవాఁ డనియుఁ దలంచి శీతలోదక సేచనమ్మునఁ గనులు గడిగి కొమరుం గని. ౫౯

చ॥ మెలఁకువ వచ్చెనే? తనయ! మిఱ్ఱసిగదేవర దర్శన మ్మెటుల్
గలను గుమార? అర్ధతనుకాంతుఁడుసూ? అతఁ; డెంతయో తపం
బలఘు లొనర్చియున్ గనని దా నిజరూపము? నీకు నెట్టులో
కలఁ గనఁజేసె నా శివుఁడు కట్టినయట్టి పురాకృతమ్మునన్. ౬౦

వ. అను తండ్రికిఁ గొడు కిట్లను. ౬౧

చ॥ కల యనుకోకు నే స్వయముగాఁ జని చూచితి బర్హి సాక్షి మో
ములు ఋతుసంఖ్యముల్ గలుగు పూరుషవర్యుఁడుసాక్షి స్వామి ముం
గలి ముసలెద్దు సాక్షి మఱి గంగమ వేఱొకసాక్షి స్వామి సా
త్త్వులపయిసాక్షి మంచుమలకూఁతురు సాక్షి మృగాక్షియయ్యెడన్.

శా॥ వారిన్ జూడకమున్న యా నగము నల్వంకల్ విలోకించి యా
దారుల్ కొన్ని త్తవి గానటుల్ దలఁచితిన్ దద్దేవుఁడేగాని యా
వారీరత్నముగాని పూర్వ మెపుడో నా కంటఁ బడ్డట్టులే
ఆరంగాంచెద నెమ్మదిన్ దెలియరా దాకాల మేనాఁటిదో? ౬౨

సీ॥ ఒకచోట వాన వేఱొకచోట యెండ వే
ఱొకచోటఁ జలియు నందొప్పుమీఱుఁ
జెప్పగిప్పఁగరాని చెల్వమ్ము గల స్త్రీ పు
రుషు లందుఁ గల రెందఱో కెలఁకులఁ
జెవుల కింపుగ స్వస్తి చెప్పు చక్కని మంచి
పక్షులున్నయవి యప్పర్వతమున

* టిప్పణి: తిరువంకాడరునకు పట్టణత్తా రని వేఱొక పేరు కలదని తెలివిడి.

ఫలభారమున వంగి యిల ముట్టి ముట్టని
తరువు లెన్నెన్నియో వఱలు నందు

తే॥ గీ॥ కవులు వర్ణింపవలయునే కాని దాని
వైభవము నన్నుబోటికి వశముగాదు
కవులలో నేని యెవ్వరో కాళిదాసు
వంటివా రర్హు లితరులు పనికిరారు. ౬౪

శా॥ చూపెన్ శంభుసుతుండు మానససరస్సున్నాకు; దన్నీర మే
నాపోశించితి నేమి చెప్పుదు రుచిన్ హా! దానివైశాల్య మిం
కే పాథోనిధి కేని యుండదనియే యే నెంతుఁ బద్మమ్ము లం
దే పారున్ రవిమండలమ్ములబలెన్ హృద్యప్రభాద్యోతులై. ౬౫

శా॥ మేఁకల్ వ్యాఘ్రము లొక్క రేవునను బేర్మి న్నీరమున్ ద్రావెడిన్
కాకుల్ ఘూకము లొక్క చెట్టునను చక్కం గాపురమ్ముండు వ
ల్మీక మ్మొక్కట వాసమున్ సలుపుఁ జెల్మిన్ బాములు న్ముంగులున్
శ్రీకంఠాజ్ఞకతాన వైరము లటన్ లేనట్టు లూహించెదన్. ౬౬

ఉ॥ ఎచ్చటఁ గన్న నీలమణు లెచ్చటఁ జూచినఁ బచ్చరాల్ మఱిం
కెచ్చటఁ గాంచ వజ్రమణు లెచ్చట బంగరు దానిసోయగం
బెచ్చట నేరుఁ జూడరని యేఁ దలపోయుదు వెండికొండయం
చిచ్చటివార లందు రదియెల్లెడ రత్నమయంబ కన్గొనన్. ౬౭

ఆ॥ వె॥ అర్ధరాత్రమందు నట కేగితినిగదా!
యేను దండ్రి యచట నిరులు మందు
కేని గానరావు భానుసహస్రముల్
వెలుఁగునట్లు దాని వెలుఁగు దోఁచె. ౬౮

వ॥ ఇట్లు ప్రత్యక్షమ్ముగ వీక్షించినట్లు తెలుపుచున్న కొమరుని ధన్యతకు సంతసించుచు శివనేశుండు. ౬౯

సీ॥ ఆడుఁ బాంసుక్రీడ లీడుబాలకులతో
సైకతలింగపూజామిషమునఁ
బాడు నీలగ్రీవు నీడుపిల్లలతోడ
వినువార లానందమున మునుంగ
వేడుఁ దల్లి మహేశుఁ జూడఁబోయెద నంచుఁ
గఱకైన మేల్మిబంగరువరాలు
కూడు దేవళమంచుఁ గోలాటములతోడ
భజన సేయుచునుండు భక్తవరుల

తే॥ గీ॥ శివునిగుఱిచి బోధలు సేయుఁ జెలిమికాండ్ర
కేండ్లు నాల్గేని యేఁగని యీడునంద
అతఁడు హరిభక్తుఁ డితఁడో! హరుని భక్తుఁ
డంతరం బింతె ప్రహ్లాదుఁ డగు ననంగ. ౨౦

తే॥ గీ॥ "హశ్శరభ" యంచుఁ బ్రభలతో నప్పుడపుడు
శూలదీపాలతో నగు శూలియుత్స
వములు చూచి యా యుత్సవక్రమము ననుక
రించు నాటలలో వీఁడు రేయుఁబవలు. ౨౧

ఉ॥ భూతి మొగమ్మునం దిడక భుక్తిని మెక్కఁ డొకప్పు; డెన్నియో
జాతుల రత్నహారములు చాలినయన్నియు నున్నఁగాని యా
రాతిసరమ్ము లూడ్చి రుదురాకసరాల్ మెయినిండఁ దాల్చుఁ ద
"న్వాతులుఁ" డంచు బాంధవజనంబులు సారెకు లోన నెన్నఁగన్

వ॥ మఱియు నింక నెన్నేని గల విట్టిచెయ్వులు వీనియెడ భక్తపర తంత్రుం డగు పరమేశ్వరున కనుగ్రహంబు గల్గుట కక్కఱపడవలసి యుండదని తనలోఁ దాన సంతసించుచుఁ దరువాతివృత్తాంతమ్ము చెప్పుమనుటయు నబ్బాలుండు. 23

క॥ అయ్యాదిదంపతులు నను
నెయ్యమ్మునఁ జూచి యనిరి "నీ విట నుండో?
అయ్యయు నమ్మయు నుండెడి
యయ్యెడ కరిగెదవా? చెప్పు" మనిరి చనవుగన్. ౭౪

క॥ అక్కడ నుండుటకును నా
కిక్కడ నుండుటకుఁగూడ నిష్టమె యని నా
మక్కువ దెలిపిన వా ర్నా
దిక్కున నాదరముఁజూపి దీవించి రొగిన్. ౭౫

తే॥ గీ॥ అట్లు దీవించి ననుఁ "దిను" మనుచు మంచి
పండుల నొసంగి తినుమీఁద భద్రముగను
నిటకుఁ బంపించినారు పిమ్మటను నిద్ర
పోతి మేల్కొంటి నాలస్యముగను జనక. ౭౬

క॥ కలగా దిది ప్రత్యక్షం
బెలమిని నే నేగి కంటి నీ సర్వము నన్
జెలికానిన్ బలె నచటికిఁ
బిలుచుక చనినతఁడు వారి ప్రియతనుజుండే. ౭౭

వ॥ నాపుడు శివనేశుండు కొమరుని భావికాలశ్రేయస్సూచకం బగు
స్వప్న మిది యని యానందించుచుండె. ౭౮

క॥ అటు కొలఁదికాల మగు పి
మ్మట శివనేశుండు చనె నుమాపతి తా నె
చ్చట వసియించునొ? వెస న
చ్చటికి సుకృతశాలి యనుచు జనములు వొగడన్. ౭౯

వ॥ తిరువంకాడరు ముక్కుపచ్చలాఱని బాలుండగు కతనఁ దల్లి జ్ఞాన
కల యతని బెంగగొననీక గుట్టుగాఁ బెంచుచు నంతకు మున్ను
జరుగు వ్యాపారంబెల్ల మేనమామల వశంబున జరుగుట కేర్పఱిచె. ౭౯

మ॥ తిరువంకాడరు శైవభక్తిమయుఁడై దేశీయమౌ భాష య
య్యాఅవంబుర్ గనడంబు సంస్కృతము నిత్యం బాస్థతో నేర్చుచుర్
గురుభక్తుండయి వారి మెప్పు గొనుచుర్ గూలంకష ప్రజ్ఞ శా
కరమై వర్ధిలుచుండెఁ దన్నుఁ గని లోకంబెల్ల శ్లాఘింపఁగర్. ౮౧

మ॥ తిరువంకాడరు కెద్దు గన్పడినఁ బ్రీతిస్ఫీతి రెట్టించి స
త్వర మద్దానికి ధాన్యమో మఱియు హృద్యమ్మైన భక్ష్యమ్ములో
గఱికో పెట్టియు గంగడోల్ నఖముఖాగ్రస్పర్శచే గోఁకియుర్
బరిచర్యం బొనరించుఁ దీయనగు మేల్పానీయ మందిచ్చియుర్ ౮౨

చ॥ శివునకు నిద్ది వాహనము శ్రీగళసేవక పాదసేవ భా
గవతులపాదసేవ యగుఁ గావునఁ గాలగళుండు మెచ్చు భా
గవతులసేవ మోదమును గల్గఁగఁజేసెడి శూలి కంచు భా
గవతులు జంగమార్చనకునై సకలస్వము దార వోయరే. ౮౩

మ॥ ఒకతేఁ డంగన జంగమార్చనకుఁగా నొప్పించె వేశ్యాంగనా
త్మకగా మార్చి; మఱొక్కఁ డేస్తు శివసద్దీక్షాపరుం డాత్మపు
త్రకుఁ జేసేతన కోసి వండి శివు నారాధించి మెప్పించి శం
భుకృపర్ బుత్రు నిహంబునుం బరమునుం బొందెర్ జగం బెన్నఁగర్

చ॥ శివమయ మీజగం బతనిచే నడచు న్నిదురించు నా సతీ
*ధవుఁడు దిగంగుఁ డెన్మిదివిధమ్ములకన్న నతిక్రమించు వ
స్తువు మఱి లేదు లోకమునఁ దొమ్మిది యంచును లెక్కవెట్ట న
ట్లవుట జగంబు సర్వ మభవాత్మక మంచు భజింత్రు ధీనిధుల్.

శా॥ అందుం గొన్నిటి శైవతత్త్వవిదు లత్యంతమ్ముఁ బ్రేమింత్రు మే
నం దాల్తు ర్భసితంబు శీర్షమునఁ గంఠమ్మందు రుద్రాక్షలం

---

* టిప్పణి: దిగంగుడు = అష్టమూర్తి, యావత్ప్రపంచస్వరూపు డన్నమాట.

బొందింతు ర్వృషభమ్ములం బొరిఁబొరిం బూజింతు రీశుండు తా
నెంతేని గల్గునుగాక యెక్కొకయెడన్ హెచ్చున్ దదీయాదృతుల్.

మ॥ రుదురాకల్ ధరియించువాఁ డపరరుద్రుండే యటం చాడుఁగో
విదమాన్యంబులు వేదవాక్యములు; తద్విజ్ఞన్ వెసంజూచి పా
ఱుదురం టయ్యుమదూత;లాతఁడు కడున్ గూర్రాఘముల్ సేయుఁగా
కది లెక్కింపక శంభుఁ డిచ్చునఁట? స్వీయంబైన కైలాసమున్

మ॥ ఎది తిన్నన్ మఱియేది ద్రావినను నెల్లేఁ బోయినం బాప మ
న్నది రుద్రాక్ష ధరించువానిదరికిన్ రాఁ జాల దవ్వాఁడు ది
న్నదియే అప్పితృదేవతల్ దనియుపుణ్యంబైన కర్మం బగున్
రుదురాకల్ ధరియింప సిగ్గు వడు మూర్ఖుం డిట్టి సద్గ్రంథముల్.

తే॥ గీ॥ ఇతర దేశమ్ములను జనియించుకంటె
నాంధ్రదేశాన జనియించు టార్యహితము
"వశి? వశి?" యటంచుఁ బిలుతురు వారు భార్య
నదియు "శివ! శివ!" యై తుద కఘము లడఁచు ౮౯

తే॥ గీ॥ కలరు దేవత లెందఱో కలుగనేమి
యయ్యొ శివువంటి వేల్పెందు నగుపడండు
వర మడుగువాని యర్హత నరయకే యొ
సంగు వాంఛిత మేదేని శంకరుండు. ౯౦

అ॥ వె॥ "శంకరుం" డటంచు "శంభుం" డటంచును
శివునిదక్క నితరుఁ జెప్పికొనరుఁ
"శ" మ్మనన్ సుఖ మ్మొసంగు దేవుఁడు గాన
నట్టిపేరు లీశు నన్వయించు. ౯౧

ఆ॥ వె॥ మంగళార్థకంబు మహితంబు శివనామ
మితఁడెకాద యితనియింటియాలు

సర్వమంగళాంశ సైతము ధరియించె
నెందుఁ గలదె? యిట్టిపొందు జగతి. ౯౨

క॥ మగఁ డిడువాఁడే యైనను
మగనాలు మొగమ్ము ముడుచు, మగనా లిడుచో
మగఁ డిడఁడు ప్రకృతి మాటుగాఁ
దగుదు రిరువు రొక్కరీతి *నయసంధాతల్. ౯౩

తే॥ గీ॥ ఇట్లు జన్మాంతరీయ సుకృతముకతన
శివమయ మ్మగు పరిశుద్ధచిత్తవృత్తి
గలిగి పట్టణత్తూరు దాఁ గడపు రేయుఁ
బవలు ద్రుటియైన శివు నెడఁబాయ వెఱచు. ౯౪

మ॥ గురుసాన్నిధ్యమునం బఠించుతఱి నక్కుఱ్ఱండు "శంభున్ దప
శ్చరణాసక్తుని నందికేశ్వరుఁడు నిచ్చల్ నిద్రియున్ భక్తి యే
మఱి సేవించెడి నంచుఁ దాను విని "సాంబద్వారమం దుండి నేఁ
బోరి విశ్రాంతిని నందికిత్తు" ననుచుం బోఁబోవు దుర్వారుఁడై ౯౫

క॥ తిరువంకాడ రిటులు త
త్పరుఁడై బాల్యమ్ము గడప వడుగొనరింపన్
దఱి యగుడుఁ బురోహితుఁ డది
యెఱిఁగించెన్ జ్ఞానకలకు నెంతయుఁ బేర్మిన్. ౯౬

క॥ గర్భద్వాదశవర్షం, బర్భకునకు నన్వయించె నది వైశ్యులు నం
దర్భజ్ఞు లెఱిఁగి చేయుదు, రర్భకులకు వడుగు సేయు మట్టులెనీవున్.

క॥ కొందఱు పెండ్లి యగుదిన, మందే నెఱవేర్తు రది సదాచారము గా
దందురు పెద్దలు కావున,ముందే తెల్పితిని జేయుము వడుగు తఱితోఁ.

---

*టిప్పణి: అయసంధాతల్ = శుభముల నొసఁగువారు (అయశ్శుభావహో విధిః)

తే॥ గీ॥ తండ్రి శివనేశుఁడే యున్నఁ దజ్ఞుఁ డతని
కొఱలు బోధింప వలసియే యుండ దీవు
కూడ ధర్మజ్ఞవైనను నాఁడుదాన
వగుటచేఁ జెప్పవలసె నీకమ్మ! నేను. ౯౯

క॥ ఇది పదకొండవవత్సర,మిది దాఁటించితిమయేని యేగు నుచితమౌ
నద నన(గ జ్ఞానకలకో,విదమానిత యన్నకు నది విదిత మొనర్చెన్

వ॥ పదంపడి చంద్రతారాబలయుక్తంబగు సుముహూర్తంబున యథా
చోదితంబుగ నుపనయన మహామహంబు జరిగె. ౧౦౧

క॥ ఉపనయనమపుడు గాయ,త్ర్యుప దేశముఁబొంది కుఱ్ఱయొజ్జనడిగెమం
త్రపదములందలియర్థము,చెపుఁడీ!యనిసవినయముగఁజెప్పెన్గురుడున్.

వ॥ అట్లు నొడువుటయుఁ దదర్థంబు గ్రహించి యబ్బాలుండు. ౧౦౩

తే॥ గీ॥ చోదనార్థకధాతువు 'చోదయాత్త
నెడిది యమ్మంత్రమందున నెగడుకతన
ధీకిఁ బ్రేరకుఁ డున్నట్లు తెలియఁబడెడిఁ,
గాన జీవి స్వతంత్రుఁడు గాఁడు ధ్రువము." ౧౦౪

శా॥ ధీకిం బ్రేరకుఁడైనవాఁ డలమహాదేవుండె పంచాక్షరీ
ప్రాకారాంతర చక్రవర్తి సుమహో(భ్రాజిష్ణుచిన్మూర్తి భూ
మ్యాకాశాది సమస్తదేశగత సూక్ష్మాకారవిస్ఫూర్తి నా
వాకున్ శుద్ధ మొనర్చుఁగాకని నమోవాకమ్ము లర్పించెదన్. ౧౦౫

శా॥ గాయత్ర్యర్థ మనేకథా బుధులు వక్కాణింతురిగా కా మను
ధ్యేయంబౌ పరవస్తువే తుదకుఁ దద్ధీప్రేరకం బాఖ్య యే
దోయాఁగా కట నున్న భర్గపద మాద్యుల్ చూచి శైవార్థమే
న్యాయప్రాప్తముగాఁ దలంతు రనుచు న్నా బుద్ధికిన్ దోఁచెడిన్.

తే॥ గీ॥ భవతు నా కన్యదైవతవైరబుద్ధి
లేదు కానంతయేని దల్లి యని పార్వ
తిని దలంతుఁ దండ్రిగ మహాదేవుఁ దలఁతు
నర్ధనారీశ్వరమయంబ యఖిల జగము. ౧౦౭

క॥ జగదంతరాత్మయగు పన్నగశాయి మహేశ్వరుఁడును నాకొకరూపై
యగుపట్టియు నెమ్మది శివుఁ,డగులుఁ గులదైవతం బతం డగుకతనన్.

మ॥ శివుఁడే మత్కులదైవతంబు శివునే సేవింతు "నీవాఁడ నో
శివ! నన్ బ్రోవు" మటంచు వేడికొనెదన్ సిద్ధుల్మునుల్ సాధ్యులున్
శివునే కొల్చి తరించి రెల్లసురలున్; జేకొంచు నామొక్కు నన్
శివుఁడే ప్రోచు శివున్ వినాగ నొరు నే సేవింపఁగా నేటికిన్. ౧౦౯

క॥ శివ! శివ! శివ! యని కానీ, భవ! భవ! భవ! యనియుఁ గాని భర్గుని పేరే
తవిలి పఠించెద నన్నా, శివుఁడెటు తనభక్తులందుఁ జేర్పక విడుచున్.

వ॥ ఇట్లుపనయనంబై నదియాది గాయత్రీమంత్రవాచ్యం బగు పర
వస్తువుంగూర్చిన విచారమ్ముతోఁ గాలక్షేప మ్మొనర్చుచుఁ బట్టణ
త్తారు గురువు నొక్కట నిట్లు సవినయమ్ముగాఁ బ్రశ్నించె ౧౧౧

క॥ ఏకాలపుఁ బ్రాణికేనియుఁ, బ్రాకటముగ వడుగు సేతవలన ద్విజత్వ
శ్రీ కలుగుంగద తక్కొరు,లీ కర్మం బిచ్చగింప రేమికతంబో? ౧౧౨

వ॥ అనవుడుఁ బురోహితుండు సంతసించి నీప్రశ్నం బాపాతరమణీయం
బును నుత్తరించఁదగ్గదియు నుపనయనమ్ము ద్విజన్మపదవాచ్యు లగు
బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతుల యపత్యంబుల కేర్పడిన సంస్కా
రంబు. ౧౧౩

తే॥ గీ॥ "జన్మనా జాయతే" యను శాస్త్రమునకు
నర్థ మందఱు నుపనీతులైన మాత్ర

ద్విజులగుట కాదు ద్విజసుతుల్ దీనిలేమి
శూద్రులై చెడుటయె శ్రుతిచోదితంబు. ౧౧౪

తే॥ గీ॥ తల్లి బ్రాహ్మణి పాఱుండు తండ్రి యట్లె
యిరువురకు జనియించినయేని వాని
కుపనయనసంస్కరణ మది యొదవదేని
కలుగదు ద్విజత్వసిద్ధి నిక్కమిది కుజ్ఞ. ౧౧౫

మ॥ గనిలోఁ బుట్టినవజ్రపుం దునుక సంస్కారమ్ము శాణమ్మునన్
గొనదే నొండొక రాతివంటిదె యగున్ గొండొక్కటా యెంత సా
నను ఘర్షించిన వజ్రపుందళుకులం గైకోదు నీ కింతక
న్నను బోధింపఁగనేల? జ్ఞానఖని వన్నా! నిన్ గన న్మోదమా. ౧౧౬

తే॥ గీ॥ "అవిధినాకృత మకృత" మం డ్రాగమజ్ఞు
లకృతమ్మన విధినిషేధాదు లెఱిఁగి
యేది చేసిన నది ఫలియించు నట్లు
గానిచో భస్మహావ్యమ్ముకరణి వమ్ము. ౧౧౭

వ॥ యథార్థ మిట్టిదియే యైనను ద్విజేతరులుగూడ నుపనయనసంస్కారమ్మునకుఁ గడంగి— "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మో భయావహః" అను శ్రీకృష్ణభగవానుని శాసనంబు నుల్లంఘింతురను సూచన మహాఋషిప్రోక్తంబు లగు పురాణంబులవలన నించుక గోచరించెడి నది యట్లుండె, నట్టి కాలం బింకను గొన్ని నూఱులలో నున్నయది యని తత్తదృషిప్రోక్తంబులవలన నవగతమయ్యెడి నప్పు డింతియ కాదు కొందఱు పండితబ్రువులు చండాలాదులకుఁగూడ గాయత్రీమంత్రోపదేశం బొనరించి యయ్యది శాస్త్రచోదితంబ యని వాదించు దురవస్థకూడ సంఘటించెడి నని భావికాలవేత్తలు నొడువుదు రని వెండియు. ౧౧౮

క॥ కాలంబ కూర్చు నన్నియుఁ, గాలంబ నశింపఁజేయుఁ గాలమె దైవం
బౌలంబం బది దానికిఁ, జాలిన దేదియును లేదు చర్చింపంగన్.

మ॥ ఒక కాలమ్మున నొక్కజాతికి మహాయోగంబు చేకూరు వే
ఱొక కాలమ్మున దగ్గు నయ్యది; జగమ్మొక్కప్పుడున్ మార్పు చెం
దక వర్తింపదు పారమార్థికపు యాథార్థ్యంపు విశ్వాస మే
రికి నుండున్ మఱివారు ధన్యు లరకు ద్రేకింతు రజ్ఞాత్మకుల్. ౧౨౦

వ॥ నీ వడిగిన ప్రశ్నంబునకు నా యెఱింగి నంతలో నుత్తరం బిచ్చితిఁ
బ్రతివిషయమ్మునకును నపౌరుషేయం బగు వేదంబు ప్రమాణం
బుగాఁ జూచికొని వర్తించు మానవుఁ డిహపరమ్ములు రెండును
జయించు ననునది సర్వధర్మసార మని యప్పురోహితుండు తిరు
వంకాడరునకు సమావర్తన పర్యంతమ్ము నతఁ డెట్లు ప్రవర్తింప
వలయునో యయ్యై విధినిషేధమ్ము లుపదేశించుటయు నబ్బా
లుండు భక్తిశ్రద్ధలు కలిగి యట్లు ప్రవర్తించుచు. ౧౨౧

శా॥ గాయత్రీగత "చోదయా" త్తను క్రియన్ గన్పట్టు నర్థంబుచే
నేయెందున్ మనుజున్ స్వతంత్రుఁ డనగా నేమాత్రమున్ వీలు లే
దే యజ్ఞానియొ తప్ప జ్ఞాన మిసుమంతే నున్నచోఁ జోదకుం
డై యెవ్వాఁ డలరారు వానిఁ గనఁగా నాశింప కెట్లుండెడిన్. ౧౨౨

చ॥ అతని నెఱుంగకున్న జని కర్థము గన్పడ దట్టివ్యర్థుఁ డీ
క్షితికి భరంబు, నాకు నెటు చేకుఱుఁ దాదృశమైన జ్ఞప్తి సూ
నృతవిదుఁడైన దేశికు ననింద్యచరిత్రుని గొల్చికాని నే
నితరవిధానఁగాను గృతకృత్యుఁడఁ; దాదృశుఁ డెందుఁ జిక్కెడిన్.

ఉ॥ పుట్టుటయెందుకో? మరలఁ బోవుట యెందుకొ? పోకయట్టులే
యుట్టిని గట్టుకూఁగునెడ నున్న ప్రయోజన మెట్టిదో? తుదిం

బట్టపురాజుకుఁ మఱియు బంటునకుఁ గల వారలేని య
ప్పట్టిటు మిట్టిమిట్టి పడు టక్కట! యెంతటి జ్ఞానహైన్యమో. ౧౨౪

చ॥ కలియుగ మిద్ది సంస్కృతికిఁ గష్టమొనర్చెడి వారెకాని యెం
దుల కిలఁ బుట్టుటో? యెటు జనుల్ చరియించి వెసం దరింతురో?
దెలిసి తరించి యన్యులకుఁ దెల్పి తరింపఁగ జేయునట్టి వా
రలు కడు మృగ్యులంచు గుణరాశి యితం డెడఁదం దపించుచున్.

వ॥ నిద్రాహారమ్ములయందును స్నానసంధ్యాదుల యందును మఱియు నెందును ననాస్థాపరుండై భూతావిష్టునిపగిది వాతులుని చందంబున నుండుటకుఁ దల్లియు బంధుగులును మిగుల వగలం బొగిలియుఁ బ్రియత్నించియుఁ గతం బరయఁజాలక చింతించుచుండిరి. ఇట్లు రెండేఁడులు గతించె. ౧౨౫

మ॥ చనుదెంచె న్నభ మంతలోఁ, గురిసె వర్షంబుల్, ధరాకాంత స
స్యనికాయమ్మున కాలవాలమయి యత్యంతమ్ము శోభిల్లె నెం
దును శ్రీమంగళ గౌరిదేవివ్రతమందు న్మగ్నచిత్తల్ సువా
సిను లొప్పారిరి వాయనమ్ము లెలమిన్ జేకొంచుఁ జెల్లించుచున్.

ఉ॥ "శ్రావణి" యంచు వైదికులు ఛాత్రులతోఁ జనుదెంచి గేస్తులన్
దీవనలం బొనర్పఁగఁ బదింబది నూళులలోన నాఁగుచున్
ద్రోవను వానకుం దడియు దోవతు లాఱఁగఁ బెట్టికొంచు సం
భావనకై చరించి రల మాఱటపద్మజు మూర్తులో యనన్. ౧౨౬

ఉ॥ బక్కగఁ జిక్కి గోగణముప్రాణము నిల్పుచెు కాక కండ పెం
పెక్కి సమృద్ధిగా నొసఁగె నెల్లెడ క్షీరము, లాపగల్ జలం
బెక్కుడు గాఁగఁ గట్లు తెగి యేపుమెయిన్ జగమెల్ల ముంచె నల్
దిక్కులు నీలమేఘపటలీ పటలీనము లయ్యె నయ్యెడన్. ౧౨౭

ఉ॥ రాణమెయిన్ గణేశనవరాత్రిమహంబు లొనర్చువారు వి
న్నాణము మీఱ నయ్యెడల నాట్యము లేక పురాణమో! అని
దాక్షిణపుష్కళమ్మై నెఱపి ద్రవ్యము గైకొనువారు, వీణఁ బ్రా
వీణిని జూపి సత్కృతులఁ బేరుచువారును నైరి కోవిదుల్. ౧౩౦

శా॥ అన్నప్రాశనదక్షభాద్రపదమం దయ్యైశుభా లెందు లే
కున్నన్ శ్రీగణనాథు నుత్సవములే యూరూర శోభిల్లి సం
పన్నుల్ గేస్తులు సత్కళావిముల సన్మానింపఁగాఁ జేసె నా
సన్నంబయ్యె నమాస యంతఁ బితరుల్ సంతోసముం బొందఁగన్.

తే॥ గీ॥ అది మహాలయామావాస్య యైన కతన
జ్ఞానకలకొడుకు తండ్రి కానాఁడు తృప్తి
గలుగునట్టులు ధనధాన్య కనకముఖ్య
దానము లొనర్చి విప్రులఁ దనిపి యనిపె. ౧౩౨

ఆ॥ వె॥ నాఁటిరాత్రి కలను మేటి యాజాను బా
హుండు యువకుఁ డొక్కరుండు దివ్య
దేహుఁ డేగుదెంచి దీవించి పట్టణ
త్తారు క్షిట్టు లనియె దయ దలిర్ప. ౧౩౩

తే॥ గీ॥ ధ్రువునకుం బోలె బాల్య మందుననె నీకు
దత్త్వపరిశోధనమునందుఁ దవిలె బుద్ధి
నినుఁ గనినయంత సంతోస మినుమడించె
ధన్యుఁడవు నీవు సర్వవిధముల వత్స? ౧౩౪

ఉ॥ నీమది నున్నచింత యది నే సకలమ్ము నెఱింగితిన్ భవ
క్షేమము గోరి నీ కొకటి చెప్పెద విన్ము కవేరజాతటీ
సీమనె కొంతదూరమున సిద్ధతపస్కుఁ డొకానొకండు వి
దాంపుహితుండు నీ కొఱకునై [illegible]

సీ॥ విష్ణుపురం బను వీటికి దాపున
నొక పర్ణశాలయం దుండి తపము
సేయు నమ్మహాత్ముc డీ యూరి కది యిరు
వదికోసులం దున్న యది విశేష
దూరమ్ముగా దేగుదువుగాక వచ్చుమూ
లాఖ్యనక్షత్రమ్మునందు నీవు
నినుc గాంచి యత్తపోనిష్ఠుండు జ్ఞానోప
దేశమ్మొసంగు సందియము వలదు

తే॥ గీ॥ అతనిపేరు కృష్ణానందుc డని వచించి
యమ్మహాపురుషుండు పద్మాక్షుc డభ్ర
మేచకతనుండు కరుణాసమేతుc డరిగె
నంత మేల్కాంచె శివనేశునాత్మజుండు. ౧౩౬

వ॥ అట్లు మేల్కాని స్వప్నవృత్తాంతంబు తల్లికిని దక్కంగల యాప్త
వర్గంబునకును వినిచిన వారెల్లరు నియ్యది శుభసూచకం బని యభి
నందించిరి. ౧౩౭

చ॥ శరదృతులక్షణంబులు దిశావలయమ్మున సర్వతః పరి
స్ఫురితమ్ములయ్యెc బౌడ్యమిని బూజకు నంబిక నిల్పి సాధకుల్
విరివిగc బూజలన్ సలిపి విప్రుల సర్వవిధాల భక్ష్యభో
జ్యరుచులc దన్పి దక్షిణల శక్తికొలందిగ నిచ్చి రచ్చుగన్. ౧౩౮

క॥ కొందఱుమూలమొదలుపూ,జందనుపcగcబూనిరంబశాంభవి,నెటcగ
న్నందత్కాలము పరమా,నందబ్రహ్మమ్ముగాc గనంబడె జగతిన్

క॥ శరదారంభమ్మ వసం,త ఋతుప్రారంభమును గృతాంతునిదంష్ట్రల్
పరమేశ్వరినర్చించిన,నరులకుcదద్భయమునుంతనాc_స్తియనెన్స్మృతుల్.

క॥ తిరువంకాడరు మూలా, వరనక్షత్రమ్మువచ్చు వాసరమునకే
అరిగెను గృష్ణానందుని, దరిసెన మొనరింపఁగా ముదంబెదఁబొదలన్.

శా॥ కావేరీసరిదంతికస్థములు వృక్షంబుల్ తదీయాగ్రశా
ఖావారస్థ కులాయసంగత శుభాకారప్రకారస్వర
శ్రీవిభ్రాజిత నైకపక్షికులముల్ చేతోవినోదం బటన్
గావింపన్ శివనేశపుత్రుఁ డరిగెన్ గైవల్యవిద్యార్థియై. ౧౪౨

మ॥ ఫలభారమ్మున వంగినట్టి క్షితిరుట్సంతుల్ లతాంతావళీ
కలితంబు ల్లలితంబులౌ లతలుఁ దద్గంధప్రలోభాశయా
కులముల్ తుమ్మెదలున్ శుకప్రకరముల్ కోకోధ్వనుల్ నించు కో
కిలముల్ గల్గినతోఁటఁ గన్గొనియెఁ బంకేజాకరోపేతమున్. ౧౪౩

క॥ కని దాని మనోహరతకు
మనమునఁ గడుమెచ్చికొనుచు మహనీయుం డే
మునియో యిచ్చటఁ దపమున్
బొనరించెడి నిక్కమని సముత్సుకుఁ డగుచున్. ౧౪౪

మ॥ ఎవ రేమందురొ! యంచు నెంచి మదిలో నేమేము శంకించుకోం
చవలన్ జూతము గాక యేమయిన నౌ నంచున్ దదారామమున్
శివనేశాత్మజుఁ డల్లనల్లఁ జని చొచ్చెన్ జొచ్చి తన్మధ్యమం
దవలోకించెను బర్ణశాల నటఁ గృష్ణానందుఁడున్ గన్పడెన్. ౧౪౫

మ॥ కలలోఁ గాంచిన రూపమే యతఁడుగాఁ గన్పట్టె ముమ్మూర్తులన్
దిలయుం తేనియు లేదు భేద మని యంతేవాసి తద్దేశికాం
ఘ్రులఁ బ్రాలెన్ శివనేశపుత్రు మిగులన్ గూర్మిన్ గనుంగొంచు నా
యలఘుం డాశిష మిచ్చి తల్లిఁగని యిట్లాడెం బ్రమోదించుచున్.

క॥ ఇతఁ డధ్వపరిశ్రమ సం, గతుఁడౌగి స్నానమును భుక్తిగన్గొనుము సుఖ
స్థితుఁ జేయుమనఁగనాపెయుఁ, గృతార్థునొనరించెనెంత యేనియుఁ బేర్మిన్.

మ॥ తిరువంకాడరు పుట్టిబుద్దెఱింగి యేదేశంబు నే యూరు నె
న్నెఱుఁగం డంతియకాదు తుట్టతుద కాయూగర్భలక్ష్మీశ్వరుం డే
పొరుగిల్ మెట్టి యెఱుంగఁ డీదృశున కాభూదేవుఁ డెంతెంతయా
దరముల్ జూపిన భీతభీతమయి స్వాంతం బెంతో కంపింపదే. ౧౪౮

చ॥ అది ముఖవైఖరిన్ దెలిసి అర్భక? నీకొక శంక లేదు నె
మ్మదిగ వసింపు మియ్యెడల మద్గృహ మియ్యది కొత్తయాట నీ
యెద కడుఁ గొంకుచున్నయది యెన్నఁడు నెయ్యెడ కేగకుంటచే
నిది సహజంబ నీ గృహమె యియ్యది సందియ మంద నేటికిన్. ౧౪౯

మ॥ ధనధాన్యమ్ములు భాగ్యభోగ్యములు విస్తారమ్ముగా నున్నచో
జననంబందు టదృష్టసూచకమ నిస్సందేహమే కాని ని
ర్ధనసంతానము నిర్భయమ్ముగ జగత్సంచారముం జేసెడిన్
ధనికాపత్యము లట్లుగాక కడు మందాత్మమ్ములన్ బ్రింగెడిన్. ౧౫౦

ఉ॥ ఈ సకల ప్రపంచమున నెవ్వనికో జనియించుఁ దత్త్వ వి
జ్ఞాన, మదేని రిక్తునకె సంచితసంపదుపాధిశాలి పే
రాసకు దాసుఁడై యిహమునందుఁ బరమ్మునయందు వ్యర్థుఁడై
గాసికి నగ్గమై చెడెడి జ్ఞానికి సాటి జగానఁ గల్గునే? ౧౫౧

ఉ॥ పుట్టితి వీవు సంపదలపుట్టకు సెట్టికిఁ బూర్వ జన్మమం
దెట్టితపం బొనర్చితివొ? యీ శిశుతాదశయందె నెమ్మదిం
దట్టె విరక్తి; శుద్ధపరతత్త్వము నా నెటువంటి దద్ది నా
కెట్టు లభించు నన్నవగ యేర్పడె నెంత యదృష్టశాలివో. ౧౫౨

చ॥ ఎఱిఁగిన యంతలో నెవని కేని వచించుట విజ్ఞధర్మ మీ
యెఱుకకు నాన సేయు జనుఁ డెయ్యెడఁ గానఁగరాక నే నెటో
అరయుచు నుంటి నిప్పటికి నబ్బితి వీవు భయమ్ము నీకు లే
దెఱిఁగినపట్టు నీ మదికి నే నెఱిఁగింతు రహస్య తత్త్వముల్. ౧౫౩

ఉ॥ సిగ్గునకుఁ భయమ్మునకు స్నేహము; దగ్గఱచుట్టముల్ సుమీ!
సిగ్గును భీతియుఁ, గుణవిశేషము లియ్యవి యోగ్యులందె దా
మిగ్గుణముల్ వసించు భయమేటికి? మీ యిలు మాగృహమ్మె; నీ
విగ్గృహమందు భిన్నమతి నించుకయుం గొనఁబోకు మర్భకా. ౧౫౪

క. అని బుజ్జగించి గురుఁ డా
తనికిం గడుఁ జనవొసంగి తనయంకమునం
దున గూరుచుండఁ బెట్టుక
తనయుని కినుమిక్కిలిగ స్వతంత్రత గొలిపెఁ. ౧౫౫

వ॥ అంతం గొంతసేపటికిఁ జుట్టుపట్టులనుండి పలువురు తత్త్వజిజ్ఞాసువులు యథాపూర్వమ్ముగఁ జనుదెంచి స్వాతివర్షమ్మునకు ముత్తెపుఁ జిప్పలుంబోలె నిరీక్షించుచుండిరి. పట్టణత్తారును గురుని తత్త్వోప దేశమ్ము విను నాస్థతో నువ్విళ్లూరుచుండెఁ బదంపడి కృష్ణానందుండు.

మ॥ జననం బందుట పెద్ద యాటయు గృహస్థత్వమ్ము గైకొంట సం
దనులం గాంచుట పెండ్లిసేయుట యిటుల్ నానాఁటి కేదేనియుఁ
బని యున్నట్టులె తోఁచు నొక్కొకపనిఁ బైపై విసర్జించి శాం
తిని వేగం గొనితత్త్వముఁ గనుటయే ధీమత్తరుఁ గుర్తగుఁ. ౧౫౬

మ॥ మన కన్నుల్ గనుచుండ నెందఱు జనుల్ మన్నెరొ? కానున్న వా
రును నింకెందఱొ యంచుఁ దెల్విమెయి ధీరుల్ సంసృతిన్ లోన న
మ్మనివారయ్యును బైకి నమ్మినగతిఁ మన్నింతు రవ్వారి వ
ర్తన మవ్వారికె గోచరం బితరదుష్ప్రాపంబు ముమ్మాటికిఁ. ౧౫౭

మ॥ తనజన్మించిననాఁడు తెచ్చికొనెనో? తాఁ బోవు నవ్వేళఁ గై
కొనునో? రెంటికిఁగానిదెయ్యదియు మూర్ఖుల్ స్వీయమంచుఁ దలం
చిన నే నొప్పను గర్మమొక్కటి యగుఁ స్వీయమ్ము వచ్చుఁ జనుఁ
దనతో నయ్యది తచ్చరిత్ర మెఱుఁగఁ శక్యంబు గా దేరికిఁ. ౧౫౮

మ॥ గృహశృంగారము చేసిచేసి గృహిణీశృంగారముం జేసి చే
సి హృదంతఃప్రతిబింబితమ్ములగు నిస్సీమంపుఁగోర్కుల్ సదా
బహుళత్వమ్మును జెందఁ దన్మయత సంభావింప లేఁ డన్య మీ
యిహమే శాశ్వతమంచు నెంచు కుజనుం డింతేని స్వాంతమ్మునన్.

శా॥ భార్యాపుత్రులయందు రక్తియును ద్రవ్యమ్మందు నాసక్తి యే
యార్యుల్ చెందరు? చెందుమాత్రమున నేమాయె న్మనమ్మందు నై
శ్వర్యం బస్థిర మాత్మజాతు లరు లీ జన్మం బనిత్య మ్మన
చ్చర్యల్ త్యాజ్యము లన్న జ్ఞాని కగు నుచ్చైఃప్రాప్తి నానాఁటికిన్.

శా॥ ఈవేళన్ మృతియేని రేపటికి రెం డేతాదృశం బైన యీ
జీవమ్మందును గాయమందును సుతస్త్రీబంధుగేహాదులం
దేవా రేనియు నాస గొల్పు టది తప్పే యొక్కచోఁ జేసినన్
భావింపన్వలె నెంతసత్యమనుచుం బల్మాఱు తత్త్వజ్ఞతన్. ౧౬౨

శా॥ కట్టున్ మేడ యొకండు వేఱొకరుఁడో కట్టున్ గృహం బన్యుఁడో
కట్టున్ జిన్నకుటీర మింకొకఁడు పాకన్ గాపురమ్మందు వీ
రెట్టుల్ మోదముగాంత్రు వారు నది యట్లే కాంతు రీ కోర్కులన్
గుట్టల్ గుట్టలు సేయునట్టి మది కెగ్గున్ సిగ్గు లేదే కదా! ౧౬౩

తే॥ గీ॥ ఎన్ని వేదమ్ము లెన్నెన్ని యేని శాస్త్ర
ములు పరీక్షించినంగాని ముక్తి కొక్క
భక్తికిన్ మించినట్టి యుపాయ మున్న
యట్లు తోఁచదు వినుఁడు యథార్థ మింత. ౧౬౪

క॥ భాగవతముపఠియించిన,చో గీతార్థం బెఱుంగుచో నితరములౌ
నాగమములు శీలించిన,చోఁ గలుగదు ముక్తిభక్తిచొప్పడ దేనిన్.

క॥ వ్యాకర్త లొక్క రొక్క ర,నేకగతుల వ్యాకరించి రేనియు నదిత
ద్ధీకుశలత కే గురుతగు, నే కుజనుం డేని భక్తి నే తరియించున్. ౧౬౫

క॥ జ్ఞానమ్ముగాని జ్ఞేయము, గానీ జ్ఞాతయును గాని కానఁబడని వి
జ్ఞానులు సైతము వ్యవహా,రానందమునందు దీని కనుకూలేచ్ఛల్.

క॥ అనుచుఁ భక్తినిగూరిచి, యనఘుం డానందుఁ డెలమి నందఱకు న్న
చ్చినశైలి నుపన్యాసం, బొనరిచె నదుణుండు గ్రుంకె నొయ్యన నంతఁ.

వ॥ పిమ్మట సాయంకాలపూజాదికంబు నెఱవేర్చికొని యనంతరంబు నవరాత్రిపూజామాహాత్మ్యాదికంబును గూర్చి యుపన్యసించి విరమించునప్పుడు కృష్ణానందగురుండు చుట్టునుం బలసియున్న శ్రోతలం గూర్చి యిట్లు ప్రశ్నించె. ౧౬౯

క॥ నాయనలారా ! వింటిరి
గా? యీనాఁ డేను దెల్పఁగా నెయ్యదియో
మీయెదఁ దోఁచిన తెఱఁగున
నా యడిగెడి ప్రశ్న కిడుఁ డొనర నుత్తరముఁ. ౧౭౦

క॥ పరమావధి యెయ్యదియో !
కరము విచారించి జీవగణమునకుఁ మీ
రొఱిఁగిన తెఱఁగునఁ బలుకుఁడు
పరిశీలించెదను మీదు ప్రజ్ఞాబలముఁ. ౧౭౧

వ॥ అనుటయు ౧౭౨

సీ॥ జ్ఞానం బటంచు నొక్కండు వచించి తోఁ
చిన యుక్తు లేవియో చెప్పఁదొడఁగె
మానంబటం చొక్కమాన్యుండు వల్కి తోఁ
చిన యుక్తు లేవియో చెప్పఁదొడఁగె
ధ్యానం బటం చొక్కధన్యుండు నొడివి తోఁ
చిన యుక్తు లేవియో చెప్పదొడఁగె

హీన మ్మటం చొక్కయార్యుండు వినిచి తోఁ
 చిన యుక్తు లేవియో చెప్పఁదొడఁగె

తే॥ గీ॥ ముక్తి యనె నొక్కరుఁడు సుఖభుక్తి యనియె
 నొక్కఁడు విరక్తి యనియె నింకొక్కఁడేది
 యో వచింపఁగ జాల నా భావ మెఱుఁగు
 ననియె నది యేటి యుత్తర మనియె నొకఁడు. ౧౭౩

క॥ పలువురు పలువిధముల నిట్టు, తలకొకగతి నుత్తరింప దరహసితముఖుం
 డలకృష్ణానందగురుఁడు, వలికెన్ శివనేశుపట్టివంక మొగంబై. ౧౭౪

ఉ॥ ఇందఱు చెప్పనుత్తరము లీవును వింటివి నీకు నచ్చెనే
 దిందు? వచింపు కానియెడ నేయదియేని వచింపు మింతలోఁ
 దొందరలేదు నెమ్మదిని దూరము యోజనఁ జేసి చెప్పు మం
 చుం దను హెచ్చరింప గురుఁజూచి వణకుస్తుఁ డిట్లువల్కెడిన్.

తే॥ గీ॥ ఆర్య ! మీ చెప్పునది యెల్ల నాలకింప
 వలయుననుకోర్కి యొక్కటే కలదు నాకు
 దేనిఁగాని వచింపఁగా నేను జాల
 నింతియే నా యెఱింగిన దిద్ధచరిత. ౧౭౫

వ॥ అని సవినయముగ వచించి వెండియు. ౧౭౬

ఉ॥ దేవర యేదిచెప్పిన నదే విని యట్లనె యాచరించుటే
 నావిధి శిష్యుఁగూర్చి గురునాథుఁడు చెప్పెడి దేదిగాని స
 ద్భావవిశిష్టమే యని సదా హృదయమ్మున విశ్వసింతు నా
 దేవుఁడె నాదుపాలిటికి దేశికుఁ; డాయన నేగిఁగూర్చునే. ౧౭౭

క॥ గురువే బ్రహ్మయు విష్ణువు, గురువే దైవమ్ము శివుఁడు గురువచనమ్మే
 పరమామ్నాయము బ్రదుకుం, దెరువదియేయిదియెనాకు దెలిసినదనఘా.

వ॥ తిరువంకాడరు చెప్పిన సమాధానమ్మునకుఁ గృష్ణానందుండు పరమా
నందంబునంది చుట్టునుం గలవారిని గలయుం గనుంగొని. ౧౮౦

మ॥ ఉపదేశార్హాత యన్న నిట్టిదియె శిష్యుండన్న నిట్టిండె జ్ఞా
నపదార్థం బిటువంటిచోటఁ బడి జీర్ణంబై పరార్థ ప్రమో
దపరత్వమ్మున కిక్కయై శ్రమకు సార్థక్యంబు గల్గించు నా
ట్యపుసౌభాగ్యముః జూడఁ బోవు మనుజుం డౌ నన్యథా మైనచో.

చ॥ ఒకరిని జూచి వేఱొక రిక్కొకరిఁ జూచి మఱొక్క రోలి దే
శికు నికటానకుఁ జనుచుఁ జెప్పిన దొండును విన్నదొండు గా
సకలము విందు రేగుదురు జ్ఞానముగల్గునె యంతమాత్ర ని
చ్చ కుదురకున్న యవ్వనికి జల్లెడయందలి నీటిమాద్రిదా. ౧౮౨

మ॥ ఉదితజ్ఞానసమాధియుక్తుఁడగు శిష్యుం డబ్బుచో నొజ్జనె
మ్మదికిం గల్గెడిమోద మయ్యది యసామాన్యంబు; సల్లక్షణా
స్పదుఁడౌ శిష్యున కబ్బు నొజ్జ యొకటన్, సచ్ఛిష్యుఁ డేయొజ్జకున్
గుదురంబోఁ,డపు డాత్మయందునె యడంగున్ జ్ఞాన మాయొజ్జకున్.

వ॥ అని మఱియును. ౧౮౪

క॥ నిండినపాలం జేఁపెడి, కుండోధ్నికి వత్సమట్లు గురునకుఁ దగు శి
ష్యుం డుండవలయునటు లే,కుండినచోఁ జింతగలుగునొజ్జకుమిగులన్.

తే॥ గీ॥ ఈశ్వరానుగ్రహము లేక యెవరికేని
తగిన గురువు లభింపఁ డుత్తమగురుండు
దొరకినను భోగలాలసుల్ తరణమును గ
డింపనేరరు సంసృతి రొంపినుండి. ౧౮౬

మ॥ అగురున్ గంధముఁ బూలమాలికలు మేలత్తర్లునై భోగులే
తగులో వెట్టుక యెప్పుడో గురుని సందర్శింతు రాయొజ్జ యా

భగవద్వంచితు లైనవారలకుఁ జెప్పంజాలునే చెప్పఁచో?
నగుఁబా టయ్యెడుఁగాని వారిమదిలో జ్ఞానాంకురం బంటునే. ౧౮౭

శా॥ జ్ఞానం బన్న ధనంబు గాదు మఱియుం ధాన్యంబునుం గాదు వి
జ్ఞానంబన్నఁ గరంబు గైకొను మహాసామ్రాజ్యమా? కాదు జ
న్మానంత్య మ్మడిగించు వస్తువిది సంప్రాప్తించుచో సర్వదా
ఆనందమ్మునఁ గాలముం గడపుచో ప్రార్జించినట్లే యగుం. ౧౮౮

తే॥ గీ॥ చక్రవర్తులు కొడుకులఁ జక్రవర్తు
లుగ నొనర్ప నేర్తురుగాని లోకమందు
జ్ఞానధను లాత్మజన్ముల జ్ఞాన ధనులు
గా నొనర్చుట అరుదుగాఁ గానఁ బడెడి. ౧౮౯

క॥ ఒక జ్ఞానరేణు వొకవై, పొకసామ్రాజ్యమ్ము నింక నొకవైపుగఁ దూ
నిక వేసిన జ్ఞానమె మ్రొగ్గక పోదది దేనికన్నఁ గడు భరమగుటన్.

శా॥ ఆధివ్యాధి పరీతమైన తనకాయం బర్థిఁ బోషించుచున్
శోధింపన్వలె వేదశాస్త్రములు సంశోధించి యద్దానిచే
సాధింపన్వలె ముక్తిమార్గ మదియుం సాధించి మోక్షార్థికిన్
బోధింపన్వలె జన్మమన్న నదియే పో? అన్య మన్యంబ యౌ?

వ॥ ముక్తులును బలుతెఱంగులు, వానిలో నేదియేని సాధింపఁగల్గినచో
వాని జన్మంబు ధన్య మనియే తలంప వలయు. ౧౯౨

మ॥ జననా లెన్నియొ యెత్తి పిమ్మటనె మోక్షంబందు నే ప్రాణియున్
జన దుర్వేత్తుగ నొక్కజన్మముననే సాధింప మోక్షమ్ము "వే,
గునె? యొండొక్కకలన్ గనన్నిసి, యెఱుంగుం డింత, నానాఁట స
జ్జనసాంగత్యము కల్మి సర్వశుభముల్ సాధింప వీలయ్యెడిన్. ౧౯౩

వ॥ ఇట్లనేక విషయమ్ములు మిక్కిలి సుబోధంబగున ట్లుపన్యసించు
నప్పటికి నిశీథం బగుటయు నప్పటికి సభ ముగిసె. ౧౯౪

మ॥ తిరువంకాడరు నొక్క యిర్వురును నేదే లోనఁ జింతించుచున్
భరమౌ నిద్దురకున్ వశంపడక "తత్త్వస్ఫూర్తి యెట్లబ్బు నీ
శ్వరుఁ డెట్టుల్ గరుణించు" నన్నవగతో జాగ్రద్దశన్ గాంచుచుం
డిరి తక్కుంగలవారు గుఱ్ఱిడుచు దుర్నిద్రాణులై రయ్యెడన్. ౧౯౫

చ॥ నిదురనుగూర్చియే యెఱుఁగనేరదు తొంబదిపాళ్ళు లోక మిం
కెది యెఱుఁగంగనేర్చుఁ బరమేశ్వరియే నిదురన్నఁ దద్వశం
వదుఁడయి విష్ణుదేవుఁడు ప్రపంచము సర్వము విస్మరించు నా
నిదురను యోగమాయయని నిర్వచియింతురు తత్త్వవిత్తముల్. ౧౯౬

తే॥ గీ॥ నిదురయే కాదు హ్రీయును నీతి లోను
గాఁగల గుణౌఘమును శక్తి కళలుగా వ
చింత్రు శాక్తేయులైనట్టి సిద్ధమతులు
కోవిదులకేని యిద్ది యగోచరంబె. ౧౯౭

చ॥ మును మధుకైటభుల్ గొమరుమిట్టి వధింపఁ గడంగ నప్పు డా
యన యలయోగనిద్రఁ బడి యజ్ఞుఁడపోలెఁ జలింపఁడయ్యె నా
వనజభవుండు రక్కసులబారికి నోరువలేక నాయనా!
యని మొఱవెట్టుకొన్నకత యంతయు భాగవతప్రసిద్ధమే. ౧౯౮

తే॥ గీ॥ అట్టినిద్ర విద్యార్థులయందు జార
చోరులందును జొరవెఱచుచుఁ జరించు
నొకరిజాగరణంబు పుణ్యోదయకము
మఱియొకరి జాగరణము ప్రమాదకంబు. ౧౯౯

మ॥ ఒకచో వస్తు వొకొక్కచో నొకఫలం బొండొక్కచోటన్ మఱొం
డొకఁడున్ గల్గఁగఁజేయు నాశ్రయగుణం బూఁతమ్ముగాఁ; దెల్పెదొం
గకుఁ యోగీంద్రున కొక్కటే విధమునం గన్పట్టు నందొండు నా
రకమున్ వేఱొకఁ డిచ్చు స్వర్గమును ధీరవ్రాత మగ్గింపఁగన్. ౨౦౦

వ॥ అది యట్లుండె బదంపడి కృష్ణానందయోగీంద్రుండును గొండొక
కన్నొగిచి మేల్కాని మరల శిష్యులకుఁ దత్త్వజ్ఞాన విషయకమ్ము
లగు సంగతు లుపదేశింపఁదొడంగె. ౨౦౧

సీ॥ ఇట్లు కృష్ణానందుఁ డిష్టగోష్ఠిగ శిష్య
వర్గమ్మునకు స్వానుభవము నరఁటి
పండు నొలిచిపెట్టు భంగి సుబోధమ్ము
గాఁ దెల్పునంత రిక్కలకుఁ గాంతి
సురిఁగెఁ బ్రాభాతిక మరుదంకురములు చ
ల్లఁగ వీవఁజొచ్చె నధ్వగులు లేచి
పయనమ్ములను బొనర్పఁగసాఁగి రాగమ
జ్ఞులు నదీజలముల జలకమాడి
తే॥ గీ॥ అప్పుడే యుదయించు సూర్యభగవాను
నకు నొసగుచుండి రర్ఘ్యముల్ సకలదిశలు
నిస్తమస్కమ్ము లయ్యె నిందిందిరార
వమ్ము సరసిజాకరములఁ గ్రమ్మికొనియె. ౨౦౨

వ॥ కృష్ణానందుం డా నాఁటి పూజానంతరమ్మునఁ దిరువంకాడరునకు
శైవదీక్ష నొసంగి దానికి ననువగు తత్తదాగమోక్తధర్మంబుల
నుపదేశించి యిట్లనియె. ౨౦౩

శా॥ ఈ దీక్షాపరు లెట్టులుండవలెనో! యే నీకు వాక్రుచ్చితిఁ
వేదోక్తంబులు యజ్ఞయాగములకున్ భేదించు నీ దీక్ష ల
ట్లేదో కొండొక భేద మున్న ఫలితం బే మాత్రమున్ దగ్గ దె
చ్చైదైవా తెఱడి నంతకున్ శతగుణం; బాలించి శీలింపుమా! ౨౦౪

వ॥ వినయాది సకలగుణంబులును జన్మతోలబ్ధంబులుగా నలరారు నీకు
విశేషించి బోధించు టనావశ్యకంబే యైనను నాచారనిర్వహణార్థ
మ్మించుక వ్యాఖ్యానించెద నాలింతువుగాక. ౨౦౫

చ॥ అన్నృతము లాడఁగూడదు శివార్చన మెంతటి పాణిగొడ్డముల్
పెనఁగొనునప్పు డేనియును వీడి చరింపఁగరాదు జంగమా
ర్చనమున బుద్ధి నిల్పవలె శైవపురాణములం బొరింబొరిఁ
వినవలయుఁ బఠింపవలె విజ్ఞుల సత్కృతి తోడు సీడగఁ. ౨౦౬

వ॥ ఈ రీతి నొకమండలకాలమ్ము జరిగినపిమ్మట నలువది యొకటవ దినమ్మున మరల నిక్కడ కరుదెంచునది యని సానుకంపమ్ముగా ననుపుటయు. ౨౦౭

క॥ శివనేశు తనూజుఁడు గురు
సవిధమ్ముననుండి కాలుసాఁగక యశ్రు
స్రవణమ్ము కల్మి గద్గద
రవుఁడై గురు సెలవు గొని భరమ్ముగ నరిగెఁ. ౨౦౮

ఆ శీ ర్వ చ న ము

క॥ పరమేశ్వరుఁ డొసఁగిన తన
సిరిఁ యుక్తవ్యయమ్ము చేకూర్చుచు బం
గరుకుం దావిం గొల్చిన
తెలుఁగున వర్తించు రెడ్డి దీవింతుఁ బొరిఁ ౨౦౯

గ ద్య

ఇది శ్రీతిరుపతి వేంకటీయం బగు శివభక్తి యను
పరమభక్త చరిత్రమ్మున ద్వితీయాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ



శ్రీమత్పరదేవతాయై నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.



శ్రీ

# శివభక్తి

## తృతీయాశ్వాసము

తే॥ గీ॥ ఆయురారోగ్య భాగ్యభోగ్యములు సుకవి
వర్ణనీయయశమ్ము సంపదకుఁ దగిన
తక్కు సుగుణమ్ములును గల్గి రిక్కలందుఁ
జందురుఁడవయి రెడ్డి! ప్రశస్తి గనుము.

వ॥ అవధరింపు మనంతరకథావిధానంబు.

చ॥ అరిగినదాది దేశికునియాజ్ఞను జక్కఁగ నిర్వహించుచున్
బరశివు నాఱువేళల సభాజితుఁ జేయుచు సర్వదా శివ
స్మరణమె కాలయాపనకు సాధకమౌ గతి మండలాహము
ల్జరిపి గురూత్తముం గన వెసన్ జనె విష్ణుపురమ్ము చెంతకున్.

తే॥ గీ॥ అట్లు చనుదెంచునప్పటి కగ్గురుండు
వేదపాదలకును వేదవిదుల కంధ

పంగురుగ్ణులు మొదలగు వారలకును
స్విష్టకృత్తు సంతర్పణ సేయుచుండె. ౪

చ॥ గురువరుఁ డట్టి సందడిఁ దగుల్కొని యుండియు శిష్యురాకకున్
గరముఁ బ్రమోదమంది వెసఁ గౌఁగిటఁ జేరిచి యాదరించి స
త్వరమున భోజనాది సదుపాయములన్ దగువారిచే గుణో
త్తరునకు సాధుపుత్రున కుదారుఁ డొనర్పఁగఁ జేసెఁ బిమ్మటన్. ౫

క॥ సంతర్పణమ్ము ముగిసె న
నంతర మానందమునియు నభ్యవహృతిచేఁ
గొంత శ్రమ తగ్గి యెదియొ
అంతేవాసులకుఁ దెల్పు నాసమయమునన్. ౬

శా॥ ఏతెంచె న్నరనాథుమంత్రి యొకఁ డా యీ యోగి దర్శించి వి
జ్ఞాతృత్వమ్ము గడించుకోర్కె దలఁపుతో; ఛాత్రాన్వితున్ గృష్ణునిం
జేతోమోద మెలర్ప మ్రొక్కి తనకున్ శ్రీకంఠదీక్షన్ గృపా
న్వీతింజేసి యొసంగవే! యని తనున్ వేడన్ గురుం డిట్లనున్. ౭

క॥ శివదీక్షయందు నీమది
దవులుట కానంద మయ్యెఁ దగు శిష్యునకే
శివదీక్ష యుపకరించెడి
నవుఁబాటగుఁ దగనిచోట నాటినపట్లన్. ౮

ఆ॥ వె॥ రెండు మూఁడు చాళ్లు మెండుగా దున్నిన
పొలమునందు విత్తు మొలచినట్లు
వట్టి బీడునందు వైచిన మొలవదు
దీక్ష నీయవలెఁ బరీక్ష చేసి. ౯

మ॥ శివదీక్షం గొను నిచ్చ నీకుఁ బ్రభవించెన్ బ్రాగ్జనుస్సంచిత
స్తపనీయోచ్ఛ్రిత పుణ్యహేతువున నీ జన్మంబు ధన్యంబు రా

శ్రీమత్పరదేవతాయై నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.



శ్రీ

# శివభక్తి

## తృతీయాశ్వాసము

తే॥ గీ॥ ఆయురారోగ్య భాగ్యభోగ్యములు సుకవి
వర్ణనీయయశమ్ము సంపదకుఁ దగిన
తక్కు సుగుణమ్ములును గల్గి రిక్కలందుఁ
జందురుఁడవయి రెడ్డి! ప్రశస్తి గనుము.

వ॥ అవధరింపు మనంతరకథావిధానంబు.

చ॥ అరిగినదాది దేశికునియాజ్ఞను జక్కఁగ నిర్వహించుచున్
బరశివు నాఱువేళల సభాజితుఁ జేయుచు సర్వదా శివ
స్మరణమె కాలయాపనకు సాధకమౌ గతి మండలాహము
ల్జరిపి గురూత్తముం గన వెసన్ జనె విష్ణుపురమ్ము చెంతకున్.

తే॥ గీ॥ అట్లు చనుదెంచునప్పటి కగ్గురుండు
పేదసాదలకును వేదవిదుల కంధ

పంగురుగ్ణులు మొదలగు వారలకును
స్విష్టకృత్తు సంతర్పణ సేయుచుండె. ౪

చ॥ గురువపుఁ డట్టి సందడిఁ దగుల్కొని యుండియు శిష్యు రాకరున్
గరముఁ బ్రమోదమంది వెసఁ గౌఁగిటఁ జేరిచి యాదరించి స
త్వరమున భోజనాది సదుపాయములన్ దగువారిచే గుణో
త్తరునకు సాధుపుత్రునిన కుదారుఁ డొనర్పఁగఁజేసెఁ బిమ్మటన్. ౫

క॥ సంతర్పణమ్ము ముఁగిసె న
నంతర మానందమునియు నభ్యవహృతిచేఁ
గొంత శ్రమ తగ్గి యెదియో
అంతేవాసులకుఁ దెల్పు నాసమయమునన్. ౬

శా॥ ఏతెంచె న్నరనాథుమంత్రి యొకఁ డా యీ యోగి దర్శించి వి
జ్ఞాతృత్వమ్ము గడించుకొన్ దలఁపుతో; ఛాత్రాన్వితున్ గృష్ణునిం
జేతోమోద మెలర్ప మ్రొక్కి తనకున్ శ్రీకంఠదీక్షన్ గృపా
న్వీతింజేసి యొసంగవే! యని తనున్ వేడన్ గురుం డిట్లనున్. ౭

క॥ శివదీక్షయందు నీమది
దవులుట కానంద మయ్యెఁ దగుశిష్యునకే
శివదీక్ష యుపకరించెడి
నవుఁబాటగుఁ దగనిచోట నాటినపట్లన్. ౮

ఆ॥ వె॥ రెండు మూఁడు చాళ్లు మెండుగా దున్నిన
పొలమునందు విత్తు మొలచినట్లు
వట్టి బీడునందు వైచిన మొలవదు
దీక్ష నీయవలెఁ బరీక్ష చేసి. ౯

మ॥ శివదీక్షం గొను నిచ్చ నీకుఁ బ్రభవించెన్ బ్రాగ్జనుస్సంచిత
స్తపనీయోచ్ఛ్రిత పుణ్యహేతువున నీ జన్మంబు ధన్యంబు రా

జవరేణ్యుం డొకనామమాత్రుఁడుగ రాజ్యంబెల్ల నేకాతప
త్రవిభుత్వమ్మున నేలు నీకు శ్రమసాధ్యం బైన యత్నించెదర్. ౧౦

శా॥ కామక్రోధమదాది శత్రువుల దుర్గర్వంబు నేమాత్రము
న్నేమింపంగల శక్తిలేని మనుజు న్నేఁ గాని యన్యుండు గా
నీ మన్నించి "మహాగృహ"స్థని వెసన్ దీక్షాపరుం జేయుచో
నేమంబుల్ నెఱవేర్పఁ జాలనియెడ న్నిందార్హుఁ డాయొజ్జ యా. ౧౧

తే॥ గీ॥ అక్షరాభ్యాసమైన యనంతరమునఁ
గ్రమముగాఁ జిన్న చిన్న పొత్తములు చదివి
యవుల నే విద్య యేనియు నభ్యసింతు
రల్లె దీక్షకునుం గల వంతరములు. ౧౨

ఉ॥ కావునఁ బాత్రతాగరిమ గల్గెడునంతకుఁ దాళి గాని దీ
క్షావిధిలోనఁ జొన్పుటకు శాస్త్రము లొప్పవు రేపె యాదిగా
నీవు నదీజలంబులను నేమముమై జలకంబులాడి సం
ధ్యావిధిఁ దీర్చి దేవు మనమందుఁ జపించుచు నుండు మాస్థతో. ౧౩

క॥ ఉపనయన మపుడు గాయ
త్ర్యుపదేశము జరిగినను దదుపరి క్రమముగా
నెపుడున్ మానక మంత్ర
మ్ము పఠింపన్ వలయు నొజ్జముఖమున వినుచున్ ౧౪

ఆ॥ వె॥ అట్లు శ్రద్ధ కలిగి యభ్యసింపని మంత్ర
మపగతస్వరత్వ మంది చెడెడిఁ
గాన మరల నొజ్జకడ కేగి సంజ వా
ర్చికొను నేర్పు నలవరించి కొనుము. ౧౫

క॥ ఇది నీకె కాదు కడు సంపద గలగేస్తులకు నెల్లఁ బొల్పడు దోసం
బెద నన్యథా దలంపకు, మొదటిది సంజయె సమస్తమునకు న్మనకున్.

వ॥ ఇట్లు కొండొక కాలమ్ము చరించితి వేని. ౧౭

ఉ॥ అంతట దీక్షకున్ దగినయర్హత నీ యెడ గూఢమౌను నీ
చెంతకు నేనె వచ్చి పరిశీలన చేసి వచింతు దీక్ష నా
ద్యంతము; వేఱుగాఁ దలఁప నర్హత లేని నినున్ వృథాపరి
శ్రాంతికి లోనొనర్చు టది చాల దొసంగని యిట్లు చెప్పితిన్. ౧౮

తే॥ గీ॥ శిష్యునధికారమును బరిశీలనముఁ బొ
నర్పకే వాని కేవొ మంత్రములుగాని
అన్యములు గాని యుపదేశ మాచరించు
గురుఁడు నరకమ్మునందునఁ గూలి పోగులు. ౧౯

వ॥ ఇప్పటికి నింటికిం జని నా చెప్పినచొప్పునఁ బ్రవర్తించుచు నర్హత
సంపాదించుకొను మనుడు నా సచివుండు వల్లె యని యనుజ్ఞంగొని
చిన్నఁబుచ్చికొని చనుచుం దనమనంబుననిట్లు వితర్కింపం దొడంగె.

క॥ ధనికుల కర్హత లేదని, యనుమానము లేని ఫక్కి నానతి యిడె నీ
యన దీనికైన యేనిపు,డనదనగుటయెట్లు పొసఁగు నదియటులుండెన్.

మ॥ శివనేశాత్మజుఁ డక్క డుండెనుగదా? శిష్యుండుగాఁ; గోటికిన్
మివులున్ వానిధనం బటందు రెటు పేర్మిన్ జేర్చె నవ్వాని; భూ
ధవులం దెందఱు లేరు జ్ఞానులు, దరిద్రత్వం బొకం డున్నచో
శివదీక్షార్హత గల్గునే? జనకునిన్ శిక్షింప రే? సన్మునుల్ ౨౨

చ॥ ఒకజనకుండె కాదు మఱియున్ గల రెందఱొ తేండ్లు పాండుపు
త్రికునకు ధర్మరాజునకు ధర్మము జ్ఞానము చక్కఁ దెల్పుచో
ధకుఁ డల భీష్ముఁ డెంత విబుధప్రవరుం? డతఁ డాధిపత్య మొం
దక విడినంతమాత్ర క్షితినాథుఁడు గాఁడన నేరిశక్యమౌ? ౨౩

ఆ॥ వె॥ బ్రహ్మచారియగుచు వర్తించెనేగాని
యుద్ధములకుఁ బోక యుండలేదు

అంతేకాదు చనె స్వయంవరములకు నై
తము ప్రపంచ మెఱుఁగు తజ్ఞుఁ డతఁడు. ౨౪

ఆ॥ వె॥ ఉండఁ గొంప లేక పండఁ బానుపు లేక
తిండిలేక మాడు దీను లెంద
ఱిద్ధరిత్రి నుండ రుద్ధరింతురె? వీర
లెల్లఁ దదితరులను ధీరు లగుచు. ౨౫

క॥ తా నటు సంతర్పణముల, దేనికతనఁ జేయఁగలిగె దీనుల కది లే
దేని యవి సాఁగ నేర్చునె? దానిని నిరసించె నెట్టి తత్త్వజ్ఞుండో.

క॥ తిరువంకాడరు ధనికుం, డరుసమ్మనఁ జేర్చికొనియె నతఁ డీయనకున్
గురుదక్షిణ విపులముగా, గురిపింపఁగఁబోలుధన మెకూర్చునఖిలమున్.

క॥ కోమటిబిడ్డఁడు ధనమిడి, నేమమ్మున కర్హుఁడయ్యె నే బ్రాహ్మణుఁడన్
నేమమున కనర్హత్వము, నా మొగమునఁ గన్పడెన్ ధనం బిడకున్కిన్

తే॥ గీ॥ అతఁడు కోటికిఁ బడగెత్తినట్టి సెట్టి
కొడు కగునుగాక కలదు నాకును ధనంబు
పని వడిన నే నొసంగుచొప్పున వణిజుని
కొడు కిడునె? యడ్డదే? లోభగుణము వాని. ౨౯

వ॥ మానవకోటియంతయు ధనమునకు వశ్యులుగదా. ౩౦

తే॥ గీ॥ అట్టికోమటిబిడ్డ దీక్షార్హుఁడేమి?
యేను గానేమి! ధనమీయనేమి! గురుఁడు?
తప్పఁదలఁచెను దక్కుతత్త్వమున కేమి
దీనితత్త్వంబు పూర్తిగాఁ దెలిసికొంటి. ౩౧

చ॥ ధనము ప్రధాన మన్నిటికి, దానికి సాధ్యము గానికార్య మెం
దును గనరాదు బంగరువు దొంగల కంకకయుండ బొజ్జ డాఁ

చె నలహిరణ్యగర్భుఁ; డది చేసిన మేటితపం బదెట్టిదో?
కనకము మేనఁగట్టుకొనెఁ గంజదళాక్షుఁడు తిందు రెందఱో. ౩౨

శా॥ పాతివ్రత్యము గోలుపోదురు సతుల్ బ్రాహ్మణ్యముల్ గోలుపోఁ
జూతు ర్వ్రాఘులు, క్షత్రియుల్ కరుణకుల్ సున్నల్ బోరిల్ జుట్టఁగా
నేతు ర్వైశ్యులఁ జెప్పనేటి కసులల్ పీడంగఁ గొంకర్గదా!
యేతత్సర్వము కాంచనంపు గొనమే యెవ్వాఁడెఱుంగం డహో!

చ॥ కనకము కొన్ని బౌరువులుగా దిన మొక్కటి కిచ్చుశక్తి గ
ల్గిన దనిగా! శమంతకము కృష్ణుఁడు లచ్చిమగండు సత్యతం
డ్రి నడిగె నోరు విప్పి; యువనిల్ గనకంబును జూచి మోహముల్
గనని ఘనుండునుం గలఁడె? కాంతల కయ్యదియే సమస్తమున్. ౩౪

క॥ కాంతాకనకము లంచు వ
చింతురు ధీవరులు సిగ్గు సిగ్గిది కనక
ప్రాంతమ్మునఁ గాంతకు నిసు
మంతయుఁ జోటొసఁగరాదటని నే నందున్. ౩౫

తే॥ ఇంక నొక్కతప్పున్నది యిచట మొదటఁ
గాంతఁ బేర్కొని పిమ్మటఁ గనకమును వ
చించు టది బాగుగా లేద యెంచిచూడఁ
"గానివారికిఁ గంచాల" కరణి నుండె. ౩౬

చ॥ కనకపురేణు వెందయినఁ గన్పడ వృద్ధుఁడు గేల నంటుఁ గాం
తను గని వృద్ధుఁ డట్టిమమతల్ గొనఁ డీ యనుభూతిఁ జేసి కాం
తను గనకంబుతోఁ గలిపి తజ్ఞులు మోహకతాప్రసంగముల్
వినుచుట యెంతయేని యవివేకముకా మది నేఁ దలంచెదన్. ౩౭

క॥ సన్న్యాసులమంచు మతో, సన్యాసము లిచ్చువారు బంగారునెడన్
మాన్యతఁ జూపుదు రిఁక నే, ధన్యులనిదివరొ మొనర్పఁ దలఁపము త్రుటిలో.

క॥ గృహియే కృష్ణానందుఁడు
మహర్షియై కూడ; ధనసమర్పణచే ని
మ్మహనీయు కరుణ వడసెద
నిహపరము లొసంగుమంత్రి మేఁ గైకొనెదన్. ౭౯

వ॥ ఇట్లు కృతనిశ్చయుండై. ౮౦

ఉ॥ ఆ మఱునాఁడు హేమమయమై తగుపళ్లెరమందు రత్నముల్
హేమపునాణెముల్ గణన కెక్కుడుగా నిడి వక్కలాకులున్
* మామిడి లోనుగాఁ గలుగు మంచిఫలమ్ములు గొంచు నేగి ఆ
శ్రీమహితుండు గన్గొనియెఁ గృష్ణమునీంద్రు నపాస్తతంద్రినిన్.

మ॥ కని "స్వామీ! యివి స్వీకరించి నను భక్తశ్రేణిలోఁ జేర్చి మీ
యనుకంపార్ద్రవిలోకనమ్ములకు లక్ష్యం బౌనటుల్ చేసి జ్ఞా
ననిధిం జేయుఁ" డటన్న నా సచివు నజ్ఞానానకున్ యోగి నె
మ్మనమం దించుక చింత నొంది యిటు సంభాషించె నీషద్రిపన్.

శా॥ జ్ఞానం బన్న బజారునం దొలయు నంగళ్ళమ్ము నుప్పొక్కొ ? నీ
చే నే నీ ధనమున్ గ్రహింతు ననుకో శిష్యత్వపర్యాప్తి నీ
లో నేమాత్రము లేద యెట్టు లిపు డా లోపంబు శిక్షింపఁగా
నే నేర్తున్ గుహనా గురుత్వము నెటుల్ నే నేర్తు నీ కోసమై. ౮౩

చ॥ నృపుకడ నుండు మంత్రు లెవఁడే నెదియేనియు లంచ మిచ్చుచో
నపు డలవానికర్జముల నల్లనఁ జేయుట తక్కువాని నె
ల్లపుడును ద్రిప్పుచుంటయు స్వయమ్ముగ నీ కనుభూతమౌట నే
నపుఁబని సేయఁ బూనితి వుపాయము నీ కిది యెట్లు తోఁచెనో. ౮౪

చ॥ తెలిసినయంతలోఁ దనయధీనము నందలి విద్య యొద్దకున్
దెలుపుటకే సృజించె ద్విజు దేవుఁడు; ద్రవ్య మొసంగకున్నచోఁ

* టిప్పణి: దక్షిణదేశమున మామిడిపండ్లు సర్వదా లభించుట కలదు.

దెలుపమి ద్రవ్యమిచ్చునెడఁ దెల్పుట బ్రాహ్మణజాతి. కెన్నఁడున్
సలుపఁగరాని దోసములు; సాఁగు భవిష్యదనేహమం దిటుల్

చ॥ కలి ముదురున్ గ్రమక్రమముగాఁ బరదేశవిభుత్వమందు నీ
యిల మెలఁగున్ ద్విజన్మ లోకరే యన నేల? సమస్తజాతులున్
గలివశులై పొకాలుదురు కానిది యాయని వైనదాని మొ
క్కలమునఁ గా దటం చనెడి కావలు లెచ్చుగ నుందు రయ్యెడన్.

ఉ॥ అన్నపువర్తకమ్మునకు నగ్గ మగున్ ద్విజజాతి; యెన్నియో
పన్నులు పెంచి పేఁడులు కృపాపరతన్ దిగఁద్రావి లోక మా
పన్నతఁ గ్రుంగిపోయెడి యపాకృతులం బొనరింతు రంగనల్
తెన్నులు దప్పి వీఁకఁ బలు తెన్నులఁ బోదురు హ్రీవిహీనలై. ౮౭

చ॥ ప్రతిగృహ మేగి పండితులు పాఠములన్ ధనలోభమూని మా
లెతలకు నేని జెప్పుదురు లేకితనం బనుకోరు చాల ను
ర్గతి కెరయాను బొండితియుఁ గైతయు వేదము బ్రహ్మవిద్యయున్
బతితుల కందు గౌరవము పాత్రుల కుండద యప్డు లేశమున్. ౮౮

చ॥ అభినయవిద్య నేర్చి సభ నాడుట పాడుట సానిజాతికిన్
బ్రభ గలిగించు నన్ననుడి ప్రాఁతగిలున్ గృహిణుల్ కొమార్తలన్
సభలకుఁ బంపి నాట్యములు సల్పునటుల్ పొనరింతు రందు కే
విభులును సమ్మతింతు రవివేకమె సర్వము నిర్వహించెడిన్. ౮౯

ఉ॥ బుగ్గను వ్రేలు వెట్టికొని బొట్టియ మట్టెలు గల్లుగల్లనన్
సిగ్గుకు దూరమై సిలుకు చీర ధరించి "తకత్తకత్తకై
సగ్గరిసానిసాని" యని సానికొమారితఁబోలె నాడు నా
పగ్గెకు సంతసంపడెడివా రుదయించెద రార్యజాతిలో. ౯౦

శా॥ ఏ"కళ్చన్న"యొ భర్తృవేషమునఁ దన్నెట్లో శృంగారమం
దాకంఠమ్మును గౌఁగిలించుకొనఁగా నవ్వానితో రంగమం

దేకగీ్రవముగా నటించినను భర్తృప్రీత లయ్యాలితో
వీఁకఁ గాపుర మాచరింపఁ గల బల్విద్ధూరము ల్వాట్టెడిన్. ౫౧

మ॥ మగఁ డేదేశమునందొ యుండు సతియుం బ్రాణేశు దేశానకున్
మిగులన్ దవ్వగుచోట నుండు నిరువుర్మే లుత్తరాల్ మోయఁగా
నొగి సంసారసముద్ర మీఁదుదు రెవో యుద్యోగముల్ సేయుచున్
నగుఁబాట్లిట్టి వనేకముల్ జరిగెడిన్ రాఁబోవుకాలమ్మునన్. ౫౨

ఉ॥ నాదుపతివ్రతాప్రతిభ నా కిడె ముద్దుఁగుమారు నన్న సీ!
కాదది నేను జేయు నలకాశికయాత్రఫలం బటం చిటుల్
వాదొనరించుకోఁ దగినభార్యలు భర్తలు పుట్టుకాల మెం
తో దవునందు లేదు కడుఁదొందరగాఁ జనుదెంచెడిం జుమీ. ౫౩

వ॥ పతివ్రత మ్మింకను నట్టిదుష్కాలంబు గాదని యెఱుంగు మని వెం
డియు. ౫౪

ఉ॥ ఎందుకుఁ దెచ్చి తీ ధనము నీననుఁ గ్రీతు నొనర్చి నాకతా
నం దెలివిన్ బరాత్పరుఁ గనంగ నొనర్చెడిదాని నేకరిం
పం దలపెట్టి వచ్చితివి బాగు భవచ్ఛివదీక్షసొంపు దీ
నం దరియించుచో ధరణినాథులపాలిటి దాసి ముక్తి యౌ. ౫౫

మ॥ మునివేషమ్ము ధరించి రాజ్యమఖిలమ్మున్ వీడి ఘోరాటవుల్
చని కాదే? తపముల్ పొనర్చి నృపతుల్ సన్న్యాసవృత్తిన్ మహే
శునికారుణ్యము పొంది పుణ్యగతికిన్ సోపాననిర్మాణముల్
మును పే కొందఱొ చేసికొన్న యటు లుద్బోధించు నామ్నాయముల్.

చ॥ ధనమిడి ముక్తి నిచ్చెడి పథంబు కొనం దగినట్టిదైనచో
వనములకేగ నేమిటికి? వాంఛల వీడఁగ నేటి కెందఱో
ధనికులు ముక్తికిం జనుట తత్త్వదభిజ్ఞకథాప్రసంగముల్
వినిచియొ యుండు నెంత యవివేక మొనర్చితి మంత్రిసత్తమా? ౫౭

శా. ఈబంగారముగూడ మృత్తికయ సుమీ? జ్ఞానిదృష్టిన్ వివే
కీ! బంగారము మృత్తు మృత్తికను నుత్కృష్టంపు బంగారముం
గా బైరాగులు మార్ప నేర్చెద రెఱుంగ న్నేరవో? యేమొ? న
న్నీ బంగారముతోఁ గొనందలఁచితే? యేమందు నీ మాంద్యమున్

వ॥ అని యా బంగారునాణెమ్ములపై మంత్రోదక మ్మొకింత చిలు
కుటయు నయ్యది మృత్తికయై కనుపట్టె నల్లపసిండి పళ్ళెరమ్మును
మృచ్ఛరావం బయ్యె, నయ్యమాత్యుండును దక్కుఁగలవారును
నిర్విణ్ణులైరి, పిమ్మట నయ్యోగివర్యుండు. ౫౯

మ॥ అనృతమ్ముల్ శిశుహత్య లాత్మవధ స్త్రీహత్యల్ ప్రభుద్రోహముల్
జననీవంచన లాత్మవంచనలు విశ్వాసప్రమహానంబు లీ
కనకంబున్ గనిపెట్టుకుండు నిధులన్ గాపాడు దయ్యాలునా
గొన మిద్దాన లవంబు లే దెఱుఁగుమీ? కోశాధికార్యాగ్రణీ. ౬౦

తే॥ గీ॥ శిష్యహృత్తాపహారి దేశికుఁడుగాని
శిష్యవిత్తాపహారి దేశికుఁడు గాఁడు
అన్యథా నీవు తలఁపకు మాత్మతత్త్వ
మిట్టు లార్జించువారు లే రెపుడుఁగూడ. ౬౧

వ॥ అని యమ్మంత్రి నూరార్చి. ౬౨

తే॥ గీ॥ ఫలములం బుచ్చికొందు ద్రవ్యమ్ము సకల
మీవ కైకొమ్మనుచు జల మెలమిఁ జల్లి
నంత నయ్యది బంగారమై తనర్చె
నంత మంతిరి లజ్జితుం డగుచు నరిగె. ౬౩

వ॥ కృష్ణానందగురుండు శిష్యులఁ గలయుంగనుంగొని. ౬౪

శా॥ కోటల్ పేటలు మేడ లోడలును నేన్గు ల్లొట్టియల్ గుఱ్ఱముల్
తోఁటల్ రాజ్యము గీజ్యముల్ గనుచు సంతోషించుటే కాని యీ
బాటల్ బోయెడి ప్రాణికోటులకుఁ దత్త్వజ్ఞాన సామ్రాజ్యకా
వాటోద్ఘాటన పాటవప్రతిభ సంప్రాప్తింప దే నాఁటికిన్ ౬౫

తే॥ గీ॥ రాజముద్రనుబట్టి గౌరవము నేఁడు
హేమమునఁనుండెఁ బిమ్మట మృత్తునందుఁ
గూడ రాజచిహ్నము సమకూడవచ్చు
ననుకొనుం డప్పు డేమి యా నల్ల మృత్తు ౬౬

తే॥ గీ॥ గతమునం దెన్నఁడును లేని కల్పనా వి
చిత్రములు నాణెములను గూర్చినవి కొంత
కాలమునకుఁ బిమ్మటను నిక్కలిని బయలు
దేఱు గోచరించెడి జ్ఞానదృష్టి కవియు. ౬౭

వ॥ ఇట్లు శిష్యులకు బోధించెఁ దిరువంకాడరు గొన్ని దినమ్ములు గురు
కులమ్మునన యుండి తదనుజ్ఞాతుండై స్వపురమ్మునకు నరుగుచుఁ
దనలో నిట్లు వితర్కింపఁ దొడంగె. ౬౮

ఉ॥ బీదలకున్ జనింపక వివేకవిహీనత కెల్లభంగులం
బాదగుసంపదల్ గలుగువారి గృహాన జనించితిం గదా!
నాఁడెసఁ దత్త్వవిత్త్వ మది నాటునె! దేశికుఁ డేమి చెప్పెఁ జి
త్స్వాదము సంపమున్నతుల వైపున కేగదటం చనెంగదా! ౬౯

ఉ॥ ఒక్కటి గట్టుమేడ నదియుండఁగనే మఱియొండు గట్టు నల్
దిక్కులనుండుభూమి తనదే యగునట్లు యతించు నన్యులన్
జిక్కులపాలుసేయు సిరిచెయ్యల కర్థమటంచు నుండ ద
మ్మక్క! యదృష్టవంతు లని యందురు పామరు లట్టివారలన్. ౭౦

చ॥ జనకుఁడు గట్టియుంచినవి సౌధము లెన్నియొ యుండ వానివం
కను గను దిక్కు లేమి నెఱుఁగండొ? మఱేమొ నృపాలసూతి పె
ల్చున మఱికొన్ని సౌధములు లచ్చలు వెచ్చఁగఁ బెట్టి కట్టు నే
మనవలె సంపదున్నతులయక్కఱపుర్ వెడగుంబ్రయత్నముల్. ౨౧

ఆ॥ వె॥ పొడుముకాయపై నిపుణులు దశావతా
రములు చెక్కుపగిది రాజసుతులు
తెలుచు వ్యర్థకార్యతత్పరులై సొమ్ము
వమ్ము సేయుచుం డ్రివారి గాఁగ. ౨౨

ఉ॥ నూటికి నూఱువంతులు పనుల్ ధనికుల్ పొనరించునట్టి వే
పాటియుఁ బారమార్థికపు బాటకుఁ జేరక పోవుఁగాక యీ
నాఁటిసుఖమ్ము సైతము గొనంగొఱగాకయె పోవు వారి నే
లాటి విధాత సృష్టిగఁ దలంపవలెర్ సువివేకు లక్కటా. ౨౩

వ॥ నన్నుఁగూడ నట్టి ధనికులలో నగ్రగణ్యగృహమునందే జనింపఁ
జేసియు నించుక సదసద్విచారమ్మునకు నవకాశం బిచ్చినందులకు
సంతసింపవలసి యున్నను నియ్యది క్రమంబుగ నభివృద్ధి చెంద
నలయుంగదా? యని వెండియు. ౨౪

ఉ॥ పుట్టిన వెన్ని పుట్టువులొ? పుట్టఁగ నింక మఱెన్ని యున్నవో?
యిట్టి పరిశ్రమమ్మునకు హేతువు గన్గొనుబుద్ధి యేరికో
పుట్టెడిఁ బుట్ట నేమి యగుఁ బున్నెము పండి గురూత్తమాంఘ్రిలం
బట్టక తత్త్వవిత్త్వమది బమ్మకు నేని లభింప దెమ్మెయిర్. ౨౫

తే॥ గీ॥ నాయదృష్టమ్ముకల్మిని నాకుఁ దగ్గ
గురువరుండు లభించె నగ్గురుఁడు చెప్పు
చొప్పున సదాశివు భజించి చూఱఁగొందుఁ
గాక కైలాసవాసునఖండకరుణ. ౨౬

మ॥ అవివేకమ్మున కున్న వ్యాప్తి జగమం దావంతయుఁ గూడ లే
దు వివేకమ్మున కేమి హేతువొ కదా! దుష్కార్యముల్ సేయువాఁ
డెవఁడో వాఁడె యగుఁ ధరాధిపతి; లోకైకేశ్వరుం డిట్టిఁడే
యవునో! లేక వివేకియౌనొ? యిది గ్రాహ్యం బౌనె? నాబోటికిన్.

మ॥ జనులన్ దోఁచియు నూళ్ళుగాల్చియు జగత్సంహారమున్ జేసి రా
జను నుచ్చైర్బిరుదంబు గైకొని గజాద్యారోహణాదుల్ పొన
ర్చిన నేమౌఁ గృతమౌ నఘం బది జనుశ్శేషమ్మునందో పరం
బుననో! పట్టిపలార్చకుండునె? చలంబుంబూని యెవ్వారలన్. ౭౮

మ॥ ప్రతివాఁడున్ మృతిఁజెందు నే నొకఁడనే బ్రహ్మాయువై యుందు నన్
మతితో నెల్లరు జీవితమ్మునెడలన్ మందాత్ములై యుందురు వ్యా
ధితుఁడున్ రుగ్ణుఁడుఁగూడ జీవితమునన్ దీర్ఘత్వమే నమ్మి న
చ్యుతమే దేహము వెట్టిగాదె, యిది సంశోధించి చర్చించుచో. ౭౯

శా॥ భక్తుండై తరియించుటే సులభమన్ భావంబు వేదాంతపున్
సూక్తుల్ దెల్పెడి మంత్రతంత్రజపముల్ యోగమ్ములున్ మాదృశా
వ్యక్తుల్ నేరరు మానులే తగుదు రప్పట్ల న్ననున్ భక్తిసం
పృక్తున్ జేసి యనుగ్రహింపు మభవా! విశ్వేశ! సన్మోక్షదన్.

వ॥ అని తన్మయంబగు చిత్తమ్ముతో శివుం బ్రార్థించుచు నరుగు
పట్టణత్తారు తన యైశ్వర్యంబు తన యుద్యమమ్మునకు నంతరాయం
బగు నని తోఁచి. ౮౧

మ॥ శివ! నీ వెంతటి త్యాగశీలుఁడవొ! తచ్ఛ్రీశబ్దవాచ్యంబు ల
ల్లవిషంబున్ సిరియున్ గదా; మొదటిదే లగ్గంచు వే యొక్కఁడే
గ్గవునంచున్ మదినెంచి కాదె విష మాహారించి శ్రీ నల్లకే
శవుపాల్ సేసితి వేరెఱుంగని రహస్యం బిద్ది గౌరీశ్వరా! ౮౨

మ॥ విసముం జెక్కిన నీవు దక్క నితరుల్ విష్ణ్వాదు లల్లంతలో
నసువుల్ వాయుదు రల్ల శ్రీ గొనినవా రాయుర్బలోపేతు లు
బ్బసపుంరోగులువోలె నిల్చినను లాభంబేమి! విశ్వేశ! దు
ర్వ్యసనంబుల్ ప్రకటింతు రింగాన విసమే ప్రాకామ్య మీ రెంటిలో.

వ॥ ఇట్లు తనమనమ్మున నైశ్వర్యంబు సర్వానర్థప్రదం బని సమర్థించు కొనుచుఁ బరమేశ్వరాయత్తం బగుచిత్తమ్ముతోఁ దనగేహమ్మునకుం జని గురూపదిష్టప్రకారమ్మునఁ బాశుపతదీక్షాపరుండై కాలమ్ము సుమాళమ్ముగఁ గడపుచుండె నంత. ౮౪

ఉ॥ యౌవన మంకురించె నల యర్యకులీనున కందచందముల్
శ్రీ వినయంబును న్నయముఁ జెల్వల రారెడివాని కెన్నియో
తావులనుండి కన్నియలతండ్రులు పుత్త్రిక నిత్తు మంచు రాఁ
గా విని తల్లి పుత్రునకు జ్ఞానకలాసతి తెల్పెఁ దెల్పినన్. ౮౫

వ॥ తిరువంకాడరు తల్లి కిట్లనియె. ౮౬

మ॥ నరజన్మం బిది దుర్లభం బెఱుఁగవే? నా తల్లి! యీజన్మ మె
వ్వరికో గాని లభింప దట్లు లభియింపన్ గేహినీదాస్యముం
నెఱపం బోవుట మేలొ? సద్గురుకృపానిశ్రేణికాలంబియై
హరుకారుణ్యము గాన్ప మేలొ? నిను నే నర్థింతు వాకు ఖిచ్చఁగన్.

ఉ॥ జ్ఞానకలాభిధాన మది గాదు నిరర్థక మంబ! నీదు వి
జ్ఞానము నే నెఱుంగుదును జ్ఞానవతీమణివైన నీమనం
తానము నాట కేను దొలినాఁటను నోఁచిన నోము లెట్టివో?
యేను వచింపనేర్తునె? యదృష్టము పండియె నీకుఁ బుట్టితిన్. ౮౮

చ॥ తగిన గురూత్తముం డొదవెఁ దల్లి! తరించు నుపాయముండె నే
నిఁగ భవబంధ మొల్ల సుత నీఁ జనుదెంచెడివారి కిట్లు చె

ప్పఁగ నిను వేడెదన్ సతి యపత్యము లోనగు ముండ్లకంచెలోఁ
దగిలినవారిఁ గన్గొనమె? తత్సుఖదుఃఖము లేరెఱుంగరే? ౮౯

మ॥ ధనమున్నన్ సతి లేక తత్సుఖము సందర్భించినన్ సంతతిన్
గన కా భాగ్యము గల్గ నింక నొకఁడక్కామ్యంబు చేకూర నిం
కను నొక్కం డది గల్గ నొక్కఁ డదియున్ గల్గన్ మఱొక్కండు లే
దనుకో ల్దప్పదు తృప్తి యెక్కరణి లభ్యం బౌను సంసారికిన్. ౯౦

మ॥ సతిపైఁ బ్రేముడికన్న సంతతిపయిన్ సంసారికిన్ హెచ్చుగా
నతుకుం బ్రేముడి; భార్య చెట్టయగుచో నద్దాని వర్జింపఁగాఁ
బతి యత్నించునుగాని సంతతికడుం బాపావిలంబేనిఁ ద
త్కౌతుకంబుల్ నెఱవేర్చుచున్ మెలఁగు నగ్గోడెందుఁజూడంబడున్.

మ॥ కనులారన్ గనుచుంటి మట్టిఘనులన్ గాంతన్ విసర్జించి య
వ్వనితాగర్భము గన్న దుర్భగుల సర్వస్వమ్ము వెచ్చించి పెం
చునదారాశయులన్ గనుంగొనినచో సుస్పష్ట మీయంశ, మె
వ్వనికన్నన్ సుతుఁ డెక్కుడౌ జనకు నవ్వాఁ డెట్టుగాఁ జూచినన్.

ఉ॥ ఏ విషయమ్ము గన్గొనిన హేయమె సంసృతి; దీనియం దెటుల్
గోవిదు లుందురో! యనుచుఁ గొంకుదయించెడి దేవదేవునిన్
భావమునందు నిల్పి భవబంధవిముక్తి యెటుల్ ఘటించు నా
త్రోవ గడింపనేరనినరుల్ పరికింపఁగ దైవవంచితుల్. ౯౩

ఉ॥ ఎందఱో దీనితత్త్వము నిసీ! యని రోయుచుఁగూడ దీనియం
దుం దగులొంది లూతబలెఁ ద్రోవ యొకింతయుఁ జిక్క కేన్గు దా
బందను డిందికుందుగతిఁ బైగతికిం గొఱగారు తల్లి? న
న్నుం దుద కిందు దింపక యనుగ్రహబుద్ధిఁ గనంగ వేడెదన్. ౯౪

వ॥ ఇట్లు సోపపత్తికంబుగ ననేకప్రకారమ్ముల దీనదీనమ్ముగ వేడు
గారాపుఁగొమరునకు విజ్ఞానశీల నాఁదగు జ్ఞానకల యిట్లను. ౯౫

మ॥ నిను వంశంబు తరింపఁ జేతు వనుచు న్నీతండ్రి యీశాను నె
మ్మనమందున్ జపియించి తద్వరమునం బ్రాపించె నాయందు; నా
యన స్వర్గానకు నేగె నీ భరము నా కర్పించి; నీ వింతిఁ గై
కొనకున్నన్ బితరుల్ తరింతు రెటు పేర్కొ నేర్తువే పుత్త్రికా.

క॥ పితరులు ప్రతీక్షణమునిన్, బ్రతీక్షణము సేయుచున్న వారరయును యో
గ్యత గలుగునీవు వారి న, గతికులుగాఁ జేయనగునె? జ్ఞానివి గావే.

క॥ మును పల్లజరత్కారుం, డను ముని భార్యాపరిగ్రహణమునకున్ దా
ననుమతి సేయుట భారత, మునఁ జదువవె! పితృహితంబు పొనరుపవలదే?

వ॥ అదియునుం గాక, ౯౯

ఉ॥ జ్ఞానము పెండ్లిచేసికొనఁగాఁ దగదం చెపుడున్ వచింప దీ
శానునికన్న నెందయిన జ్ఞాను లటంచుఁ గలారె? పార్వతీ
జానికి దార యతం; డితరసంస్మృతిరక్తులతోఁ బనేమి య
జ్ఞానికిఁ గాని జ్ఞానులకు సంసృతి బంధము గాదు పుత్త్రికా. ౧౦౦

క॥ ఎందు మమత్వముగొన కర, విందమ్మునసీటిబొట్టువిధమున గృహులై
యుందురుజ్ఞానులనుచుఁ గద, విందుము నీవటు మెలంగి విజ్ఞుఁడవగుమిఁ.

క॥ సన్న్యాసియగుటయది సం, పన్నతకున్ గుఱుతుగాదుబహువిధములనా
పన్నులఁబ్రోచుచుగేస్తై, యున్న మనుజుబ్రదుకెబ్రదుకు యోజింపు మెదన్.

తే॥ గీ॥ తల్లిచుట్టును మూఁగెడి పిల్లలబలె
గేస్తునిలుచుట్టుఁ దఱచుమూఁగెదరు జనులు
పితరు లట్టుండ వారల వెతలు మాన్పఁ
దగిన నీకు సన్న్యాసంబు దగునె పుత్త్రి. ౧౦౩

క॥ ఏదో తప మొనరించిగ, దా? దేహి జనించు ధనికునవసథమున స
ర్వాదరణీయం బది యా, స్వాదించుట దోసమనెడి జ్ఞానులుగలరే!

క॥ 'ప్రారబ్ధంభోగత' యను, ధీరులనుడి బట్టి చూచితేనియు నీ కీ
వైరాగ్యమిపుడు చేకో,గా రాదని తేలుఁ దెలివిగనుము కుమారా!

తే॥ గీ॥ పెట్టిపుట్టిన సుకృతంబు పెరిఁగియున్న
దీవు సన్న్యాసివైనచో నెవఁడు దీని
ననుభవించెడిఁ దెల్పఁగదయ్య నాకుఁ
గర్తయొకఁడును భోక్త యింకమఱియొకఁడె. ౧౦౮

క॥ పాపమ్మొనరిచి దానిం, బాపికొను నుపాయ మనుభవముగా కితరం
బే పురుషుఁడేని నేర్చిన, సాపడక యె పుణ్యఫలము సమయుం దనయా!

చ॥ వలసిన యంత సంపద యపారము గాఁ గలదయ్య! నీకు; నీ
వలచిన యుగ్మలిం దగ వివాహవిధిం గొని సంతుఁ గాంచి పెం
డిలు లని పేరటమ్ము లని నిచ్చలు సత్క్రతులం బొనర్చుచుఁ
మెలఁగినచోఁ బరాత్పరుఁడు మెచ్చి యొసంగకయున్నె? సద్గతిన్.

తే॥ గీ॥ ఒక్క కన్యకఁ దగినట్టి యోగ్యునకు వి
వాహ మొనరించు గృహమేధి స్వకుల మెన్ని
తరములో తరింపఁ జేయు నందురు గదయ్య
పెద్దలు; గృహస్థపదవికి నుద్ది గలదె? ౧౦౯

తే॥ గీ॥ 'యదహరేవ' యనుచు వేద మాడుఁగాక
అందుఁ గల వెన్నియో ముప్పు లనుచుఁ గాదె?
వ్యాసుఁడు కుమారునకుఁ బెండ్లి చేసి విడుచు
నందనుక నిదర్శ నాఁ గలైనయ్య? తండ్రి! ౧౧౦

తే॥ గీ॥ పెఱటిచెట్టు మందుకు రాని తెఱఁ గెఱింగి
జనకరాజర్షి కడ కంపి నలుపఁ దగిన
యంతయును సల్పి యత్నమ్ము వ్యాసమౌని
కడకు సుతుఁ బెండ్లికొమరునిఁ గా నొనర్చె. ౧౧౧

క॥ జ్ఞానముల్ పెండ్లి కడ్డగు
చో నెందఱో మానియుండ్రి సూ? పెండిలి వి
జ్ఞానధనులు; నీజనకుని
జ్ఞాని యనెదొ? యే మనెదవొ? సత్యము చెప్పుమా? ౧౧౩

క॥ జ్ఞానులె పెండిలి యాడం,గా నర్హులు నే వచింపఁగా నేర్తు నిటుల్
మౌనివసిష్ఠుఁ డరుంధతి,తో నెటు కాపురముచేసి లోకముఁగనియెన్.

తే॥ గీ॥ జ్ఞాను లర్హులు పెండ్లి కజ్ఞాను లొక్క-
పెండిలికి మాత్రమే కాక యొండుపనికి
దేనికేని యనర్హులె దేబెపుట్టు
వమ్మ జవ్వన ముడుపుట కనరె బుధులు. ౧౧౪

చ॥ సకలము నున్నధన్యుఁడవు సాధ్వియు నీవును దేవదేవు భ
క్తికి నిలయమ్ములై కొలిచి కిల్బిషదూరులరై యకించన
ప్రికరము నన్నవస్త్రముల బాగుగ నోమి కులక్రమాభివృ
ద్ధికిఁ దగుసంతతిం గనుటె ధీరులు మెచ్చెడిత్రోవ పుత్రికా. ౧౧౫

వ॥ అని మఱియును. ౧౧౬

ఉ॥ ఏపదిమంది నాకుఁ గల రే యొకరుండొ విరాగియైనచో
నోపి యుపేక్ష సల్పుటకు; నొక్కఁడవేగద? తండ్రి? నీదువి
ద్యాపటిమంబు వన్నెగనునట్టులు సంసృతిలోఁ జరింపు మే
యాపద గల్గనీఁడు పరమాత్ముఁడు శంకరుఁ డండ నీ కగున్. ౧౧౭

శా॥ "స్త్రీసంబంధము హేయ మంచుఁ బురుషుల్; స్త్రీ లట్టులే పూరుష
వ్యాసక్తత్వము హేయ" మం చిటులు దుర్వాదమ్ములన్ జేయరా
దీసంసారము దైవసమ్మత; మొకం డేమన్న నేమౌ? రసా
భాసంపు న్నుడు లాడు ప్రాజ్ఞులు వృథా వాచాటకుల్ పుత్రికా.

ఉ. స్త్రీ(శ్రీ)యపవిత్రులా లనుచుఁ జెప్పెడిమాటలె పూరుషుల్ గడున్
హేయుఁగ వ్యాకరించుటకు నెంతయుఁ దోడ్పడుఁ బాంచభౌతికం
బే యగు సృష్టి సర్వమును, హేయమనన్ సకలమ్ము హేయమౌ
కాయము; కాదటన్న నటుగాక యగున్ గమనీయ మెమ్మెయిన్.

తే॥ గీ॥ నాయనా! "మెట్టవేదాంతు" లీయసహ్య
భావకల్పన చేసిరి భామలయెడ
నట్టివాక్యమ్ములనుబట్టి యార్యసమ్మ
తంబగు వివాహమును రోయఁ దగదు నీకు. ౧౨౦

మ॥ తమలోపమ్ము లొకళ్ళొకళ్ళపయి నింద్యమ్మౌనటుల్ పొల్పి యు
త్తమమౌ నాశ్రమమున్ వృథా దెగడు నాధార్ష్ట్యమ్ము సైరింప ర
క్రమమౌటన్ ఋతవాదు; లాశ్రమములం బ్రాజ్యమ్ము గార్హస్థ్యధ
ర్మము, సంపన్నుల కిద్ది తారక మగుం బ్రాజ్ఞత్వమే యుండినన్.

మ॥ తనకుం బొట్టకు లేని రిక్తుఁడు గృహస్థత్వమ్ము గైకొన్నకం
టెను జందెం బొకఁ డుండు నాశ్రమమునందే యుంట శ్రేయమ్ము;స
జ్జనసాంగత్య మపారసంపద మొదల్ సామగ్రి యున్నట్టి య
య్యనఘుం డెవ్వఁడు సంసృతిన్ విడిచి స్వర్గావాసి గాఁగోరెడిన్.

ఉ॥ లెక్కకుఁ గొందఱే కల రళీకము గా దిది బ్రహ్మచారు; లే
లెక్కల బట్టి చూచిన; నిలింపఋషీంద్రులుఁగూడ సంసృతిన్
మక్కువఁ జూపినట్లులె కనంబడు నెక్కడొ కాదు వేదపుం
బుక్కులయంద తేలెడిఁ బరీక్షుగఁ జూచితిమేని యిక్కతల్. ౧౨౩

ఉ॥ ఇచ్చుటకున్ ధనంబు గల దెచ్చుగ నర్థుల కాప్తకోటికిన్;
సచ్చరితమ్ముతో బ్రదుకఁ జాలిన జ్ఞానము దేవుఁ డిచ్చె వి
ద్వచ్చయ మెప్పుడున్ భవదుదారతకై యిలు వేచి యుండు నీ
ముచ్చట లున్న సంసృతియు ముక్తుల నొండొక ముక్తి పుత్రకా.

శా॥ నీ సంసారపుసారు నచ్చి మదిలో నీభక్తికి న్మెచ్చి కై
లాసం బేమఱి యాదిభిక్షుకుఁడు నీలగ్రీవుఁడే వచ్చి గౌ
రీ సాధ్వీమణితోడఁ బుత్రికులతోఁ బ్రీతిన్ భవద్గేహమున్
వాసార్హం బని నిల్వకున్నె? దయతో; వర్జింతు వేలా సిరుల్. ౧౨౫

వ॥ ఇట్లు సారెసారె బోధించుతల్లికిఁ గొమరుం డిట్లనియె. ౧౨౬

చ॥ పరమసుసాధ్వి నీనొడువు పల్కులు గాదనువార లుండెరి? సం
సరణమునందుఁ గల్గు గుణసంతతి నేకరు వెట్టితీవు దే
వరకృప సర్వమున్ సరిగ వర్తిలుచో భవదుక్తరీతి సం
సరణ మిహాప్రపంచకపు స్వర్గమ సందియ ముండ దంబికా. ౧౨౭

ఉ॥ జ్ఞానికి సంసృతిం గల విచారము లెక్కడు; సంతు గల్గుచో
సూనులు విద్య నేరువక శుంఠలుగాఁ జరియించిరేని య
ద్దానికిఁ దండ్రి పొందు పరితాప మపారము; దానిఁ బాయఁగా
మానులె నేర రన్న నిఁక మాదృశులన్ గణియింప నేటికిన్. ౧౨౮

ఉ॥ బుద్ధునియంత యోగ్యుఁడు ప్రబుద్ధుఁడు వేఱొకఁ డున్నె? సర్వసం
సిద్ధము రాజ్యమున్ విడిచి చేరఁగ లేదె? యరణ్య; మిం దసం
బద్ధము లున్న వంచెఱిఁగి భార్యను గర్భవతిన్ త్యజించి, ని
ర్బద్ధులు గారు జ్ఞాను లెటువంటిసిరుల్ దోలఁకాడ నేమగున్. ౧౨౯

మ॥ అతఁ డేమంచు వచించె? సంసృతిని లే దావంతయున్ మంచి; యే
కుతుకంబో? యెపుడో? యొకానొకఁడు గన్గో సిద్ధ మయ్యుం దటి
ల్లతభాతి న్విటపస్థపక్షిగతిఁ జాలన్ సేపు నిల్వంగఁ బో
కతిచింతన్ గలిగించు నెమ్మది కటం చాతండె? వర్జింపఁడే? ౧౩౦

వ॥ ఇంచుం గల మంచి కడుంగడు నల్పమ్మగును జెడ్డ మిక్కిలి యధి
కమ్మగును నని మఱియును. ౧౩౧

క॥ నను సంసారాంబుధిలోఁ
జొనుపకు మిట్లుండనిమ్ము సుఖముగ నెట్లో
జనిసార్థక్యమ్మునకు జ
తనముం బొనరింతుఁ గాంతుఁ దత్త్వ మ్మనుడున్. ౧౩౨

క॥ జ్ఞానకల యిట్టులనుఁదన, సూనునకోతనయ! గురునిఁజూచియయినఁగృ
ష్ణానందుని; సంసారివి,గా నూరీకృతిని జూపఁగాఁ దగుఁ గాదే?

ఉ॥ ఆ యనఘుండు నీకు గురుఁడౌఁగద! ఆయన సెప్పు చొప్పునన్
జేయుము నీకు నెల్లపుడు శ్రేయముగల్గుటకే యతించు నా
ధీయుతుఁ, డమ్మహామహుఁడు దీనికి సమ్మతి జూపఁడేని నీ
యాయువు బ్రహ్మచర్యమున కర్పణసేతువుగాక వీఁకమై. ౧౩౪

వ॥ ఇట్లు బోధించి యొప్పించి తనసోదరు నయ్యనఘునికడ కంపి రప్పించి
యమ్మహాభాగ యమ్మహనీయునితో సకలమ్మునకు దేవరయే
ప్రమాణం బని మిన్నకుండె. ౧౩౫

క॥ పదపడి కృష్ణానందుం, డుదయద్విజ్ఞాను శిష్యు నూర్జితసత్త్వా
స్పదుఁగని సంతసమందుచు, సదసత్పరిశీలకుఁడు ప్రసంగించె నిటుల్.

సీ॥ వేదవ్రతముల నాపాదించి చరియించు
బ్రహ్మచారులకెల్లఁ బట్టుగొమ్మ
అతిథులై యేతెంచు నట్టిగృహస్థుల
నాదరింపంగఁ గల్పాగమంబు
భార్యైకయుక్తులై వనమునఁ దిరుగు వా
నప్రస్థులకు రక్షణప్రసక్తి
సంసారహింసా రిరంసావిరక్తులౌ
సన్న్యాసులకును విశ్రాంతిభూమి

తే॥ గీ॥ యైన గార్హస్థ్యమున నుండి యఖిలధర్మ
ముల నొనర్చి తుదకు ముక్తిఁ బొందవచ్చు
నట్లుగా దేని యవ్వశిష్ఠాదిమునుల
కేలగార్హస్థ్యమున నుండు టెఱుఁగఁ జెపుమ? ౧౩౭

తే॥ గీ॥ న్యాయ్యముగ ధనసంపాదనం బొనర్చి
యన్నృత మాడమి యశుచిత్వ మాచరింప
మియును విధిచోదితంబుగా మెలఁగుటయును
గలిగి వర్తించు గృహి ముక్తిఁ గనుఁ గుమార! ౧౩౮

క॥ మన మతి నిర్మల మైనం
దనకు గృహం బెట్లు బంధనం బగు మనముఁ
దనయిచ్చఁ బోవనీయక
యునికి గృహస్థునకు ముక్తి నొనఁగూర్చుఁ జుమీ! ౧౩౯

తే॥ గీ॥ ఆగమోక్తకర్మమ్ముల నాచరింపఁ
దలఁచి వర్తించు గృహి కెల్ల ధర్మములును
గరతలామలకమ్ములు గాన లాతి
యాశ్రమమ్ములు సరియె గార్హస్థ్యమునకు. ౧౪౦

తే॥ గీ॥ ఇంద్రియమ్ము లజేయమ్ము లెంత పెద్ద
పండితులకైనఁ గాని లోఁబడక యుండు
నాటి తేజనివారల కడుగవలెనె?
ప్రతిపదమ్మును మది వికారమ్ము గ్రమ్ము. ౧౪౧

తే॥ గీ॥ కానఁ గ్రమముగ సర్వభోగములు ననుభ
వించి త్యజియించి గ్రహియించి మించవలయుఁ
గాని యుద్వేత్తుగా వీడఁగాఁ దరంబె?
ఊర్ధ్వసుప్తుండు పతనంబు నొందకున్నె. ౧౪౨

తే॥ గీ॥ వడివడిగఁ బోవు పత్తులవడువు గనక
మందగతి నంది యరుగు చీమలవడువున
గ్రమముగా నుత్తమపదంబు గాంచవచ్చుఁ
గాని తత్తఱపాటు సుఖప్రదంబె ? ౧౪౩

తే॥ గీ॥ మన మజేయంబు దానిఁ గ్రమక్రమముగ
యుక్తమార్గమ్ములకుఁ జొన్పి యదుపవలయు
ననుభూతేంద్రియసుఖాత్ములైనవారి
కింద్రియమ్ములు శత్రులై యెదురు కొనవె ? ౧౪౪

క॥ విద్యకఁ దెలియుట కొఱకు న,విద్యాకార్యముల ననుభవింపన్వలెనూ
ర్వద్యుతి బడలని వానికి, హృద్యంబై చెట్టునీడ యెసకం బిడునే ?

క॥ సారవిహీనం బని సం,సారపుఁ బరమార్థ మెఱిఁగి సతిఁ జేకొనఁగా
నూరీకరించి రనఘు లు,దారు లది హృషీకజయ మొదవఁజేయుటచే.

తే॥ గీ॥ ఎంతటి విరాగులకునేని యెల్లకాల
మొక్కరీతి మనోవృత్తు లుండఁబోవు
కాన నింద్రియ జయమునకై నెలంత
బొత్తు విజ్ఞాను లొప్పిరి పున్నె మనుచు. ౧౪౭

వ॥ ఇందనుక విని తిరువంకాడరు గురున కిట్లనియె. ౧౪౮

ఉ॥ ఇందుఁ గలట్టి పుణ్య మది యెట్టిది? యింతికి లోఁగి యింద్రియా
నందము నొందు పూన్కి యది నైజము ప్రాణుల కెల్ల; జ్ఞాని దీ
నం దగులొందెనేని సుమనస్కులు వాని గణింతురే? చిదా
నందిగఁ; జంచల మ్మిది సనాతను లెల్ల బహిష్కరింపరే ? ౧౪౯

తే॥ గీ॥ అల పరాశరుఁ డాదియౌ నలఘు లెపుడొ
తప్పుపని కగ్గమయ్యు నంతటనె తెలివి

దెచ్చుకొని యనుతప్తులై దేవదేవు
సమ్మతికిఁ బాత్రులైరని జగ మెఱుఁగదె? ౧౫౦

మ॥ అది న్యాయ్యంబగు పెండ్లియే యయినచో నా యింతి సంబంధ మ
న్నది ప్రాణాంతము దాఁక వీడదుగదా? "నాబొంది నాయిల్లు నా
మదిరాక్షీమణి నాదుసం" తనుచు సామాన్యుండునుం బోలెఁ గో
విదుఁడున్ సంసృతిపంకమగ్నుఁడగుటే విధ్యుక్తధర్మ మ్మగున్.

ఉ॥ "రాదు ప్రమాద" మంచును దిరం బగు నెమ్మదితోఁ బరాత్పరున్
స్వాదుచరిత్రుఁ బేర్కొనుచు సంసృతికిం గడు దూరవర్తియై
నాదుచరిత్ర నిల్పు మని నాథుని శంకరు వేడికొన్నచో
శ్రీదసఖుండు భక్తుని వశిం బొనరింప నుపేక్ష సేయునే! ౧౫౨

ఉ॥ కాదని యాగ్రహించి గఱకంఠుఁడు భక్తుఁ గళంకిఁ జేయుచో
నాదురితమ్మ సర్వ మతఁ డందెడి భక్తున కట్టి జోలి రాఁ
బోదు మనఃప్రచోదకుఁడు భూతిధరుండు హరుండె, జోలినా
కేదియు లేదు పెండ్లియెడ నిచ్ఛజనింపదు నాకు లేశమున్. ౧౫౩

మ॥ ఎపుడో వర్షము పట్టి మొత్తు నని యిప్డే ఛత్రమొక్కండు నె
త్తిపయిం బెట్టుక కూరుచుండవలెనే! దేవాదిదేవుండు తా
నపు డేపంచయొ చూపకుండునె? శివుం డన్నింటికిం గర్త; గోఁ
చిపటం బెల్ల దళించునేమొ? యనుచుం జీలిం గొనంబోలునే? ౧౫౪

ఉ॥ చీలిని సేకరించి యది సేసెడి యల్లరి సైఁచి దానికిం
బాలిడునావు మేఁతకు సమంజసమా నొకబీడు మేప గో
పాలుఁ డొకండు గావలయు భద్రముగాఁ దన గోఁచి డాఁచికో
జాలినఁ జాలుఁగా వృథగ సంసృతి యింత భరించు టేటికో. ౧౫౫

వ॥ నావుడు గురుం డతని తెలిసీ తెలియని ప్రసంగమునకు నొక్కింత
కన లుదయించినను దానిం బ్రకటింపక యతని మనోనిశ్చయమ్మునకు

సంతసించి వివాహావశ్యకతం గూర్చి బోధించి యెట్టకేల కంగీకరింపఁ
జేసి తన యాశ్రమమ్మునకుఁ జనియె ననంతరంబ తల్లియును బంధు
గులును శివకల యను కన్నియను బెండ్లి యొనర్చిరి. ౧౫౬

తే॥ గీ॥ కతిపయదినమ్ము లేగుపైఁ గాపురమున
కవ్వధూమణి వచ్చె నప్పతివతోడ
నేగె శివనేశసుతుఁడు శ్రీకృష్ణగురునిఁ
గాంచు వేడుక మనమునఁ గళవళింప. ౧౫౭

వ॥ కృష్ణానందుండును వారల నుచితరీతి నాదరించి యాశీర్వదించి
యవ్వధూవరుల కిట్టు లుపదేశించె. ౧౫౮

ఉ॥ నాలుగునాశ్రమమ్ములకు నాయకరత్నము గేస్తునాశ్రమం
బీలలితాంగి నీకుఁ దగు నీ పెకు నీవును దగ్గవాఁడ వీ
బాలిక నీకుఁ దోడ్పడ సెబాసని లోకులుమెచ్చ మేటివై
శూలిని విస్మరింపక త్రిశుద్ధుఁడవై చరియింపు మెప్పుగన్. ౧౫౯

చ॥ ధనమునకున్ విభూషణము దానము దానికి భూషణంబు బల్
వినయము దానికి న్నగ వివేకము సర్వవిభూష శాంతి స
జ్జనసహవాస మిన్నిటికి సాధన మింతయు నీ వెఱుంగు దై
నను వచియింతు నీ కిటు పునఃపునరాదరమేమరంబుగన్. ౧౬౦

వ॥ అని యా శ్రీమతిం బ్రత్యేకించి. ౧౬౧

ఉ॥ మామ గతించె నత్తయె సమస్తము నీ; కనుకూలవర్తనన్
గోమలి యాపె మెచ్చుగతిఁ గోడలికం బొనరింపుమమ్మ? నీ
కేమియు లేదు లోపము; మనీషిహితం బగువర్తన మ్మొకం
డేమఱకున్న చో సుయశ మేర్పడు నయ్యది యిచ్చు సర్వమున్.

మ॥ శివపూజానిరతుండు నీదుపతి; వాసిన్ దోడుగ న్మీవు స
ర్వవిధాలన్ భవదీయనామ మది సార్థక్యమ్ముఁ గైకోఁగ; నీ

ధవుఁ డెంతే గుణగణ్యుఁ డట్లవుట మీ దాంపత్య మాదర్శమై
చవిగొల్పున్ బెఱిహారి; కన్నిటికి నీ సౌశీల్యమే హేతువౌ. ౧౬౩

చ॥ మగఁడు గుణాఢ్యుఁడయ్యు దగుమానిని వానికి భార్య గానిచో
నెగడవు కీర్తిసంపదలు; నీవు సుశీలవు నీ కతాన నీ
మగనిగొనంబు లెల్లెడల మంచిపరీమళ మిచ్చుఁగాక నిన్
మగువలు మెచ్చికో మెలఁగి మంతువుగా శుభయాన్వయమ్ములున్.

ఉ॥ సంపద గల్గుచోట గుణసౌరభ మంతగ నుండ దట్టిబల్
సంపదకన్న రిక్తతయె చాల యశస్కర; మెన్ని యెన్ని నేల్
కెంపులు వజ్రముల్ మెఱయు కృత్రిమభూషలు మేనఁ దాల్చినన్
సొంపుదయింప దంగనకు; శుద్ధచరిత్రమె భూషణంబగున్. ౧౬౫

చ॥ వనితకు భర్తకన్న భగవంతుఁడు వేఱుగ లేఁడు వానియం
దునఁ గడు భక్తితో మెలఁగు తొయ్యలి కీ యిహముం బరమ్ము హ
స్తనిహితమైన రేఁగుగతిఁ దా వశమై యశ మిచ్చు దీనిఁ గా
దని మఱి యన్యథా మెలఁగు నంగన లంగడిలోని వస్తువుల్. ౧౬౬

క॥ మగఁడు సుదుర్వృత్తుండని,మగనాలటు గాఁదగదు ప్రమాణజ్ఞులు బా
గుగఁ బరిశీలించిరియది, నగుఁబాటని రదియ మదికి నచ్చు సతులకున్.

క॥ అసతులు వేయుదు రెన్నియొ
విషమంపుం బ్రశ్నములు వివేకిను లవ్వా
ని సహింపరు పాతివ్ర
త్యసమం బగు వ్రతము నాఽస్తి నాఽస్తి యువతికిన్. ౧౬౮

వ॥ అట్టి పాతివ్రత్యము గల వనితామతల్లులకుఁ గల గౌరవమ్ములో
నెన్నవవంతును విషమప్రశ్నమ్ములు వేయు యువతులకు రానేరదని
వెండియు. ౧౬౯

ఉ॥ అన్ని గొనమ్ములుం గలిగినట్టి నినుఁ గుఱియించి చెప్పఁటే
లన్న? సిదొక్కయాచరణ మంతియకాని మఱొండు గాదు సం
పన్నలినాక్షి కోడలిని బట్టి గృహస్థులయిండ్ల నుండుఁ బో
వు న్నిరసించి; నీ కతనఁ బుట్టిన మెట్టిన యిండ్లు వర్ధిలుఁ. ౧౭౦

క॥ "శివకల" యను నీ నామము, పవిత్రము శుభప్రదంబు పాతివ్రత్య
ప్రవణము తిరువంకాడరు, భవనము నీకతనఁ బరమపావన మయ్యెన్.

వ॥ ఇట్టు లావధూవరుల నగ్గించి యాశీర్వదించి సత్కరించి యనుపు
టయు వారును నయ్యనఘాత్ముని బోధలు నెమ్మది నిడికొని స్వగృ
హమ్మునకుఁ జనిరి పిమ్మట. ౧౭౨

ఉ॥ ఎల్లపుడుఁ మహేశునెడ నించుక విస్మృతి లేక భక్తిమై
నుల్లమునందు నిల్పి సతియుఁ మఱిఁ దాను నుపాస్తి సేయు న
ప్పల్లవపాణికిం గలదు భక్తి యపారము భర్తభక్తియుం
గొల్లకుఁ గొల్ల యిట్టి యనుకూలత యెక్కడనో ఘటించెడిన్. ౧౭౩

ఆ॥ పాత్రులకును నొసంగుఁ బరమార్తులకు నిచ్చు
నా ప్రజనుల కిడు సమస్తవేళ
లందు నింట సాఁగు నన్నదానము శివ
నేశుఁ గొమరుఁ డెంత కృతసుకృతుఁడొ?. ౧౭౪

ఉ॥ పాశుపతవ్రతస్థుల కపారముగా ధనముఁ వ్యయించు నే
దేశమునన్ శివాలయము దీనదశం గనెనేని ద్రవ్యముఁ
రాశికి రాశిగా ననిపి రాణఁ దలిర్పఁగఁ జేయు నెట్టి యే
బ్రాశియు నేని బూతి రుదురాకలు దాల్చిన మ్రొక్కు వానికిన్

సీ॥ శివపురాణము లన్నఁ జెవిఁ గోసికొను సదా
శివునామ మన్న వాంఛించు నెపుడు
శివునాలయమున వసింపఁగా వాంఛించు
శివు నుత్సవములు వీక్షింప నెంచు

శివుఁగూర్చి కవనంబు చెప్పువారల మన్చు
శివదూషకులఁ గాంచు "భవు" లటంచు
శివరాత్రికై ప్రతీక్షించు "నెప్పొ"డని
శివునిపైఁ గీర్తనల్ సెప్పఁదలఁచు
తే॥ గీ॥ ఆత్మ నెపుడు శివోఽహం శివోఽహ మనుచు
మనన సేయు జగమ్ము "తన్మయ" మటంచు
నిశ్చయించు వితర్కించు నిగమవాక్య
ములు సమన్వయ మొనరించు ముదముఁ గాంచు. ౧౭౬

చ॥ శివపరమైన శబ్దములు సెప్పఁగదా? తగ వాచ్యవృత్తిచే
శివుని; శివేతరార్థము వచించెడి వేదముగూడ నెట్టులో
శివునికె యన్వయించుటకుఁ జిత్తము నించుఁ దదేకభక్తి నా
శివకలభర్త; వేద మొకుఁ జెప్పునె యన్న సదూహచొప్పునన్.

ఆ॥ వె॥ అప్పదీక్షితార్యుఁ డతియత్నమూని నా
రాయణాఖ్య శివపరమ్ముఁ జేయఁ
దలఁచి ణత్వబాధ దలపోసి మానుట
వినియు నతఁడు యత్నమును బొనర్చు. ౧౭౮

క॥ కప్ప మొదలైన జంతుల్, జెప్పెడిచో ణత్వబాధ చేకుఱక శివున్
జెప్పెడిచో నెటుచొప్పడుఁ, జెప్పఁడనుచుఁ బృచ్ఛ సేయు శిష్టాగ్రణులన్.

క॥ శివుఁడన్నన్ మఱియున్ విష్ణువటన్నన్ భేదలవము చొప్పడదను వా
రివచనములు విననొల్లఁడు, శివ నేశుసుతుండు పరుఁడు శివుఁడను నెపుడున్

తే॥ గీ॥ శివుని యుత్కృష్టతనుగూర్చి చెప్పు భార
తంపుభాగమ్ములను జూచుఁ దలఁచు కృష్ణు
నెంచు శివభక్తునిగ శివనేశుకొమరుఁ
డన్వయించు సమస్తమ్ము నభవునంద. ౧౮౧

తే॥ గీ॥ సంజ వార్చెడియపుడు కేశవ మొదలగు
నామములకు మాఱుగ శివనామములను
జెప్పికొనుఁ గాని విష్ణు ద్వేషింపఁ డొరులు
దూషణ మొనర్ప వినఁ డది దోష మనుచు. ౧౮౨

క॥ కొందఱు శివభక్తులు హరి,నిందింతురు వైష్ణవులును నిందింత్రు శివుర్
సందర్భం బెఱుఁగని యా,నిందకులర్ జేరఁడు శివనేశుఁ డెపుడుర్.

క॥ హరి యగునా ? పరతత్త్వము
హరుఁ డగునా ? యన్న హరుఁడె యగు నను నంతే
యొరు దూషింపం డెన్నఁడుఁ
దిరువంకాడరు శివుండె దేవుఁ డతనికిర్. ౧౮౪

తే॥ గీ॥ ఇట్లు శివపారతంత్ర్యము నెంత వెల్ల
డించినను విష్ణునెడల ద్వేషించఁ డక్క-
తమున వైష్ణవులకు నిచ్చుఁ దక్కొ-రులకు
నిచ్చు శైవుల కిచ్చుచో హెచ్చు సీవి. ౧౮౫

శా॥ ఆయ మ్మెంత వ్యయమ్మదెంత యని యే వ్యాపార మే రీతిగాఁ
జేయంగావలెనో? యటంచనియు నాశ్రీమంతుఁ డేమాత్రిముర్
జేయంబోఁడు విచార; మా ఫ్తులకె తాఁ జేఁగొట్టి యర్పించె న
న్యాయం బొ ఖలులూని సొమ్ము "గుటకాయస్వాహ" గావింప రే.

మ॥ చిననాఁడే తనతండ్రి స్వర్గతికి విచ్చేసెంగదా? అక్క-తం
బున శ్రీ సర్వము మేనమామవశమై పోఁదగ్గ దే యయ్యు య
త్నుని కున్నన్ని నిధుల్ గలాఁడగుటచేఁ గొం తేగినర్ గొంతయే
నిని నిల్చెర్ శివనేశుపుత్త్రినకు వాణిజ్యంబు సాఁగింపఁగర్. ౧౮౭

సీ॥ తనతల్లి యొనరించు ధనమెంతొ వెచ్చించి
ధర్మకార్యములు సత్త్రములు గుడులు
తనభార్య శివకలా తరలాక్షి యొనరించు
దానమ్ములకు నియత్త గనుపడదు

తనదు బంధులు గొంత దిని గొంతదాఁచికొనె
ధనము లెక్కింప నెవ్వనికిఁ దరము
తా శివార్పణముగా దేశదేశాగత
ద్విజుల కిచ్చుచునుండు దినదినంబు
తే॥ గీ॥ ఇట్లు వ్యయమగుపట్టున నెన్ని నిధులు
నిల్వయుండిన నెన్నాళ్ళు నిల్వనేర్చుఁ
గూరుచుండి తినెడిచోట గుళ్ళు గోపు
రములు నాఁటవటంచు లోకము వచించు. ౧౮౮

చ॥ శివుని సదా మదిం దలఁచు శ్రీనిధి యాశివనేశపుత్రుఁ; డ
న్నవనిధు లున్న యక్షకులనాథునియంశము గావునన్ మఱె
న్నివిధములన్ వ్యయించినను నీ రది యంధువునందుఁ బోలె నూ
రి వెనుకటట్లె సర్వము నిరీతిగ సాఁగుచునుండెఁ గర్జముల్. ౧౮౯

క॥ ఇతఁ డెంతయు సద్వ్యయమున్
మతిమంతుఁ డొనర్చు మేనమామలుఁ గొమరుల్
పతితులయి దుర్వ్యయమ్మును
మితి లేకొనరింతురి మేరమీఱి యథేచ్ఛన్. ౧౯౦

ఉ॥ త్రాఁగుట రోవెలందులకు దక్షిణ లెచ్చుగ నిచ్చి సారె నూ
రేఁగుట వాండ్రు కన్నెఱిక మిచ్చుటఁ జేసి; యయోగ్యవున్నడల్
వాఁగుట సాధులౌ జనుల వంచన సేయుట లోనుగాఁ గడున్
రేఁగి యొనర్పసాఁగిరి పొరింబొరి దుష్కృతు లాదురుద్యముల్.

మ॥ తిరువంకాడరు శీలవంతుఁడయి సద్వృత్తిన్ బ్రవర్తించుచున్
గరువంబుం గొనఁ డేరిఁ జూచిన నమస్కారమ్ము గావించు ధి
క్కరణం బన్నది యెట్టిదో? యెఱుఁగఁ డొఁగా కాప్తవర్గంపు ము
ష్కరతల్ దుర్యశమున్ ఘటింపనని వక్కాణింపఁగా శక్యమే. ౧౯౨

చ॥ ధన మది యెంత వోయిన నుదారుఁ డతండు గణింపకుండుఁగా
కనయము దానికల్మి ననయమ్ము లొనర్చెడి దుండగీండ్రివ
ర్తన మిహలోకముఁ మఱిఁ బరంబును దూర మొనర్పకున్నె? ఆ
ధన మది యేనిదో? అతఁడె దండ్యుఁడగుఁ సుకృతాత్ముఁడేనియుఁ.

క॥ కావున నెవ్వరుగానీ
కావలులఁ బందుగు లను కారణమున దు
ర్భావులఁ జేర్చుట ముప్పగు
నే వృజినము సేయకయును వృజినము లెనయున్- ౧౯౪

క॥ శివనేశసుతుఁడు మాతులు
భవనేశుఁ జేసె నతఁ డపాత్రుఁడు సర్వ
వ్యవహారమ్ములుఁ జెఱిచెడి
నవ మపయశ మంటఁగట్టు నానాఁటి కహో! ౧౯౫

చ॥ ఎలమి గణించెఁ దండ్రి శివనేశుఁడు న్యాయపథాన ద్రవ్య; మా
యలఘుఁడు దుర్వ్యయం బెఱుఁగఁడంచితముల్ పొనరించెఁగార్యముల్
ఖలులనుజేర్చి కొడుకు జనకస్వము సర్వము వమ్మొనర్చు మా
తులుఁ డఖిల మ్మడంచు ననుదుర్గద పెద్ద లదెట్లు తప్పెడిఁ. ౧౯౬

క॥కొమరుఁడుపసివాఁడనియాయమతోఁబుట్టువునకిచ్చెవ్యవహృతినతఁడున్
గ్రమముడిగి'సర్వనాశాయమాతుల'యటన్న నుడికు దాహృతియయ్యెన్. ౧౯౭

వ॥ ఇట్లు పలువురు పలువిధమ్ములఁ జెప్పికొనసాఁగిరి. తిరువంకాడరు
తన శివార్చనయే సర్వమ్మునుగాఁ గాలమ్ము నడపుచుండె. నిట్లు
కొండొక కాల మ్మతిక్రమించుటయు. ౧౯౮

సీ॥ ఒకసానికూఁతున కున్నతంబగు మేడ
గట్టించె వేనవేల్ ఖర్చుపెట్టి
వేఱొక్క వెలయాలి గారాపుఁగొమిరె ని
ల్వెల్ల రత్నములు రాజిల్లఁజేసె

నిఁకనొక్క సానికూఁతుకటాక్ష మార్జించె
మితిలేని ధనము నంపించి సారె
మఱియొక్క సానికూఁతురు చేరనీకున్న
నురక బంగరు నంపుచుండు నెపుడు

తే॥ గీ॥ కలిగె నేకారమునకు నైకారమునకుఁ
జాలు బాంధవ్యమంచుఁ జుట్టాలు తఱచు
హేళన మొనర్ప విని శివనేశుబావ
మఱఁది లెక్కింపకే యొడల్ మఱచి తిరుగు. ౧౯౯

క॥ తిరువంకాడరుమాతులు, గరువము వైభవముఁ దెలుపఁగా రా దతఁడ
త్తరుదీపంబులు వేశ్యాతరుణుల కేళీగృహములఁ దవిలిచి మెలఁగున్.

మ॥ తిరువంకాడరు దేవతాగృహములన్ దీపాల్ సదా గోఘృత
స్ఫురితమ్ముల్ వెలిఁగించి పుణ్యముగొనన్ శోచ్యస్థితిన్ మామ య
త్తరుదీపంబుల సానిమేడల నఘోదర్కంబుగా నించి దు
ర్నరకంబుల్ గడియించు నొక్కొకరి విజ్ఞానంబు లిట్లుండెడిన్.

తే॥ గీ॥ తేరగా నబ్బుధన మను కారణంబొ?
కాక మఱియేమొ? యవ్వానికరము సాఁగు
దుర్వ్యయముపట్లు; నది కడుదుఃఖకార
ణంబగుచు జ్ఞానకలకు మనంబు చెడియె. ౨౦౨

వ॥ అట్లు చెడియును సోదరుం డను నభిమానమ్ము గోసికో నేరక కొం
డొకకాలమ్ము మిన్నకుండి యొక్కనాఁడు. ౨౦౩

క॥ జ్ఞానకల సోదరుని య
జ్ఞానమ్మును మందలింపఁగాఁ దొడఁగిన న
మ్మానినిని లక్ష్యపెట్టఁ డ
మానుషచర్యందు దివ్యమత్తతకల్మిన్. ౨౦౪

ఉ॥ సోదరువర్తనంబు గడు శోచ్యముగాఁ బరిణామ మొంది లో
కాద్భుతిదూరమౌ కతన నాప్తుల కెంతయుఁ బ్రాణగొడ్డమై
ఆదశ సైఁపరామిఁ దనయాత్మజుతో నొకనాఁడు తల్లి యీ
మాదిరి నిర్వచించెఁ దనమానసమందలి గోడు సర్వముల్. ౨౦౪

మ॥ తనయా! నీ జనకుండు స్వర్గపురికిం దా నేగె నీచిన్ననాఁ;
డనుఁగుల్ సోదరుఁ డంచు సర్వమును నే నవ్వానిపైఁ బెట్టితి
న్నను లక్షింపఁ డతండు తాఁ దినుటకు న్నాకిష్టమే హేయముల్
బొనరింపం దొరఁగొన్నవాఁ డపయశమ్ము న్నీకుఁ జేకూర్చుచున్.

ఉ॥ వాఁ డొనరించు దుష్కృతులు వాకొన శక్యము గాదు ద్రవ్యముల్
బాడొనరించుటా? కొలము పాపమునం బడఁ ద్రోయుటా? సదా
తేఁదులకున్ భయంపడెడిరీతికి నగ్గము గావుటా? కడున్
గో డుదయించుచున్నయది కోమటివంగడ మంగలార్చెడిన్. ౨౦౭

చ॥ జనకునియస్థికల్ గొని వెసన్ జని కాశికి "గంగఁ గల్పి వ
త్తు"ననుచు నాకుఁ జెప్పి వెలతొయ్యలులన్ వెనువెంటఁ గొంచుఁ బో
యినకత లెల్ల నా పిదప నే విని దుఃఖము పట్టరామి నె
మ్మనమునయంద మ్రగ్గితిని మాటికి మాటికి; నేమి సేయుదున్.

క॥ నాతండ్రి నెఱుఁగు దేకద? నీతండ్రికి దీటు వచ్చు నిష్ఠన్ దాద్భు
తఖ్యాతచరిత్రునికడుపున, నీతండు జనించెఁ దండ్రి? యేమనుకొందున్.

క॥ నాతోఁబుట్టువుపై నా, చేతం బెంతేని విఱిగి చెప్పెదఁ బాగరుం
బోతయివీఁడొనరించెడి, చేతలు నీపేరుఁగూడఁ జెఱుచున్ దుదకున్.

క॥ నీ తండ్రిమొగముఁ జూచియుఁ,
బూతచరిత్రుఁడవు నీదు మొగముల్ గనియు
న్నాతోఁబుట్టువు నీపురిఁ
జాతుర్వర్ణ్యంబు సైఁచె సైఁప దిటుపయిన్. ౨౧౧

తే॥ గీ॥ జనకు కన్న నేడాకులు చదివి రెచ్చు
గాఁ గొడుకు లీ పురమునందుఁ గావలమున
వీండ్రి మించినవాం డెవ్వింత వెదకినను గ
నం బడ రటంచు: జెప్పికొనంగ విందు. ౨౧౨

చ॥ గత మెటులైనఁ బ్రాజ్ఞుఁడవు గావున "మాతులుఁ" డంచు నాదు బం
ధుత మది నెంచి "యెందు"కని దుర్జనకృత్యము సైఁచెదేని యి
వ్వతితులకారణమ్మున నపప్రథ నీకు ఘటిల్లుఁ గానఁ జె
ప్పితి నిఁక వీనిపై నెదియుఁ బెట్టక వ్యాపృతిఁ జూచుకోఁ దగున్.

క॥ తిన్నది "తిన్నా" రనుకొ
మ్మున్నదియే నీకుఁ జాలు నూరక యిఁక వీం
డ్రిన్నమ్మెదేని తప్పక
"సున్నకు సున్న" యను సూక్తి చొప్పడకున్నే? ౨౧౪

తే॥ గీ॥ "సున్నకున్ సున్న హళ్లికి నెన్నహళ్లి"
యగు పిదప నేమి సేసెదవయ్య! నీవు
పేరు గల పెద్దషాహుకార్బిడ్డ వయ్యు
నీ పనిని నీవు చూచుకో నేరవొక్కొ. ౨౧౫

చ॥ పసితన మేగె బిడ్డలును బాపలుఁ గల్గెడి యీడువచ్చె ను
న్నసిరికి వన్నెఁ దేఁదగు ఘనమ్మగు తెల్వియుఁ దేట యుండియున్
దెస మఱియొక్క రేల సుత దీనికి నీవ స్వయమ్ముగాఁ గడుం
గుసిమెయిఁ జూచికొమ్ము సరికోమటులెల్ల సెబాసు మేలనన్. ౨౧౬

క॥ క్షితి నితరవృత్తు లన్నియు, వితత వాణిజ్యమున లక్ష్మివిహరించున్ సం
తతము ను 'వాణిజ్యేవ, ర్తతే' యనెడి పలుకు వినవె తనయా సునయా.

ఆ॥ వె॥ ధనములేనివాని జననంబు వ్యర్థమ్ము
వాఁడు గడ్డిపఱక గాఁడు ధ్రువము

వాని కెదియు శూన్యమైన చందముననే
కానిపించు నింత సూనృతంబు. ౨౧౮

వ॥ అని మఱియును. ౨౧౯

సీ॥ అప్పటికనులు ముక్కాదియౌ నింద్రియా
లందెందు లేశంబు కందులేదు
అపు డెన్ని యక్కరా లభిధానముననుండె
నఖిల సమాయోగ మఖిల మదియె
అపు డెంతటి మనీష యలరారునో దాన
నే మాత్రమును మాఱు పేరుపడదు
అపు డెంత వాచాలతావేశ మొలయు నం
తయు నట్లయుండు నింతయును సురుఁగ
తే॥ గీ॥ దర్థబల మొందు సురిఁగిన యతని తీరు
సర్వమును మాఱుఁ దుటిలోన; జనుఁ డతండు
గాఁడు వీఁ డనిపించి యక్కజము గొలుపు
గాన ధని కుండవలయు జాగ్రత్త తనయ. ౨౨౦

మ॥ ధనవంతుం డొగి నెత్తువడ్డపుడె యీ దైన్యంబు, రిక్తుండు తా
జననంబాది యకించనత్వమున నిచ్చల్ బ్రుంగుటం జేసి వా
నిని దైన్యంబిటు పీడ వెట్టదు నిను న్నీతండ్రి లోకోత్తరా
ర్జనకుండై కనిపెంచె రిక్తదశ రా సైరించె దీ వేగతిన్. ౨౨౧

చ॥ ధన మిహాముష్మ బరంబు నిడు ద్రవ్యము మూర్ఖుని విజ్ఞుఁ జేయుఁ గాం
చన మిడు నందచందములు; సత్కులజాతు నొనర్చు ద్రవ్య మీ
యని దెదియున్ గనంబడ దహర్నిశ మందుకుగాదె? యెల్ల వా
రును బ్రియతింతు రున్నవి సిరుల్ పరిపాలన సేసికోఁ దగున్. ౨౨౨

వ॥ ఇట్లనేకప్రకారమ్ముల జ్ఞానకల తనకొమరునకు బోధించినను నతండు

గురూపదిష్టం బగు మార్గంబున శివారాధనతత్పరుండై సర్వదా
తదేకధ్యానంబునఁ గాలమ్ము పుచ్చుచుఁ దనలో. ౨౨౩

తే॥ గీ॥ రెండు మార్గంబు లుండెఁ బ్రవృత్తి యొండు
రెండవయది నివృత్తి యీ రెంటఁ బార
మార్థికవ్యాపృతికి నాద్య మననుకూల
మక్కఁతన దాని కే నెట్టు లనుమతింతు. ౨౨౪

తే॥ గీ॥ వర్తకము వృత్తులను ధనవైభవంబు
కలుగఁ జేసెడి దైనను గపటిగాని
వాఁడు దాని కుపచరించువాఁడు గాఁడు
కపటి యెన్నఁటికిని మోక్షగామి కాఁడు. ౨౨౫

మ॥ ప్రతివృత్తిన్ బరికించి చూచిన నెదో పాపమ్ము గన్పట్టు నే
కృతియున్ జేయక యేరికిన్ జరుగునే! యెవ్వానికో తక్కఁ, మ
త్ప్రత యార్జించిన దుండె శ్రీగఘుజపంబే తారకం బంచు నే
నితికర్తవ్యము మానికోఁ దగదె! నా కెద్దానితో నేమగున్. ౨౨౬

చ॥ అనృతము ముఖ్యవృత్తి యగు నర్యులతో వ్యవహారముం బొన
ర్చునెడ నబద్ధ మాడ కెటు సూనృత మూని చరింపవచ్చు? నే
ననృతపథమ్ము నుంతయిన నంటిన మద్గురుమూర్తి నాయెడం
గనలక పేర్మి చూపెడినె? శాపథ మే నెటు లూననేర్చెదన్. ౨౨౭

వ॥ ఇట్లు కృతనిశ్చయుండై. ౨౨౮

చ॥ తనపని మేనమామయె స్వతంత్రతమై మునుపెట్లొ అట్టులే
పొనరుపఁ దా సదాశివుని పూజయెడన్ గృతదీక్షుఁడై మహా
మునికృతముల్ పురాణములు ముఖ్యముగా వినుచున్ భవంబు పా
వనముగఁ గాలమున్ గడపు వైభవ మెల్ల శివార్పితమ్ముగన్.

వ॥ కొండొకకాల మిమ్మెట్లు జరుగు పిమ్మట. ౨౩౦

చ॥ ఇతనియుపేక్షచే జరుగు నెల్లయకృత్యములుఁ గురుండు స
న్మతులగువారివల్ల విని మాతులు ధౌర్త్య మడంచి శిష్యు స్వీ
కృతకులవృత్తిగా నలుపనెంచి తనంతన పిల్వనంపి వ
చ్చి తనకు మ్రొక్కి నిల్చిన స్వశిష్యున కాశిష మిచ్చి యిట్లనెన్.

ఉ॥ నా యుపదేశమార్గమున నాతియు నీవుఁ జరింతురే ? యుపా
ధ్యాయున కప్రతిష్ఠ యగునట్లు చరింపరుగా? గురూక్తికిన్
దోయిలి యొగ్గియుం దుదకుఁ "దోసియు రా" జని యర్థ మన్యథా
సేయుచు వైపరీత్య గతిఁ జెందుటయే కనుపట్టు నెల్లెడన్. ౨౩౨

వ॥ గురూపదిష్టంబులగు విషయంబులు చక్కఁగా మీమాంసించుకొనక యన్యథా భ్రాంతికి లోనయి చరించువారు పెక్కు రుందురు. దానికి శాస్త్రజన్యజ్ఞానం బావశ్యకము. అది యున్నప్పుడు గాని సామాన్య విశేషప్రభేదంబు లెఱుంగఁబడ వని వెండియు. ౨౩౩

క॥ భగవద్గీత సులభముగ, నగుపట్టెడిఁ గాని దానియందలియర్థం
బుగురూపదేశరహితులకగమ్యగోచరరహస్య మని యెఱుఁగ నగున్.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

ఈ శ్లోకమునకు సహృదయసమ్మత మగు నభిప్రాయము తక్కువ జంతువులనుగూడ బ్రేమించవలయు ననియేకదా? అట్లుగాఁ గాక పండితుని మాలని మాదిరిగను నేనుఁగును గుక్కమాదిరిగను జూడ వలయు నని భావించుటపేరే విపరీతార్థము. ఇట్టి బుద్ధిమంతులు క్వాచిత్కముగ నుందురు. వారు తఱచుగ నకార్యమ్ములు సలుపు చుందురు. వానిసమర్థనమ్మునకై యభియుక్తోక్తులకు నపార్థకల్పన లొనర్చుచుందురు. అట్టివారు సర్వథా ఆత్మవంచకులు. వారి యుప దేశములు శ్రేయస్కాము లాదరింపఁదగినవి కావని వెండియు.

మ॥ కులవృత్తిఁ ద్యజియింపలేదుగద? మీ కోమట్ల నెవ్వారినో
అలవాణిజ్యమునందు నిల్పి; యెపుడున్ "సాంబాయ శర్వాయ"యం
చెలమిన్ ముక్కును మూసికొన్నయెడ నీవే కాదు నీతండ్రికిన్
దలలో నాల్కలుగాఁ జరించు ననుఁగుల్ దైన్యానకున్ రారొకో.

మ॥ వినవయ్యేన్ భవదీయవృత్తమది; త్వద్వృత్తి న్విసర్జించి మా
మను సర్వాధిపతిం బొనర్చుకతన న్మత్తిల్లి యా ధూర్తు ని
న్నును నీతల్లినిఁగూడఁ గైకొనక యెన్నో దుష్కృతుల్ సల్పుచున్
ధనమున్ వమ్మొనరించి సల్పెడి యనర్థంబుల్ చెవుల్ వ్రీలఁగన్.

మ॥ ఇది నామా టటులుండ ని న్నరయు దేవేశుఁడు శంభుండు స
మ్మదమున్ జూపెడునట్టి వైఖరియె? అమ్మందుండు నానాఁట దు
ర్మదుఁడై సల్పెడి చెడ్డచెయ్వులకు నీమాంద్యమ్మకా? హేతు వ
య్యది నిన్నుఁగన్ ఘటియింపకేల విడుచున్ వ్యాఖ్యాన మింతేటికిన్.

ఉ॥ చేతులనిండ ద్రవ్యమది చిక్కక తానఁగదా? పొనర్చె నా
పాతకచేష్ట లాజడుఁడు; పాఁతఱ లున్నవి తండ్రినాఁటి వ
వ్రాతులఁ డేమిచేసిన నివారణ సేయఁ దలంప వీవు నీ
చేతము సర్వదా శివునిఁ జెందుట వాఁడు నెఱింగినట్టిదే. ౨౩౯

ఉ॥ గేస్తవు నీవు నీగృహము కేవల కల్పక; మర్థికోటి నీ
స్వస్తినిగోరి నీదు నిలుచావడిపైఁ బడికాపులుండు నీ
హస్తముమీఁదు నొండొరుల హస్తముక్రిందగు నీకు నిట్టి చే
దస్తము గల్గుచో నిహమె దక్కదటన్నఁ బరమ్మదక్కునే. ౨౪౦

ఉ॥ ఏయవధూతలో నడతురే యనుకొమ్మఖిలమ్ము వీడి; జా
యాయుతులైన గేస్తులకు నట్టివిధాన మెవండు సెప్పు? నీ
జాయయు నీవు నర్థిజన సత్కృతులం బొనరించుచున్ జగ
చ్ఛ్రేయముగా మహేశ పద సేవకులై మనుటెంత యొప్పునో. ౨౪౧

ఉ॥ అన్న! భవత్ప్రవర్తనకు నన్యులవృత్తికి భేదముండు నం
పన్నుఁడ వీవు నీ కొకజపంబుఁ దపం బనుకొను తారకం;
బున్నధనంబు యుక్తముగ నున్నతి గై కొనఁజేసి దాన నె
న్నెన్నివిధాలనో సుకృత మీవు గడించి తరింప నీలగుణ. ౨౮౨

తే॥ గీ॥ అట్టి నీ వవధూతల ననుకరింపఁ
జూచెదవయేని గురుల శుశ్రూష కప్రి
తిష్ఠ ఘటియించుఁ గ్రమముగా నిష్ఠ హెచ్చు
కొలఁది నవ్యోత్తరగతుల మెలఁగు టొప్పు. ౨౮౩

చ॥ వయసునుబట్టి జ్ఞానమును బట్టియు నిష్ఠలు మార్పుఁ జెందు లే
వయసలరారు నీ కఖిలవర్జనమం దధికార మున్నె? అ
న్నియుఁ గలిగించుకోవలయు నీరును దామరవోలె నుండి; యే
మియుఁ దన కంటకుండుగతి మేల్కొని సంసృతి నీఁదఁగా వలెఁ.

వ॥ సంసారం బనునది యిల్లును వాకిలియుఁ బిల్లలు జెల్లలును గొడ్డు
గోదయు ననునట్లు సామాన్యులదృష్టికి గోచరించెడి, విశేషజ్ఞుల
దృష్టిలో నవధూతలుగూడ నొకవిధమగు సంసారులుగనే పరిగణింప
బడుదురు. ఈవిషయము శుకజనకసంవాదంబువలనం దేలెడి నది భాగవ
తంబునం గలదు. అది యటులుండె నేను మద్గురువరులవలన వినిన
యొకయవధూతచరిత్రంబు వినిచెద నాలింపుము. ౨౮౫

తే॥ గీ॥ కాశికాక్షేత్రమందు గంగాతటమున
నొక్కయవధూత వసియించు నొరులతోడ
మాట లాడఁడు వాయువుమాత్ర మాహ
రించు నని తోఁచు నెపుడుఁ జలించఁ డతఁడు. ౨౮౬

క॥ అయిదాఱువంద లేండ్లకుఁ,బయిగా నుండునని యతనివయసుగుఱిచి ని
శ్చయముగఁ జెప్పికొనెద రే,మియు నక్క ఱలేదు సంయమికినాతనికిఁ.

క॥ పంచాగ్నిమధ్యమున భీ,ష్మించి యతఁడు గూరుచుండి మించితపముగా
వించెడిచోఁ బృష్ఠమునం,దించుక నిప్పంటుకొనియె నెఱుఁగఁడతండున్

ఆ॥ వె॥ పార్థివుండు దైవవశమున నది గాంచి
స్వయముగాఁ దదగ్నిఁ జల్లఁ బఱిచి
తప్తమైనచోటఁ దగుమందు పూసి సే
వించె నంచుఁ జెప్ప వింటి నేను. ౨౮౯

తే॥ గీ॥ ఇంత జరిగిన నాయన కించుకేని
లేదు సంబంధ, మిదియు నలీక మనఁగ
రాదు తత్కాలమునఁ దత్పురమున నుండు
వారలెందఱో యెఱిఁగిన వార్త యగుట. ౨౯౦

మ॥ ప్రతివర్షమ్మున వర్షకాలమున నాభాగీరథీదేవి కు
న్నతి తత్తన్నదులందుఁబోలెఁ గలుగుంగా! అప్పుడే నీమహా
యతి లేవండు చలింపఁ డచ్చటనె తా నారీతినే యుండు నీ
ళ్లు తటీభాగములెల్ల నిండి చను నేళ్ళుం గోళ్లు నేకంబుగన్. ౨౯౧

చ॥ వఱదటు తాళదఘ్నముగఁ బైపయిఁ బాఱినయప్డు సైతమ
ప్పురముఁడటన్ జలింపక తపం బొనరించుచు నుంటఁ జేసి త
చ్ఛిరమునుపండుపూడ్చుటయుఁ జేకుఱు నొక్కొకవర్షకాలపున్
వఱదలయం; దనంతరము పాఱల మన్నెడలింత్రు రాడ్చుటుల్.

తే॥ గీ॥ ఇట్టి దేహాభిమానమ్ము నెఱుఁగనట్టి
స్థాణువులు గూడ నొక్కొక్కతఱిని సంస
రింతు రిమ్మహితుం డొనరించెఁ బెద్ద
వర్తకము బేరసారముల్ పూర్తి జరుగ. ౨౯౩

క॥ తిరువంకాడరువిని యు,బ్బురపడి గురుఁజూచి పలుకు మునివర! యతఁడే
దురితం బొనర్చె ధనత,త్పరు లొనరుచు వర్తకమునవర్తించుటకున్

వ॥ నావుఁడుఁ గృష్ణానందగురువరుం డిట్లను భద్రా! యతఁడు వాణిజ్య వ_ర్తియగుటకుం గల యంతఃకారణం బేనును వినినది కాదు విన్న బాహ్యకారణంబు వినిచెద నాలింపుము మితిమించిన యైశ్వర్య వంతుం డొక్కబేహారి యనేకానర్ఘమణిపూర్ణం బగు నోడతో సముద్రమధ్యంబునఁ బ్రయాణం బొనర్చుచుండె నట్టియెడ,

చ॥ ఉఱుముచు మెర్మెచుక్ గడు భయోద్ధతిఁ జూపెడి యాకసమ్మునన్ గెరలుచు గాలి రేఁగఁ దొడఁగెన్ జలధిస్థజలమ్మునందుఁ బెం దరఁగలు లేచి యోడ యిఁక దక్కదటంచుఁ దలంచి సాహుకా ర్వారిఁబోరి నిష్టదైవముల మ్రొక్కఁ దొడంగె విపత్తు దాఁటఁగన్.

క॥ పిడికిటిలోఁ గొనప్రాణం,బిడికొని యిటు లున్న వాని కీ యోగి మహా త్ముఁడుజ్ఞప్తిఁదవులుటయుమ్రొక్కిడుకొ నెనీసాహుకారనీదృశభక్తిన్

వ॥ తత్ప్రకారం బెట్లంటేని. ౨౫౮

ఉ॥ ఓమహనీయ! గాలి నిను నొంపఁగ నేరదు నీటిముంపు ని న్నేమియుఁ జేయనేరదు మహీయము నీమహిమంబు నాకు నేఁ డీ మరణంబు దప్పునటు లీ వొనరింపఁగ నేర్తు నిక్క మిం కాముగురేకమైన నిది యాఁగుట దుర్ఘట మెన్నిభంగులన్.

తె॥ వె॥ ముగురు మూర్తు లంచు మునులు పురాణజ్ఞ
లనుట వినుటె కాని యరయ లేదు
కాశి గంగదరిని గనులార నీరూపు
గాంచి సంతసంబు గంటి మున్ను. ౨౬౦

ఆ॥ వె॥ నాకు నొక్కలచ్చ నాకకు నొకలచ్చ
నిందు నున్న సొమ్ము కేకలక్ష
నీదుపాదపద్మనికటాన నర్పింతు
నిపుడు గండ మీఁగెదేని దేవ! ౨౬౧

క॥ అని ముడుపు గట్టికొని మొ్రి
క్కినవిమునమునుండి గాలి కెరటమ్ములు ద
గ్గను జొచ్చెఁ దుపా నడగెను
మనియెల్ వర్తకుఁడు నొక మనికికిఁ జనియెన్. ౨౬౨

వ॥ అట్లు భద్రముగా గమ్యస్థానమ్మునకుం జనుటయు నా భాగ్యశాలి కపారంబగు లాభంబు లభించె ననంతరం బతఁడు స్వదేశమ్మునకుఁ జేరిన యుత్తరక్షణంబునన వారణాసికిం జని. ౨౬౩

మ॥ కలకుల్ బంగరు నాణెముల్ యతివరాగ్రస్థానమం దుంచి, త
చ్చరణాబ్జంబుల వ్రాలి మ్రొక్కి యరిగెన్ సాధుప్రకాండుండు; బం
గరునాణెమ్ములకుప్ప యప్పరముఁ డౌత్కంఠ్యమ్ముతోఁ బోలె దృ
క్సరసీజంబులు విప్పి చూచి కనుసంజ్ఞన్ దెల్పె నాంతర్యమున్.

మ॥ ఇది ప్రారబ్ధము హేతువై యొదవె నే నిద్దానితోఁ జేయ నెం
తు దధిన్ గూర్చిన వర్తకంబు; ధన మిందున్ గొంత గొంచున్ దధిన్
బదిలంబొగతి నా కొసంగవలయున్ బైకంబు నా కిచ్చి నా
దుదధిన్ గ్రైత మొనర్పఁగా వలయు నే ద్రోహమ్ము లేకుండఁగన్.

వ॥ ఈనియమమ్ము ప్రధానమ్ముగా నొక్కపెరుగునుగూర్చి పెట్టుకొన్నను శ్రీ రాదులకుఁగూడ వర్తించెడిదే, మఱియు నే నెంతకాల మిద్దానం బ్రవర్తింతు నంతకాలమ్మును వేఱొక రీ వ్యాపారమ్ము వెట్టుకోకుందురుగాక యని యాదేశించుటయు. ౨౬౬

ఆ॥ వె॥ నాఁడు మొదలు గొల్ల నారీమణులు తమ
పాలకడవ లెల్ల నోలి నటకె
తెచ్చి యిచ్చి సొమ్ముఁ దీసుక పోదురు
స్వామి ద్రవ్య మన్న జంకుతోడ. ౨౬౭

తే॥ గీ॥ మరల నవ్వానిఁ గొనెడివా రెఱఁగి యట్లె
జంకుతో నర్హమగు వెల స్వామియెదుటి

కుప్పలోఁ బెట్టి పోదురు తప్పుతోఁ గొ
కెవ్వరుంబోరు కొన్నేఁడు లేగ నిట్లు. ౨౬౮

ఉ॥ కొందఱిటుల్ చరించినను గొందఱు స్వామికి నేమి కావలెన్
దిందురుగాక లోకులని దీని నిటుల్ నడివీధిఁ బెట్టె నం
చుం దెగి పాలు పోలేఁడిడి పొమ్మొకకుంచెఁడు కబ్బ నంత గొం
చుం దరలంగసాఁగి రది చూచియుఁ జూడఁ డతండనాస్థతో. ౨౬౯

క॥ ఏదో యొక విధమున నది, పోఁదలచిన యతికి నేమి పోయెడి దీనన్
జీఁదఱవదలుటకిదియే, పో! దెరువని సంతసమ్ముఁ బొందెన్ యతియున్.

ఆ॥ వె॥ దేవవిప్రధనము దిను సాహసులయట్లు
కొంద ఱిట్లు గొనఁగఁ గొందఱెడఁద
జంకుగలిగి న్యాయ్యసరణినే వర్తింపఁ
గడచె నిట్లు చాలఁ గాల మెలమి. ౨౭౦

క॥ ఎన్నాళ్ళకుఁ దఱుగునొకో, యున్నా ణెములన్న రాశి యెట్టెటులో తా
నన్నగిలితుదకు లెక్కకు,నున్న యుహాళ్ళియునుగాఁగఁ జూపట్టెనహో.

క॥ ఏమియు నెఱుఁగని కేవల, పామరులకుఁ దక్కనిట్టిపట్ల నితరులౌ
ధీమంతులు నుద్యోగులు, నే మాత్రము వెఱవ రీశుఁడే లేఁడనుచున్.

ఆ॥ వె॥ దేవతాధనంబు దిను ఘనుఁ డొక్కండు
చెప్పునట్టియుక్తి చెవులఁ బడియె
నెవరికేని దేవుఁడే యీయఁగావలె
నతనిసొత్తె సర్వ మని వచించె. ౨౭౪

తే॥ గీ॥ ఇట్టి మిట్టవేదాంతు లనేకు లుండ్రు
వారు సంపన్నులుగఁ గనఁబడుటయుఁ గల
దిప్పటిది యిప్పుడే యఘ మెప్పుడో గాని
కానఁబడ దని యెఱిఁగి జంకవలె నరుఁడు. ౨౭౫

చ॥ ఒకతరమేని సాఁగకయె యూడనిఁబాడెను వానిసర్వముల్
సుకృతము దుష్కృతమ్ము నివి నూరు లిటుల్ కనిపెట్టుచుందు రే
టికొ? మెటులేని ద్రవ్యము గడించుటయే భవతారకం బటం
చకట? తలంత్రు కొంద,ఱిది యార్యులకుల్ రుచియింప దెప్పుడుల్.

కం॥ పాపిష్ఠంపుధనార్జన, కై పలుపాట్లు పడి కొంద ఱఘమూర్జింపన్
సాపదు మొలకయునుండక, యేపోవుల్ వంగడమ్ము లిలనెందఱికో. ౨౭౭

వ॥ ఇయ్యది విషయాంతరంబు, దీని నిట్లుంతముగాక. ౨౭౮

తే॥ గీ॥ చెప్పవచ్చిన దేమనఁ జిల్లపెంకు
కన్న నధమమ్ముగాఁ గాంచుఁ గనక మెవ్వఁ
డట్టి యవధూతకును దప్పదయ్యె సంస
రణము తదితరులగుఱించి గొణఁగుటేల? ౨౭౯

తే॥ గీ॥ పూర్వజన్మమ్మునం బెట్టిపుట్టి తీవు
కనుకనే తండ్రి గణియించి కనక మిచ్చెఁ
గావు నీ వవధూతవు కాంతతోడి
పొత్తు గల గృహమేధి విమ్మగ మెలఁగుమఁ ౨౮౦

వ॥ ప్రారబ్ధం బనుభవంబునంగాని తీరునది కాదు 'ప్రారబ్ధకర్మణాంభోగా దేవక్షయః' అను నభియుక్తోక్తియందలి యేవకార విద్యాయర్థంబు వ్యాఖ్యానించెడిని, ప్రారబ్ధంబు రెండు తెఱంగులు, దుష్కృతం బొకటి సుకృతరూపంబు వేఱొకటి, అనుభవమునందు భేదంబున్నను నివి రెండును జ్ఞానులదృష్టిలోఁ దుల్యంబులే యని మఱియును. ౨౮౧

కం॥ పరమార్థవేత్తలకు దు,ర్దురితంబగు బ్రహ్మహత్యతోఁ దుల్యము య
ధ్వరరాజ మశ్వమేధం,బరయఁ ద్యాజ్యంబ యీద్వయము వారలకున్.

వ॥ ఇయ్యది మహాజ్ఞానులవిషయం బని వెండియు. ౨౮౩

ఉ॥ నా యుపదేశకారణమునం దుద కీ విటు లైతి వంచు నీ
తోయమువారు నన్నుఁ బోరి దూషణ సేయుదు రంచు వింటి న
న్యాయము గాదుగా? యదియు నస్మదుదీరితతత్త్వ మన్యథా
నీమెద కెక్కనేమొ? యని నే మది సందియ మందెదం జుమీ?

మ॥ భగవద్గీతలసారముం దెలియువా ర్వ్యాపారదూరత్వము
న్నిగదింపం దలఁపూన రర్యుఁడవు వాణిజ్యమ్ము న న్నీవు బో
త్తిగ విశ్వాసము చూప విద్ది కులవృత్తిచ్ఛేదకం బొటచే
భగవత్సమ్మత మెట్లగు న్నరుఁడు నిర్వ్యాపారిగా మాటనే?

ఉ॥ సోమరిగాఁడు ఫల్గునుఁడు "సోమరి గ" మ్మని కృష్ణుఁ డానతీఁ
డేమనుజుండు స్వీయకులవృత్తిఁ ద్యజించునొ? వానిఁ బాతకిం
గా మది నెంచుఁ గృష్ణుఁ డని గానఁగ నౌ నలగీతయందు; నీ
వేమని యీసడింతు కులవృత్తిని నేఁ ద్యజియింపు మంటినే! ౨౮౬

మ॥ పరిశీలింపుము సూతగీతయు నిటే వాక్రుచ్చు నెవ్వాఁడు సో
మరిగా నుండునొ? సర్వదోషములు నమ్మందాత్ముఁ బ్రేమించు సో
మరిగా నుండెడి తేనికన్నఁ గడు సమ్మాన్యుండపో? ఆలగా
పరి వేదజ్ఞులవర్తనంబు గన సర్వంబుం సుబోధంబగున్. ౨౮౭

చ॥ అరసితె వైదికాగ్రిణుల, నార్యులు వా రెపు డూరకుండ రూ
పిరి క్షణ మాఁగకుండఁ జదివింతురు శిష్యుల; నంతఁబోక వి
స్తరిపని జందెపుం వడుకు సాఁగుచు నుండెడి నంతొ యింత యో
పెరటను గూరనారలను బెంతురు సొంతముగా నితాంతమున్. ౨౮౮

ఉ॥ కోమటిబిడ్డవై యురక గోళులు గీటుచుఁ గూరుచున్నచో
నేమనువారు బంధుగులిసీ యన రే? శివపూజ సేతుగా
కేమియు వ్యాప్ళతిం గనక యే శివపూజ యొనర్పుమంచు నీ
కే ముద లిచ్చినాఁడ నెస్వవృత్తిపరిచ్యుతి గేస్తుధర్మమే. ౨౮౯

వ॥ ఇట్లు పలువిధముల ననేకోదాహరణపూర్వకముగ బోధించుచుఁ
దన్ను వాణిజ్యవైముఖ్యమునుండి మరల్చు దేశికోత్తమునకు శిష్య
సత్తముం డిట్లనియె. ౨౯౦

క॥ స్వామీ! నే నొనరించిన
దేమున్నది దోస మరక యెందుకు నన్నున్
వ్యామోహితుఁ జేయుట మా
కోమటి వ్యాపారమునఁ దగు ల్కొలుపుటయున్. ౨౯౧

క॥ వృత్తులలో లాభముగల, వృత్తియనుటదక్క వైశ్యవృత్తియెడలఁగిం
చిత్తును గొన మగుపట్టదు, చిత్తం బద్దానికెట్లు చేర్తు మహాత్మా.

తే॥ గీ॥ ఒకటిచూపుట మార్చి వేఱొకటి యిడుట
తూకమునఁ గొంత మోసంబు వాకులందుఁ
గపట మిందెన్నియో యింకఁ గలవు దోసఁగు
లెందులకు నన్ను దింపెద రిందు దేవ. ౨౯౩

ఉ॥ ముక్కుకు సూటిగాఁ జనుప్రబుద్ధులు వైశ్యులవృత్తి సేయుచో
నెక్కడి దక్కడే సురిఁగి యేగును లాభము గూబకెక్కి, యిం
దెక్కుడు తెల్వి యుండవలె నెంతటిమిత్రుని మోసగించువాఁ
డొక్కఁడె దీనికిం దగు మఱొక్కఁ డనర్హుఁడు దేశికోత్తమా.

మ॥ వ్యవసాయాదులయందుఁగూడఁ గల వేపాపమ్ములో; ఉండుఁగా
కవి మోసమ్మున కాలవాలములుగా వాద్యంత మీవృత్తియే
చవి మోసమ్మున నెక్కు డున్నయది, యీ చండాల మాఁగంగదా!
మివులన్ ధర్మము లాచరించెదరు సామీ? విట్కులగ్రామణుల్.

ఉ॥ లంచము మోసము న్నరకలంపటతన్ గలిగించు నీపనుల్
కొంచక సేయుమానవులకున్ మది యుండియు లేనిదే విని

ర్శించిన దేవుఁడే యెఱుఁగు మీఁదటివారి యవస్థ; యెందుకీ
యించుక పొట్టకోసరము హేయపు దుర్వ్యవసాయముల్ గురూ.

క॥ తినినం బోయెడిఁ దినకుం,డిననుం బోయెడిని నాఁకటికి లోనై దాం
గనిపించుకొనుటకంటెన్,ఘనులకు దైన్యంబు మేలుగాఁదోఁచుఁగదా?

క॥ దొంగతికమె మోసము క,న్నంగొండొక మేలు దాననమ్మించిపొన
ర్పం గలద్రోహము లేదుదొ,సంగుల మోసంబెబల్ దొసంగు మహాత్మా!

క॥ ఆపద్ధర్మమ్మున వణి,గ్వ్యాపారమునందు మనువు పలుదోషము లీ
వ్యాపారమునంగలవని,యాపరముఁడు కృషికిద్విజులకనుమతియిచ్చెన్.

ఉ॥ ఏను ద్విజుండఁ గోమటులకీ కృషి శాస్త్రము చెప్పినట్టిదే
దీన విశేషలాభము పదింబదిఁ గన్పడకేమొ యెవ్వరో
గాని పొనర్ప రియ్యది పొకాలినఁ గాలఁగ నిందు వర్తకం
బే నొనరింపఁజాల క్షమియింపుఁడు మోసము దోసమౌఁగదా?

వ॥ అని వెండియు. ౩౦౧

ఉ॥ న్యాయము దీర్పఁగాఁ దగినయట్టి మహోన్నతపీఠ మెక్కి యే
కాయదెయో? పండో? యిచ్చె నని కాదు సువర్ణమె యిచ్చె నంద మ
న్యాయము న్యాయమౌనటు లుపాయముఁ గల్పించి దీరుపిచ్చువాఁ
డేయఘమందు వంచకుల కిచ్చునదే యఘ మోశఁ డోగురూ?

క॥ మోసము లంచము రెండును
దాసినఁ దూఁచునెడ హెచ్చుతగ్గులు లేకే
భాసించు నీ ద్వయమ్మును
దోసములం దెన్నఁదగిన దోషము లనఘా? ౩౦౩

వ॥ అథవా లంచగొండితనమే యెక్కుడు దోస మనుకొన్నను. ౩౦౪

ఉ॥ మోసము దానితమ్ముఁ డిది ముట్టక సాఁగదు వర్తకంబు; మీ
దాసున కేదొ మంత్రి మిడి ధన్యత గూర్చియుఁ గూడ నెందుకీ

దోసమునందు దింపుటని దోసిలి యొగ్గుచు విన్నవించెదన్
గాసు గడించుపొంకె నెటు కానిపనిన్ బొనరింతు దేశికా! 304

చ॥ అనవుడు దేశికుం డను సమస్తజగమ్మును ద్రవ్యమూల మా
ధన మొకఁడున్నచో నిహము దానికతాన జయింపవచ్చు దా
నని పరమందు స్థైతము గొనందగు సౌఖ్యము, మోస మెవ్వరో
పొనరిచిరంచు మానికొనఁ బోలునె? చక్కనివృత్తి వెత్తివై. 305

క॥ తఱచుగ వంచకు లుంటన్
గర మపయశ మబ్బుఁ గాని కడు న్యాయముగా
జరిపికొను వర్తకులు స
త్పురుషులు గల రెందఱేని పుణ్యచరితుల్. 306

క॥ చిల్లర మల్లర వర్తకు, లల్లము బెల్లముల నమ్మ నపు డారీతిన్
గల్లలనాడుదురని యది, యెల్లరకును నంటఁగట్టు టేధర్మమహో! 307

మ॥ ప్రతివృత్తిం గల రుత్తమోత్తములు దుష్ప్రారంభకుల్ గూడ; నే
కృతియున్ యోగ్యులచారిఁ బట్టి చనుచో సేవంబు గన్పట్ట దు
న్నతవంశస్థుఁడవైన నీకు భయ మందం గారణంబేమి? సూ
నృత మార్గంబున వర్తకమ్ము జరుగు న్నేనుంటి నన్నింటికిన్. 308

తే॥ గీ॥ మది యథాలాభసంతుష్టిఁ బొదలు వైశ్య
నకు స్వకులవృత్తి లేశము నరకమునకుఁ
గాదు హేతు వతఁడు ఋషుల్ గాంచు సద్గ
తికిఁ జనుట నిక్కవమ్ము సందియము వలదు. 309

ఉ॥ ఏల యసత్యమాడవలె? నింతకుఁ గొంటి మటంచు నిక్కమే
యేల వచింపరాదు? పయి నింతకుఁ గాని యొసంగ మన్నచోఁ
బోలదె? యిందు లేశమును మోసము సేఁతకుఁ జోటులేదు స
చ్ఛీలు రిటుల్ చరింపరె? భజింపరె? యిందును నందు సౌఖ్యముల్.

క॥ నీతండ్రి స్వకులవృత్తి న, నేతాదృశమైన కీర్తి యేకాక ధన
మ్మేతీరున నార్జించెనొ, నీతోయ మెఱుంగు గొంత నేను నెఱుఁగుదుఁ గా.

చ॥ ఎవనికతానఁ బల్వురకు నేమిపమీఁదనొ జీవనంబు సం
భవముగు వాని జీవితము పండితనుత్యము; పొట్టకోసమే
యెవఁడు గణించు వాని బ్రదు కెట్టిది? కొంగయు వాఁడు నొక్కటే
యవుదురు నీ కతమ్మున సహస్రజనుల్ బ్రదుకఁ గవలెఁ గ సదా. ౩౧౩

వ॥ నీకు సర్వమ్మునకును నీజనకుండె గురుండు వేఱొకరితో నీ కావం
తయుఁ బనిలే దని వెండియు. ౩౧౪

తే॥ గీ॥ అతఁడు శివపూజకుండు శుద్ధాంతరంగుఁ
డా ప్తజనపోషకుండు దయామయుండు
దీనజనరక్షకుండు సుదీర్ఘ యశుఁడు
నీవు తత్తాదృశుండవై నెగడుమయ్య? ౩౧౫

క॥ కులవృత్తులయ్యుఁ బాప, విలములు జారతయుఁ జోరవృత్తియు నివి త
త్కులజులు పొనర్పఁ జనదని, పలికిరి ధర్మజ్ఞులైన పరమమునీంద్రుల్

చ॥ ఇలఁ బలువృత్తు లుండినను నెయ్యదియుఁ గులవృత్తి కావు త
త్కులనఁ దపస్సువంటిదని తజ్ఞులు పల్కుదు రీవు వర్తకం
బెలమి నొనర్చి బంధుగుల కేమి తదన్యుల కేమి సంతసం
బొలయఁ జరింపు మజ్జనకు నుల్లమునం గనుమెంత జ్ఞానియో? ౩౧౬

క॥ జనకునియుపదేశము మన
మున కెక్కియ కాదె శుకుఁడు మును సంసారం
బున కనుమతించె జనకుని
యునికిఁ దెలిసి నీవు భద్రి మొందుము భద్రా. ౩౧౭

తే॥ గీ॥ మును తులాధారునకు వర్తకునకు జాజ
లికిఁ దపస్వికి నడచిన దొకప్రసక్తి
ఆత్మవృత్తి వర్తించు వైశ్యవరుతత్త్వ
విత్త్వమునకు జాజలిముని వింతపడియె. ౩౧౮

వ॥ అది యట్లుండె మహామహులగు ఋషులు సర్వమును మనకు గ్రంథ
రూపమునఁ బ్రసాదించియున్నను బైకి భిన్నభిన్నమ్ములుగఁ గన్పట్టు
వారి వాక్యమ్ములకు నేకవాక్యత కుదుర్చుకొనుట కడుంగడుఁ గష్ట
సాధ్యంబగుకతనఁ గర్తవ్యాంశమ్మునందుఁ బలువురు పలుత్రోవలం
బడుట పొసంగుఁ గావున సర్వవేదసారంబగు గాయత్రిం బట్టి నీకుఁ
గొండొక వివరింతునని వెండియు. ౩-౨౦

తే॥ గీ॥ అరయు గాయత్రియందున్న యల్ల "చోద
యా" త్తనుక్రియాపదము బుద్ధు లస్వతంత్ర
ములుగ వ్యాకరించెడి వాని నెలమిఁ బ్రేరి
తములు సేసెడి శక్తిసత్తను వచించు. ౩-౨౧

క॥ కావున మనకు స్వతంత్రత
యేవిషయమునందుఁగూడ నించుకయును లే
దీ విధి యుపనయమునాఁ
డే వింటివి చెప్పనేల? యిపు డది మరలన్. ౩-౨౨

వ॥ ప్రస్తుతము నీసందియంబు నివర్తింపఁ జేయు నొక్క యితిహాసంబు
జనకునకును నమ్మహారాజుభార్యకును సంబంధించినది కలదనుటయుఁ
దిరువంకాడరు మహాత్మా! న న్ననుగ్రహించి యద్దాని వినిచిన
వినవలతు నని సవినయమ్ముగఁ బ్రార్థించుటయు. ౩-౨౩

ఆ శీ ర్వ చ న ము

క॥ మహనీయులసుచరిత్రము
లహర్దివము మనన సేయు నలఘుల్ రెడ్డిన్
బహువిధశుభము లొసఁగుచు వ్య
వహారజయదాత శివుఁడు పాలించుఁ గృపన్. ౩-౨౪

గద్య

ఇది శ్రీ తిరుపతి వేంకటీయంబగు శివభక్తి యను పరమ
భక్తచరిత్రంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయై నమః.
శుభమస్తు - అవిఘ్నమస్తు.



శ్రీ

# శివభక్తి

## చతుర్థాశ్వాసము

తే॥ గీ॥ సిరి గలదు నీకు దేవతాచరణభక్తి
గలదు విద్దియగల దెందుఁ గానఁబడదు
వెలితి, యేదేని యున్న నవ్వెలితి దీర్చి
రెడ్డి! నినుఁ బ్రోచుఁగాక గౌరీవరుండు. ౧

వ॥ అవధరింపు మనంతరకథావిధానంబు కృష్ణానందగురుండు శిష్యున కిట్లు చెప్పందొడంగె. ౨

క॥ జనకమహారాట్చరిత,మ్మొ నెఱుంగనివారు లేరు ముజ్జగముల, న
య్యనఘుసతీతిలకం బడి,గె నొకప్పుడు మంతనంపు గేహమున నిటుల్.

ఆ॥ వె॥ ఆర్యపుత్ర! మిమ్ము నందఱు వేదాంతు
లనుచుఁ గడు విరాగులనుచుఁ జెప్పి
కొందు రితర నృపులకును మీకుఁ గల భేద
మెందు గోచరించు నెఱుఁగఁ జెప్పుఁడు.

క॥ శత్రులని మిత్రులనియుఁ గ, శత్రాపత్యమ్ములనియులాఁతులనియు నే
కత్రసుముఖత్వమును నిత,రత్ర విముఖభావమును దొరయుమీపట్లన్.

క॥ మీ వేదాంతం బెక్కడ? యే వేదాంతు లిటులుందు? రిది వేదాంత
ప్రావీణ్యమ్మనుకొనుచో, నేవారలు గాక యుందు రిఁక వేదాంతుల్.

మ॥ ధనవంతుల్ గుణవంతు లార్జనపరుల్ ధాత్రీశ్వరుల్ దివ్యశో
భన తేజస్కు లుదారతాఖనులు భాస్వత్కీర్తిశాలుల్ గదా!
అని మిమ్మట్లు ముఖస్తుతుల్ సలుపుటో! అందర్థమే యున్నదో!
యని మి మ్మెనడుగం దలంప వెనుదీయం జేయు గొంకంతటన్. ౭

క॥ అనికిం బోదురు వేఁటకు, వనికిం బోవుదురు శయనవసనాశనముల్
గొనుదురు వేదాంతం బెం,దునున్నదో? యెందు కటుబుధులువల్కుదురో.

తే॥ గీ॥ యాజ్ఞవల్క్యమహాముని యంతవేత్త
మిమ్ము గణియించు మీదు పుణ్యమ్మదెట్టి
దో! యితర భూపతులకు మీ కున్న పేరి
లో సహస్రాంశమును లే ద దే సుకృతమొ. ౮

క॥ సన్న్యాసులు మీరిచ్చు ను,పన్యాసము వినుటకొఱకు బహుదూరస్థుల్
వన్యాసు లరుగుదెంతురు, ధన్యులమైతిమని మరలఁ దలఁగుదురు వెసన్.

క॥ పున్నెమ్ము పెట్టిపుట్టిన, మన్నీల్పలువురిల నున్న మహనీయులు మీ
పున్నెమ్ము హెచ్చుసుకవులు,పున్నెముయశమిచ్చునన రెభూదేవేంద్రా.

తే॥ గీ॥ వ్యాసునంతటి తపసియు నాత్మజాతు
శుకు విరక్తుని బంపె శుశ్రూషకొఱకు
మీకడకు; మీ రొనర్చిన మేటిసుకృత
మేరు నేయురు సేయఁబో రింక మీఁద. ౧౨

క॥ మీకడకు వచ్చుయోగు ల, నేకులు వారెల్ల మీర లేదియొ తెలుపన్
జేకొనియరుగుదురంతియె, మీకొక్కరు తెలుపఁజాలమియొకనుపట్టున్

తే॥ గీ॥ ఎల్లరుం గారుగా శోకరేని వారి
యందు మీాకన్నఁ దెలిసినయట్టి ఘనులు
లేక యుందురె? యుండియు లేచి మాట
లాడ వెఱచుట కర్థ మేమగు మహాత్మ; ౧౪

క॥ తెలిసీ తెలియని నా పలు,కులకున్ క్షమియించి తెలిసికో నగునేనిన్
దెలుపుఁడునాసం దేహము,దలఁగునటులటన్న నృపుఁడుతలవంచినగన్

వ॥ అట్లు చిఱునవ్వునవ్వి తూష్ణీంభావమ్ము గనఁజేయుటయు నప్పతి
వ్రతాతిలకమ్మును మరల మరల నడుగుట యుక్తమ్ము గాదని
మిన్నకుండె నిట్లు గొన్ని నా ళ్ళరిగినయనంతర మొక్కనాఁడు. ౧౬

క॥ పలువిధములైన భక్ష్య,
మ్ములు భోజ్యమ్ములును జోష్యములు లేహ్యములున్
వలయు నని మహానసవ
ర్తులకు న్నియమించె నృపవరుఁడు, చేసి రటుల్. ౧౭

వ॥ పదంపడి యంతిపురమ్మున నొకగదిలో నొండొకదూలమ్మునకు
మిక్కిలివాఁడియును బరువునుం గల యొకయాయుధమ్మును గడుం
గడుఁ బేలవమ్మును నొకపాటిగట్టితనమ్మును గల దారమ్మతో
వ్రేలఁగట్టించి రాణివాసమ్మును దాని కధోభాగమ్మునఁ గూర్చుండ
నియమించి యక్కెలనఁ గొండొకదూరమ్మునఁ దానును గూర్చుండి
యిట్లనియె.

చ॥ కలికిరొ! భక్ష్యభోజ్యములు గాంచితివే? యివి క్రొత్తక్రొత్త యిం
పులు దులకించునట్టివి యపూర్వము, లేనును మున్నెఱుంగ నిం
దలిరుచిఁ జూత మంచును ముదంపడి పాకపుశాస్త్రమందు నే
ర్పులవడువాండ్రచే నిటు తయా రొనరింపఁగఁ జేసితింజుమిా? ౧౮

క॥ తిని చూత మంచుఁ దానును, దినునట్లు నటింప నాసతీతిలకంబున్
దినఁదొడఁగె దినెడివేళను వనజాక్షిం బృచ్ఛ సేసెఁ బార్థివుఁ డెలమిన్.

క॥ వనితరో? భక్ష్యము లియ్యవి
తిని చూచితె? భోజ్యపురుచిఁ దిలకించితె? ముఁక
దినినయవి కావుగా? నూ
తనములు రుచి నచ్చెనే? యథార్థము సెపుమా! ౨౧

ఉ॥ నావుడు నవ్వెలంది చిఱునవ్వు మొగమ్మునఁ జెంగలింప నో
దేవ? భుజించుచుంటి రుచిఁ దెల్పఁగఁ జాల క్షమింపు మార్య! నా
భావ మసిప్రసక్త మయి "బల్లు"న శీర్షము వ్రచ్చునో? యటం
చావయి పేగుటక దెలియదయ్యెఁ బదార్థయథార్థ మేమియున్. ౨౨

క॥ అనవుడుఁ జిఱునవ్వు మొగం
బునఁ జిందులు ద్రొక్క తేఁడు పొలఁతిక గని యి
ట్లనియెను "నాసంసార
మ్మున నునికియు" నిట్టిచందమున నుండు సతీ. ౨౩

క॥ అసిపై నీచూపెట్టులు
ప్రసక్తమయి భక్ష్యరుచి నరయఁజాలదొ? మా
నన మట్ల నాయదియు నే
రన మరయుటెఱుంగ ద్రొక్కబ్రహ్మంబు వినా. ౨౪

చ॥ కసిగలవాఁడు వోలెఁ బలుకార్యములం బొనరించుచుక గడుక
వ్యసనియుఁబోలె సంస్కృతిని వర్తిలుచుక గనుపట్టుఁగాక మా
నన మెపుడుం బరాత్పరుని నాటిచలింపక యందయుండు నా
రసికులవర్తనల్ దెలియరా వొకమాత్రి జగమ్మువారికిక. ౨౫

క॥ బాలురలో బాలురుగా, లీలావతులందు నొక్క లీలార్థులుగా
లోలురలో లోలురుగాఁ, గ్రాలుదు రవ్వారిచర్య కడు గహనంబా.

వ॥ అని బోధించుటయు నాసాధ్వీతిలకమ్ము తనయవివేకమ్మునకు
లజ్జించి మిన్నకుండె నని చెప్పుదురు గావున. ౨౭

క॥ నీవును హృదయమ్మెప్పుడు, దేవునిపై నిడియథేచ్ఛఁ దిరుగుచు నెలమి
న్నీవృత్తివర్తకమ్మును, గావింపుము తోడి వర్తకగణము మెచ్చన్.

క॥ ఒరుల పురస్కృతి గానీ, యొరులతిరస్కృతియుఁ గాని యొక్కింతయు నీ
వరయక నీలోనీవే, పరీక్ష యొనరించుకొనుము బాగును నోగున్.

తే॥ గీ॥ కల్పకమువంటి వృత్తి చక్కనిది నీకుఁ
బుట్టుతోడన పుట్టె నీ వట్టి వృత్తి
విడిచి సోమరి వైనచో వెకలితనము
గాక యేమగు నిదిగాదు జ్ఞానపథము. ౩౦

ఉ॥ దండిగ స్వీయవృత్తియెడ ద్రవ్యము నార్జనచేసి పండితా
ఖండలులన్ గవీశ్వరుల గాదిలిచుట్టములన్ భరింపుము
ద్దండుఁడు వైశ్యులం దనియుఁ దండ్రిని మించునటంచు నిన్మహీ
మండలి మెచ్చుచొప్పున సమంజసఫక్కిఁ జరింపు మెమ్మెయిన్. ౩౧

చ॥ స్వయముగ వత్తు నీ కడకు సంతస మబ్బెదునట్లు వృత్తిలో
జయముగ సంచరింపుము యశమ్ము ధనమ్ము గణింపు మెల్లయ
న్యాయము తరింపఁజేయుము భయంపడఁ బోకు ముపాయశాలి కే
దియు వికటింప దీవెఱిఁగి తేఁకువమైఁ జరియింపు మెమ్మెయిన్. ౩౨

వ॥ ఇట్లుపదేశించి యాశీర్వదించి యనుపుటయు నత్తిరువంకాడరు. ౩౩

క॥ గురునుపదేశమునందలి, పరమార్థ మెఱింగి కొలము వారలు మెచ్చన్
దిరముగ వాణిజ్యముపైఁ, దిరుగన్ మొదలిడియె దేశదేశములుపాఱన్.

క॥ ద్వీపాంతరవాసులతో, నేపాటియు జంకులేక యితఁడొనరించెన్
వ్యాపారమ్మును లాభం, బాపూర్తిగఁ గలిగె లక్షలాదిగ దానన్.

ఉ॥ స్నానము సందెయున్ జపము సల్పుట యెంతటి చిక్కుగల్గినన్
మానఁడు సర్వదా శివుని మానసనేత్రముచేతఁ జూచుచున్

దేనికిఁ గాని కర్త యల దేవుఁడె తాను నిమిత్తమాత్రి మం
చానిపుణుండు వర్తిలె నహంకృతి వీడి స్వకీయవృత్తిలో. ౩౬

క॥ తిరువంకాడరు కాదిని,
బరస్పరవిరుద్ధరీతి వాణిజ్యము శం
కరుపూజయు సరిఁ గుదురక
"పెరుగును ధాన్యమును గలియు" విధమై తోఁచెన్. ౩౭

తే॥ గీ॥ క్రమముగా దేశికుని కటాక్షము ఫలించి
యొండొకంటికిఁ దోడుగా నుండి ప్రోత్స
హించినట్లుగఁ దోఁచె సమంచితముగఁ
దనదు వ్యాపారమును జూచుకొనఁగఁ జాలె. ౩౮

మ॥ తిరువంకాడరుత్పత్తి యెట్టిదన? నేదేఁ జేరితోఁ గొంద ఱె
వ్వరో జీవించినఁ జాలు నెక్కుడుగ లాభం బబ్బ లేదన్న చిం
త రవంతేని యెఱుంగఁ డీదృశునెడన్ దైవంబు సంపూర్తిగా
గరుణంజూపక యింక నెవ్వనిపయిన్ గారుణ్యముం జూపెడిన్. ౩౯

క॥ క్రమముగ నంతకుమును మే,నమామయొనరించినట్టిన్యాయ్యేతరముల్
విమలాచారుఁడు కనిపెట్టి మందలింపంగ నతఁ డుడికి యిట్లనియెన్.

తే॥ గీ॥ "పిల్లకాకికిఁ దెలియదు వింటిదెబ్బ"
"గ్రుడ్డువచ్చి పిల్లను గనుఁగొనుచు వెక్కి
రింపసాఁగిన" దన్న యారీతి నున్న
వీవు మాటాడు మాట లే నేమనందు? ౪౦

ఉ. ఈ వికఁ బెద్దవాఁడవయి యేలుదు మమ్ములనంచుఁ గోర్కెతో
నీవిభవాభివృద్ధిని మనీష జపించుచు నున్న నన్ను నీ
వీవగఁ దూలనాడెదిది యెవ్వరు సైఁతురు? నీకృతఘ్నతన్
దేవుఁ డెటుల్ క్షమించు గడిదేర్చుటకున్ బహుమాన మిట్టిదేర

క॥ కను దెఱచితి విప్పుడు నీ,జనకుఁడు గతియించుమీఁద జరిగిన దెల్లన్
వినిచినఁ దేలునె? భారత,మునకున్ బదిరెట్టులధికముగ నదియుండున్

క॥ నీతల్లి మాకు సోదరి,యా తెఱవ మొగమ్ముఁ జూచియాఁదుకొనుచు మే
మీఁతకుఁబడితి మొకింతయు, లోఁతరయఁగ రాని వార్ధిలో శక్య మెటుల్

క॥ ఎగఁగొట్టి రెందఱో దు,ర్భగు ల;ప్పక్కడికి మే ముపాయము మైఁజె
ప్పఁగరాని పాట్లఁబడిసొ,మ్మగున ట్లొనరించు టెఱుఁగ రా? గ్రామస్థుల్

ఉ॥ "పత్రము పాయ" యంచును లవమ్మును నాదరు వేది లేకయే
"మిత్రు" లటంచుఁ గొందఱికి మీజనకుండు డిడె వానిలోన నే
మాత్రము తప్ప సర్వమును మాకు వసూలుకుఁ జిక్క లేదు బల్
చిత్రము భావిశాసనముచేఁ జెడె వేలకువేలు లక్షలున్. ౪౬

క॥ ఎవరో దైవజ్ఞుండఁట!, భవిష్యదర్థములు దెలియువాఁడఁట? యాతం
డవివేకమొ!సువివేకమొ!,శివ!శివ!రాఁబోవుకతలు చెప్పెన్ బెలుచన్

తే॥ గీ॥ ఆకతలలోన ఋణపడ్డ లోకులెల్ల
నుద్ధరింపఁబడుదు రంచు నొక్కకతను
గలదు త్వరలోన నటువంటి కఠిన శాస
నంబు వెలువడు ననియును నందుఁ గలదు. ౪౭

తే॥ గీ॥ ఎంతొ కట్టుదిట్టమ్ముగనే లిఖించి
నట్టి తాకట్టుపత్రమ్ము లన్ని గంగఁ
గలసె రాజశాసన మొకండు కలికిఁ దోడు
గా బయలుదేఱఁ గల దను కత కతమున. ౪౯

తే॥ గీ॥ కొన్ని యటువంటి శాసనాల్ నిన్న మొన్న
పుట్టుకతమున నదియును బుట్టె తీరు
ననెడి నమ్మిక ప్రజలందు వ్యాప్తి చెంది
యప్పులున్నట్టి యెఱుఁగ రేయయ్యె లిప్పుడు. ౫౦

క॥ పరలోకానకు భయపడు
సరళహృదయు లెవరొ తప్ప సర్వులు ఋణముల్
దురిత మనక యెగఁబెట్టిరి
పరలోకభయమ్ము గలుగువా రెంద ఱిలన్. ౫౧

తే॥ గీ॥ గట్టిగా నడిగినయెడఁ "గంప్లయింటు"
చేసికొమ్ము పొమ్మందురు చేసికొన్న
యెడల నెన్నాళ్ళ కది తేలు నింతలోన
శాసనము వచ్చుచోఁ బోవు సకల మపుడు. ౫౨

తే॥ గీ॥ అక్కటతమ్మునఁ గోర్టుల కరుగకుండఁ
గంచెపైఁ బడ్డ బట్ట నాఁ గడునుపాయ
ముగను రాఁబట్టుచుంటివి మోస మిందుఁ
గలదె? యప్పన్న? దానంబ గాదె తుదకు. ౫౩

చ॥ ఇతరులు దిన్న యీధనము నెల్లను మాపయిఁ బోల్ప నెంచు నీ
చతురిమ కెంత మెచ్చినను జాలదువో? తరువాయి యుండు మా
కతమునఁ గన్న మేలది పొకాలు టటుండఁగ నీకు నష్టి గూ
ర్చితిమని దూఱఁ జొచ్చితివి చెట్ట ఘటించెను మంచి కేగినన్. ౫౪

వ॥ ఇట్లు.

ఉ॥ "కాకులలెక్కపత్రి" మను కైవడిఁ జెప్పుచొకాని యుక్తమా
వీఁకను మేనమామ ధనవృద్ధిని గూర్చి క్షయమ్ముగూర్చి తా
నేకరుపెట్టఁ డేమియును; నిట్టు లయోమయమైన లెక్క లె
ట్లో కనిపెట్టి మామపయి నుగ్రతఁ జూపెను భాగినేయుఁడున్. ౫౫

వ॥ మరలఁ గోపంబు గొండొక యుపసంహరించుకొని. ౫౬

చ॥ జని యిది శాశ్వతంబగునె? చంచలమై చెడు దేని నమ్మి వం
చన మనృతంబు నన్ ద్వయము సాయముగాఁగొని స్వామిద్రవ్యమున్

దినుటది యెంతపాతకమొ దేబె లెఱుంగరుగాక మీ కెటుల్
చను? శివనేశుసాధ్వి కనుజన్ములు గారె? యిటుల్ చరింతురే? ౫౭

శా॥ ఏపృథ్వీరుహ మాశ్రయించితిరొ? ఆవృక్షంపుఁబండుల్ దినం
బాపం బుండదుగాక చెట్టు మొదలే భక్షింపఁగాఁ బూను మీ
పాపం బేరికి సహ్యమౌ? ధన మెటో భక్షించుటే కాదు దు
ర్వ్యాపారమ్ముల కగ్గమై యఘము సంపాదింతురే? నా కిటుల్. ౫౮

మ॥ "ఎపుడో పాపము వృద్ధియౌ పిదపఁ దా నే చట్టమో పుట్టు దా
వ్యపునష్టం గలిగించు గేస్తుల" కటం చార్యుల్ భవిష్యద్విదుల్
వ్యపదేశించిరి నేఁడె పుట్టదుగదా? యాచట్ట మెట్టెట్టులో
అపలాపించెద వెట్లు నమ్మవలె? నీ యన్యాయపుణ్ ధోరణుల్. ౫౯

ఉ॥ "ఎందుకు నారికేళ నగ మెక్కెద వన్నను దూడగడ్డి" కం
చుం దెగి యుత్తరం బొసఁగు శూరులచుట్టఱికంబు దెచ్చె నా
కందును బాపికో నెదియుఁ గాన నుపాయము; మిమ్ముఁ బాయుటే
యిందుకు మంచిత్రోవ వెస నేగుఁడు మీరలు మీదుప్రోలికిన్.

చ॥ అనృతము లాడుపట్టున భయంబది లేశము లేని మిమ్ము నే
మనఁగల? దిట్టి చెట్టలదురంతము లెల్లెడ వ్యాప్తిఁ జెంది స
జ్జనబిరుదార్హులౌ విశులజాతి కళంకిత మయ్యె నొండె న
మ్మినయెడ మోసగింతు రని మేటికవుల్ వచియింత్రి ? బేరులన్.

క॥ "తాఁజెడినకోఁతి వన,"మెం, తేఁజెఱిచె నటన్న నుడికి దీటగుమీ మో
మేఁ జూడఁజాల నరుగుం, డేజాడను వచ్చితిరొ? అదేజాడ నొగిన్.

వ॥ ఇట్లు మోమోటమ్ము విడిచి బంధుస్నేహంబు గణింపక నోనాడు
టయు మేనమామ తనదోషంబు సకలమ్ము నెఱింగియు నెఱుంగని
చందమ్మున సోదరితోఁ జెప్పిన నాపెకొమరునితోఁ దమ్ముఁ ద్యజింప
వలదని బోధించు నని తలంచి. ౬౩

క॥ జ్ఞానకలకడకుఁ జని యెం,తో నైపుణ్యమునఁ గొన్ని దోసములెవియో
మేనల్లునిపై లేనివి, యే నిజముగ నున్నవని నయించెన్ బెలుచెన్.

వ॥ ఇట్లు బోధించి వెండియు. ౬౪

ఉ॥ మాయిలువాకిళుల్ విడిచి మంచికిఁ జెడ్డకు సిద్ధమౌచు లేఁ
బ్రాయమువానిఁ దన్ జనకుఁ బాసిన యప్పటి నాఁట నుండియున్
బాయక యోమినందులకుఁ బాచితముం బొనరించినాఁడు నే
డోయమ? నీకుమారుఁ డేఁక నుండము కూటికి లేనివాండ్రమే. ౬౫

క॥ తనతండ్రి యేరుఁ దన్నఁడు
గనిదే పాపంబు గాఁగఁ గనకంబును వెం
డిని జేబదు ళ్ళొసఁగి పర,
మునకున్ జనె నదియు దానమో? ఋణ మగునో?. ౬౬

ఉ॥ ఎట్టు వసూలుసేయఁగల మే మని వానికి సారెఁ గోరుటుల్
వట్టి చరింపఁ గర్చులకుఁ బైని వకీళ్ళకు వారియొద్దఁ గ
న్పట్టుక యుండు మంత్రులకు వేలకువేల్ ధనమయ్యె వమ్ము; సొ
మ్మెట్టులు వచ్చు? నాదరు వొకించుక లేక ఋణమ్ము లిచ్చినన్. ౬౭

మ॥ ఎపుడో చట్టము పుట్టు నష్టు లఖిల మ్మాగంగనో ఋ్రింగు నం
చపుడే రైతులు "ఫాయిదా" పెరుఁగుఁ గా కాచట్టమే తీర్పు నిం
కిపు డీతొందర యేటి కంచు నపహారేచ్ఛన్ ఋణం బీఁగ కె
ల్లపొలాలన్ గొనసాఁగి రెట్టికలికాలంబో! విలోకించితే? ౬౮

ఉ॥ అ ప్పడుగంగఁ బోవ మునుపల్లనలేచి వినీతిఁ జూపి యే
చొప్పునఁ జెప్ప వీలగునో? చూచి యటుల్ వచియించువారు నేఁ
డప్పరో? యేమి చెప్పనగు? నయ్యల వైఖరు లెంత కైతవో
చెప్పి పత్రిబంధముల్ శతము సేయఁగ వచ్చుఁ గవుల్ దలంచినన్.

సీ. తాను మంచిగ నుండి తనకొడ్కు కుత్తుచే
శునకంబు నుసికొల్పఁ జూచువారు
"దాఁచిపెట్టినయట్లు దబ్బుదబ్బున వత్తు
వప్పు దానం బౌండె" యనెడివారు
"తిరుగఁ బోకిఁక నీకు దిక్కున్నచోఁ జెప్పి
కొను" మంచు విసుగుతోఁ గొణఁగువారు
"తీరి యెన్నాళ్ళయ్యె నీఋణం బెందుకీ
తప్పాటంకె" లటంచు దెప్పువారు
తే॥ గీ॥ "ఎన్నిసార్లిచ్చినను వడ్డికే జమయని
యెద విఁకేమి యొనర్తువో? గద"యని యొక
సక్కు మాడెడివారునై యొక్కలమ్మఁ
జూపు నధమర్ణుల మొగాలు చూడ వశమె. ౭౦

క॥ చట్ట మ్మెపుడో వచ్చెడి, గుట్టెఱఁగియె యింత వింతగుట్టెడెద రహో!
దట్టులు రైతులు చట్టము, పుట్టుపిదప వీరికడకుఁ బో వశమానే! ౭౧

తే॥ గీ॥ అనుచు నేమేమియో చెప్ప నందుఁ గొంత
సత్యమున్నను జాల నసత్య ముంట
జ్ఞానశీల గ్రహించిన కారణమున
మంతనమ్మున సోదరు మందలించె. ౭౨

ఉ॥ తిందురుగాక మీరలు మదిన్ దురపిల్లుట లేదు దానికిం
కెందుకుఁగాని చెడ్డపను లీర లొనర్చితి రిక్క తాన నా
డెందము గొందలంపడియెడిన్ గొమరుండును దానఁజేసియే
నిందితులంచు మీయెడల నిక్కువ మల్లెనటంచు నెంచెదన్. ౭౩

క॥ గతముగతియించెదానికి, మతిఁజింతిల నేమియగుఁబ్రమాదము లెపుడున్
మతిమంతులకే యీపయి,నితికర్తవ్యముల మెలఁగుఁ డెల్లరు మెచ్చన్.

వ॥ ఇట్లు మోమోటంబుతోఁ బుట్టినిల్లను నభిమానమ్మతో మృదువుగా మందలించుటయు నాతండు తావన్మాత్రమ్మునకుఁ గూడ సహింపక సోదరి కిట్లనియె. ౭౫

ఉ॥ పెద్దతనమ్ము వచ్చుపయిఁ బ్రీతిమెయిన్ మము నాదరించి మా
యెద్దడి బాయఁజేయు నని యే మిలుదాసుల మాచు నీ సుతున్
దద్దయుఁ బేర్మిఁ బెంచితిమి దైవ మెఱుంగును మా శ్రమంబు నే
డిద్దశ మాకుఁ జేకురుటయే ఫలితం బిక నేటి కియ్యెడన్. ౭౬

వ॥ నావుడు జ్ఞానకల సోదరుని గొండొక యాదరించి మీ రెప్పటియట్ల నిట నుండను వచ్చుఁ దినను వచ్చు మేనల్లుండు వ్యవహారంబు స్వయమ్ముగఁ జూచికొను నతనికి బాసటగా నుండి మెలంగునది నే నవ్వానితోఁ జెప్పఁదగునట్టులు చెప్పి యొప్పించెద నని చెప్పి పదంపడి యొకనాఁడు మంతనమ్మునఁ గొమరునితో నిట్లనియె. ౭౭

తే॥ గీ॥ ముక్కువచ్చు లాఱనినాఁడె దిక్కుమాలు
వానిఁగాఁ జేసి నీ తండ్రి స్వర్గమేగె
మీఁద నీ యెల్ల సంసార మీఁదినారు
నాదు సోదరు లెట్లొ యీ నాఁటి దనుక. ౭౮

క॥ తప్పిదములు లేవని నేఁ, జెప్పఁగఁబో నుండుఁగాక చెవిఁ బెట్టకు మీ
వప్పను లేవియు వారల, నెప్పటికిం బేర్మిఁజూడుమీ నను బోలెన్.

వ॥ అను తల్లివచనంబుల నాదరించి తిరువంకాడరు వారల నేమియు ననక యుపేక్షించి గురువరు నాదేశం బనుల్లంఘనీయం బగుటం జేసి తన వ్యాపారమ్ము తాన చూచికొనుచుండె మేనమామ లసూయాపరవశులై కొన్ని చిక్కులు గల్పించుచుండిసను వాని నెల్లఁ దన ఋజుప్రవర్తనమువలనను దైవసాహాయ్యము వలనను జక్కఁజేసికొనుచుఁ బ్రబలం దొడంగె. ౮౦

ఉ॥ పట్టినదెల్ల బంగరయి వర్తకసంఘము మెచ్చునట్టు లా
దట్టుఁడు వర్తకమ్మునెడ దక్షతమై యశమ్ముఁ గడించె నె
వ్వట్టున దేశికోత్తముని భావమునందు దలంచుఁ గాని తా
నెట్టనఁ జూడ నేగఁడు మనీషి యతం డటు లాజ్ఞ నీయమిన్. ౮౧

శా॥ నేనే వచ్చెద నెప్పుడో వలదు నన్నీవారయన్ వల్వ దం
చానాఁ డాడినమాట చొప్పున నుపాధ్యాయున్ గనం బోక త
ద్ధ్యానమ్మున్ మది నెప్పుడున్ నలుపుచున్ దద్దర్శనేచ్ఛావశుం
డై నీతిజ్ఞుఁడు స్వీయవృత్తి యెడ నిత్యవ్యాపృతుం డుండగన్ ౮౨

సీ॥ ఇతరదేశమునుండి యేతెంచి మాటాడు
వర్తకాగ్రిణు లొక్కవంక నలర
నెగుమతి పూర్తియయ్యెను బ్రియాణంబెప్పు
డోడకం చడుగు వా రొకటఁ జెలఁగ
దిగుమతి యైనట్టి దినుసెక్కడికిఁ జేర్తు
మో యటంచడుగు వా రొకట వఱల
నాయూయి లెక్కల నావంత తీరక
వ్రాయు వారలు చుట్టువారియుండ

తే॥ గీ॥ శిష్యు నభివృద్ధిఁ గనఁగ వాంఛించి విష్ణు
పురమునుండి కృష్ణానంద గురు డతర్కి
తోపపన్నంబుగా వచ్చె నులికిపడి యె
దురుగఁ జని శివనేశు కొమరుఁడు మ్రొక్కె. ౮౩

వ॥ అట్లు మ్రొక్కి పూజించి యుచితాసనంబున సుఖాసీనుం గావించి బద్ధాంజలిపుటుండై. ౮౪

క॥ ఇదియంతయు గురువర్యుల, పదసేవాఫల మనుచు సభం జూపిన స
మ్మదమునఁ గృష్ణానందుం;డుదయద్యశుశిష్యుఁజూచియుప్పొంగెనెదన్.

వ॥ అట్లు లుపాంగు గురువర్యు నగ్రింబున వినయవినమితుండై పట్ట
ణత్తా రిట్లు విన్నవించె. ౮౬

ఉ॥ ఆదిని మీారు వర్తకమునందుఁ బ్రివర్తిలు మంచుఁ జెప్ప నే
నేదియొ బండ నెత్తి నిడుటే యిది యంచుఁ దలంకితిన్ భవ
త్పాదము లాన నా కిపుడు తద్గతమర్మములెల్ల గోచరం
బై దయివాతె నోజ్జలదయన్ సకలమ్ము సుసాధ మయ్యెడిన్. ౮౭

చ॥ జనకు ననంతరమ్మునఁ బొసంగిన లోపములెల్లఁ దీరె మ
జ్జనని సహోదరుల్ కృషిని సర్వము నాపయిఁ బెట్టి రల్లవా
రి నికృతులం బొనర్చినఁ బొరింబొరిఁ దల్లి కృశించు నంచు "నే
మిని బొనరింపకుండుఁ డిట మీా"రని వారికిఁ జెప్పి నిల్పితిన్. ౮౮

శా॥ అప్పుల్ వా రొనరించినట్టి వొకయావంతేని శేషించ న
ట్లొప్పన్ దీర్చితి నిచ్చినట్టిఋణ మే యొక్కింతయో తక్క నే
తప్పన్ దారులు ద్రొక్క కే యిడిరి తత్తద్వర్తకుల్ మీాకృపన్
ముప్పొత్తుల్ దొలఁగెన్ గురూత్తముల యామోదమ్ము నార్జించితిన్

చ॥ స్వయముగఁ జూచికొంటకును వర్తక మన్యులు చూచుదాని క
న్వయ మది యెట్టులుండెడినొ? నామది కిప్పుడు తట్టె మీాకృపన్
భయ మఖిలమ్ము దీరె భగవంతుని నెమ్మది నమ్మి వత్సర
ద్వయమున నుండి వర్తకపథమ్మున వర్తిలుచుంటి దంటనై. ౯౦

క॥ ఏదారి నేను ద్రొక్కిన, నాదారిని లాభమబ్బు నది సర్వము మీా
పాదరజోమాహాత్మ్యము,గాఁదగు నద్దాని శక్తి గాంచఁ దరంబే. ౯౧

క॥ దానమ్ములు ధర్మమ్ము ల, నూనమ్ముగ సల్పుచుంటి నొకటన్ మఱపుం
బూనక పరమేశ్వరుని, న్మానసమున నిల్పి పూజనము లొనరింతున్

వ॥ ఇట్లు సంతోషపూర్వమ్ముగ విన్నవించు ప్రియశిష్యుని యథార్థోక్తు
లయం దంతర్లీనమ్మగు గర్వలేశమ్ము నపనయింప నెంచి గురుదేవుం
డిట్లనియె. ౯౩

క॥ సంతోషించితి నీస్థితి, నంతర్వాణిప్రికాండు లభినందింపన్
గొంతవినియుంటి జనకుని, యంత యశము నేకరింతు వచిరమ్మునసే.

క॥ "ఒకకలతోఁ దెలవాఱునె!"
సకలము జీవితము యుక్తసరణిఁ గడచిన
ప్రుకదా ? కృతార్థుఁ డని యె
న్నికకున్ బురుషుండు వచ్చి నెగడున్ మిగులన్. ౯౫

చ॥ ఎఱుఁగుదు నీదుజాతక మహీనము సర్వము నిర్వహింతు వె
ల్లరు నిను మెచ్చునట్టులుగ లాఁతివిలాతుల కేగి వర్తకం
బరుదుగఁ జేసి ద్రవ్యము ననంతముగా గడియింతు నిన్ను నీ
శ్వరుఁడు ప్రసన్నుఁడై మనుచు సర్వవిధాల జయమ్ము నీకగున్.

ఉ॥ కాని ధనమ్ముకన్న నుపకారకమైనది లేనియట్లె లో
కాన ధనంబుకన్న నపకారక మైనదిగూడ లేదు వి
జ్ఞానికి సైత మియ్యది వికారములం గలిగించు మద్యపుం
బానమువంటిదే ధనసమన్వితి, పెక్కులు సెప్ప నేటికిన్. ౯౭

మ॥ ధనవంతుల్ సుఖియండ్రు లోకులు యథార్థం బైన నౌఁగాక ని
ర్ధనుకన్నన్ ధని కుండుఁ గష్టములు విస్తారమ్ముగా; దొంగలు చో
రనికాయంబును యాచకుల్ సతత మర్థం బెట్టులోఁ బీల్చు ని
చ్చను వేధింతురు ద్రవ్యవంతునకుఁ గష్టం బెట్టిదో! చూచితే!

క॥ కొండలలోపలఁ గాపుర, ముండిన ధనవంతునేని నొగి యాచింపం
దండంబులుగాయాచక,మండలములు చుట్టుముట్టిమఱిమఱికలఁచున్

తే॥ గీ॥ ఎంత శాంతునికేనియు నీ జనంబు
కోపమును బుట్టఁజేసెడిఁ గుజను లుండ్రు
వీండ్రలోఁ జెప్పనేల! పెక్కుండ్రు వాండ్రు
కొనఁగుట ద్రోసం గొసంగక యురక చనరు. ౧౦౦

వ॥ అపాత్రదాన మ్మొభయలోకమ్ములకుఁగూడ ననుకూలింపనిదే యని
వక్కాణింప నక్కఱలేదు. మెలఁకువ గలిగి వర్తించునది నన్నుం
జూడ నీ కెప్పు డిచ్చ వొడము నప్పుడ వచ్చునది యని కృష్ణానంద
గురువరుం డరిగె. ౧౦౧

క॥ పదపడి వంకాడరు ని
ర్మదుఁడై సదసద్వివేకమర్మ మెఱిఁగి సం
పద కనుగుణముగ మెలఁగం
గఁ దొడఁగె నటులేని యెట్లొ గర్వము వొడమున్. ౧౦౨

క॥ తలిదండ్రులున్న సంతతి, వెలయున్ గారణముకల్మి వృథగాదుధనం
బులు గలుగుచోట గర్వం, బలమక యెటుదక్కు దాని నాఁగఁదరంబే.

చ॥ ధనము మదంబు వెంచుఁ దనుదార్ఢ్యము దుర్బలులన్ గలంచు నే
ర్చిన ఘనవిద్య వాదములు సేయుటకుం బురికొల్పు నీచవ
ర్తనుల, కివే మహాత్ములకుఁ ద్యాగము సజ్జనరక్షణంబుఁ జి
జ్జననము సంఘటించి పరసాధకమై పొలుపొందు నెమ్మియిన్. ౧౦౪

క॥ అని పెద్దలు వచియించిన, దనృత మనఁగరాదుగాని యైశ్వర్యము గ
ల్గినకొలఁది గర్వమేరికి, జనియించునొ కానఁబడు రసాస్థలి నెందున్.

క॥ తిరువంకాడరు స్వయముగఁ
బరమోత్తముఁ డట్టి గురుని పదములు వట్టన్
గరువము దరిఁ జేర్పకు మని
గురుఁ డానతి యిచ్చె నింకఁ గొదవయుఁ గలదే ? ౧౦౬

క॥ ఇవియన్నియు నేమయ్యెనొ, శివుమాయఁ దరింప నెట్టి శిష్టులకేనిన్
భువిశక్యమె? వంకాడరు, సవిధమునకు గరువ మరిగి చన వార్జించెన్.

క॥ అతిగాఁ జేరిరి ముఖసం, స్తుతిపాఠకు, లల్లవారి స్తుతులు మనమునం
గుతుకమును బెనిచి గురునా, జ్ఞతమగు సద్బోధ లెటకొ చేరె మాటన్.

క॥ తనతోఁ దుల్యులు లేరని, తనయెడ భగవంతు దయ యధనమని తన వ
ర్తన మొజ్జబంతియనియిటు, మనమున గరువంబు హెచ్చి మఱపించె గురున్.

వ॥ అట్లు కొండొకమఱపు దగిలినను బూర్తిగా మఱపు దగులమిం జేసి.

ఆ॥ వె॥ ఇట్లు కొంతకాల మేగిన పిమ్మట
గురుని దర్శనమునఁ గోర్కి పుట్టి
విష్ణుపురముకడకు విచ్చేసె శివనేశు
కొడుకు, గురుఁడు గాంచి కుతుకమందె. ౧౧౧

వ॥ సర్వజ్ఞుండగు నమ్మహామహుండు శిష్యుని మనోవికారం బతనిం
జూడకమున్న యెఱుంగుటంజేసి తద్దోషం బపనయింపం దలంచి
యక్కార్యంబున కుపోద్ఘాతంబుగా శిష్యు నిట్లు భాషింపఁ దొడంగె.

మ॥ వినుచుంటిన్ భవదీయయోగ్యతలఁ; నీ విశ్వంబున న్నిన్నుఁ బో
లినవైశ్యుల్ గడు మృగ్యు, లెందు ధనికుల్ లేకుండిరే? దాతృతా
ఘనులై బీదల నిట్లు సాఁకుటగదా? కల్మిన్ గడున్ సార్థకం
బనిపించు న్నినుఁ జెప్పి చెప్పఁదగునే? అన్యున్ మహోదారుఁగన్.

క॥ నీవంటివానిఁ గాంచుట, చే వంశమ్మునకు యశము చేకుఱె మాతృ
శ్రీ వర్ధిలె జనకుఁడుఁ బితృ, దేవతలుఁ దరించి కనిరి తృప్తిన్ దీప్తిన్.

వ॥ ఇట్లు శిష్యుని యంతరంగంబు నరయం దలంచి గురువరుం డొనర్చు
ముఖస్తుతికి నంగీకారసూచకంబుగ శిష్యుండు వర్తించుటయు మరల
గురుండు. ౧౧౫

క॥ గుడిగోపురమ్మునందుం, డెడి బొమ్మలఁ జూచినావె? నీ వందు నొకం
డిడికొని తద్భారము తలఁ, గడుబడలుచు నున్నయట్లు కనుపడుఁగంటే?

క॥ గోపురము నది వహించెనొ?, గోపురమే దాని మోసికొఁ గల్గెనొ? నీ
వోపికనుముమఱియొకపరిఁ, దోఁపఁగనొ రెంట నేది ధూర్వాహకమో?

ఆ॥ వె॥ అప్పు డపుడు మనమునందు విమర్శంబు
సేయుచుండవలయు శ్రేయ మిచ్చ
గించు మానవుఁడు; ప్రకృతికి మించినగురుం
డంచు లేఁడు తెలియుమయ్య? యిదియు. ౧౧౮

క॥ గురు వెంతవఱకుఁ జెప్పెడిఁ!
బరిమితముగనే వచించుఁ బ్రాజ్ఞుఁడు ప్రకృతిన్
గురునిగఁ బెట్టుక తక్కువి
వరముల నెఱుఁగంగవలె దివారాత్రమ్ముల్. ౧౧౯

క॥ ఆకసమునందు రిక్కల, నేక మ్మున్నయవి వాని నెవఁడు భరించున్
లోకోత్తరమహిమాన్వితుఁ, డే కలఁడందఱకు దేవుఁడితరు లలంతుల్.

తే॥ గీ॥ అందఱిని భరియించెడి దాదిశక్తి
ఆపెకుఁ ద్రిమూర్తులును భృత్యు లని యెఱుఁగుము
ఆపె యని యాతఁడని కూడ నమ్మహోప
దార్థమును వాడుదురు లింగ మనవసరము. ౧౨౧

తే॥ గీ॥ గర్భమున నున్న నీ కశ్మగర్భగతము
కప్పకును గన్నులకు రూపు గానరాని
సూక్ష్మజంతుల కెవ్వఁ డిచ్చునో? తిండి
అరసితివె యెన్నఁడేని హృదంతరమున. ౧౨౨

చ॥ మన మెదొ యద్ద మత్స్యుల కమర్చినఁ గన్పడు జీవజాలముల్
కొని గల వల్లవాని కల కొంచెములోననె కొంచియుమ్మగాఁ
గను ముకు లోనుగా నిమిడికన్ విలసిల్లెడిఁ బ్రీతి భీతియుక్
గను నవి, వానికిం గలవు కర్మము లీ మన కెట్టు లట్టులే. ౧౨౩

తే॥ గీ॥ అణువుకన్నను నణు వని యాత్మగుఱిచి
శ్రుతి వచించిన దెందు కీ సూక్ష్మజంతు

జాలమందును దత్సత్త సంగతంబు
గావుటకె ఆత్మ నెఱిఁగిన గర్వ ముడుగు. ౧౨౪

తే॥ గీ॥ బ్రహ్మ మొదలు పిపీలికవఱకు నొక్క-
విధమ సంసారవిభ్రాంతి; విబుధుఁ డెఱిఁగి
గర్వపడక తా నొక కీటకంబ ననుచు
మెలఁగవలయును మిక్కిలి మెలఁకువగను. ౧౨౫

వ॥ ఇట్లు సవిమర్శంబుగ బోధించుటయుఁ దిరువంకాడరు తదభిప్రాయంబు గుఱితించి తన యజ్ఞానంబునకు వగచి సగద్గదకంఠుండై యథార్థం బొప్పికొని యయ్యది ధనోన్మత్తతచేఁ గల్గిన ప్రమాదంబని క్షమాపణంబు వేడికొనుటయు గురుం డాదరించి కొండొక కాలమ్ము తన యాశ్రమమ్మునందె యుండ నియమించె మహాప్రసాదం బని యతఁ డక్కడన వసించుచు నొక్కనాఁ డంతకుమునుపు తనతోపాటు గురుకులవాస మ్మొనర్చు గోవిందుం డను శిష్యుండు జ్ఞప్తికి వచ్చి గురువు నిట్లు ప్రశ్నించె. ౧౨౬

క॥ స్వామీ! గోవిందుఁడు కడు, మీమదికి నచ్చినట్టి మేటిగదా? యి
ప్డేమయ్యెనతఁడు?కనుపడఁ, డేమి! యెచటి కేగెఁ దెల్పుఁడీ! దయకల్మిన్.

వ॥ అనియిట్లు. ౧౨౭

ఉ॥ వేడినయంత సద్గురుఁడు విద్దియుకై చనుదెంచునట్టివాఁ
డేఁడును బెద్దకాల మొకచోకడ నిల్వఁడు చాలమంది వె
న్నాడి చరించి జ్ఞానఖను లౌదురు పల్వురు వాఁడు నట్టులే
యేడకొ విద్యకై చనియె నిచ్చటివిద్దియ నచ్చకుంటచే. ౧౨౮

క॥ ప్రాపంచికవిషయమ్ముల
నే పలువురు విద్యలను మనీషఁ జదువువా

రాపరమాత్మను గుఱించిన
దే పురుషుఁడో తెలిసికొనుట కిచ్ఛం గొలుపున్. ౧౩౦

వ॥ వాఁడు తర్కవ్యాకరణాదు లభ్యసించు తలఁపుగలవాఁడు గావునఁ దదర్థ మిమ్మెక్కడ సంఘటింపదని యరిగియుండు ననుటయుఁ దిరువంకాడరు నొచ్చుకొని యిట్లను. ౧౩౧

క॥ సుతుకన్న నెక్కుడుగ మ్మెచ్చితి రా గోవిందు నట్టిశిష్యుండు వృథా
మతిచెడి యెటకోచనుటకు,నతిగాఁజింతింతు నెంత యవివేక మహో.

వ॥ అని మఱియు నిట్లనె.

క॥ తమకడ నెపు డేదియుఁబో, త్తము కన్పడ దేరి కేని దత్త్వము పోడివా
క్యములను జెప్పెద రేపో, త్తములన్ గల సారమిదియుఁ దత్త్వజ్ఞనిధీ!

వ॥ నావుడుఁ గృష్ణానందుం డిట్లను భద్రా! యెవ రేది బోధించినను నయ్యది వేదాంతర్గతమకాని స్వకపోలకల్పితముకాదని యెఱుఁగునది. సకలవేదము నెఱింగిన వారు ఋషులలోఁగూడ విశేషించి లేరనియె భరద్వాజునికిని బ్రహ్మకును సంబంధించిన యితిహాసంబువలన స్ఫుట మయ్యెడిని. ప్రత్యక్షముగా శ్రుతమగుచున్న వేదము కడుంగడుస్వల్పము. తక్కినది ఖిలసంహిత యందురు. మన్వాదులు ఖిలసంహిత యందలి యంశములనుగూడ ననువదించుటంజేసియే కొన్నిచోట్లఁ బ్రత్యక్షశ్రుతులతో స్మృతుల కేకవాక్యతసిద్ధించదని వెండియు.

చ॥ గురులను గొల్చి వేదమును గొండొక శాస్త్రము నభ్యసించినన్
వఱలదు తత్త్వవిత్త్వ; మది వాద మొనర్చుట "లక్కిలిక్కి" యం
చఱచుట యింతియే ఫల మటంచు మనంబునఁ దోఁపఁ జేయుచున్
గరువముగూడఁ బెంచు మొనగాఁ డనిపించి కలంచు మానిసిన్.

వ॥ కావునఁ దత్త్వాభిలాషు లగువా రట్టి బెడఁద పెట్టుకొనక సద్గురూపదేశమ్ముఁ గతనఁ గృతార్థులు గావలయు నని వెండియు. ౧౩౨

తే॥ గీ॥ మంచిశిష్యుండు దొరకఁడు మంచిగురుఁడు
నట్లె దొరకఁడు మిత్త్రుఁడు నట్లె యెఱుఁగు
మిట్టి సంబంధమునకు నే వేనియును బు
రాకృతము లుండు నవి కానరావు మనకు. ౧౨౮

క॥ నీ నా సంబంధ మ్మా, శాన ప్రేరితము దీనిసౌరభ మిట్లే
జానుగ నుండెడి జంకుఁ, బూనకు మలవానికిబలెఁ బోఁగలదంచున్.

వ॥ ఇ ట్లభయమిచ్చి యాదరించుటయుఁ దిరువంకాడను తదాశ్ర
మమ్మునఁ దన వ్యాపారాదులు స్మరింపక కొన్ని మాసమ్ములు
సుఖంబుండె నట్టు లుండునెడల నొక్కనాఁ డాశ్రమారామస్థమ్మగు
నొక చెట్టునీడ నొక్కఁడును బన్నుండి యేదియో దీర్ఘాలోచన
మ్మొనర్చుచుండ యాదృచ్ఛికమ్ముగ గురువరుం డట కేతెంచు
టయు ససంభ్రమమ్ముగ లేచి నిల్వంబడి మ్రొక్కె నంతట
గురువరుండు. ౧౩౦

తే॥ గీ॥ ఏమి యోజించుచుంటివి గృహము జ్ఞప్తిఁ
దవిలెనో? లేక నీదువర్తకము జ్ఞప్తిఁ
దవిలెనో? శివకల జ్ఞప్తిఁ దవిలెనొక్కొ?
లేక పరశక్తి యందు విలీనమైతొ. ౧౩౧

వ॥ నావుడుఁ బట్టణత్తారు నెలవెల్లనై గురున కిట్లనియె. ౧౩౨

శా॥ స్వామీ! యేమియు లేదు నెమ్మది పరాశక్తిస్థముం గాదు మా
గ్రామమ్మున్ గృహమున్ బొరింబొరి వణిగ్వ్యాపారమున్ జ్ఞప్తికిన్
రా మీతో మనవిం బొనర్చునెడ నేరంబౌనొకో? యేమొ? యం
చీమాడ్కిన్ బ్రతివత్తిశూన్యమతినై యేమేమొ యోజించెదన్.

మ॥ ఒకవ్యాపారము గాదు సామి! మఱియెన్నో వ్యాపృతుల్ నాదువ
ర్తకమం దున్నవి చూచుకోనియెడ నస్తవ్యస్తమై పోవు సా

మ్ముకడన్ దల్లిని గొడ్డు నమ్మఁదగ, దేమో! సొమ్ము పాపిష్ఠ మే
రికి దుర్బుద్ధి జనింపఁజేయు నని యుద్రేకించె నాలోచనల్. ౧౪౪

క॥ రతనాలవర్తకము గల, దితరమ్ములకన్న దీనియెడఁ గడు శ్రద్ధా
న్వితి వలయు లేనిచో నిది,సుతరామును సాఁగ దెంతశోధకుఁడేనిన్

క॥ "ఆనుంబాను" నెఱింగిన,మానిసు లున్నారు వారు మార్చి యొహోత
త్థానమునఁ బెట్టుచో నెం,తో నష్టిఘటించు నెదియుఁదోఁపదు నాకున్

క॥ అని యిట్లు తనమనంబునఁ, బెనఁగొను నాలోచనముల పెంపువచింప
న్విని కృష్ణానందుఁడు శిష్యున కిట్లను బేర్మి యెంతయును దనరారన్

శా॥ నీవాణిజ్యమునందు నుండుసిలుగుల్ నే విందు వాకుత్తువే?
నే విన్పిమ్మటఁ జెప్పఁగాఁ దగిన వేవే నున్నచోఁ జక్కఁగా
భావార్థముగా వచింతు నన నీవాణిజ్యపున్మర్మ మే
మో! విడ్డూరము గాఁగఁ దోఁచు నెటు నే నోలిన్ వచింతున్ గుహూ!

చ॥ సుకముగ నుండు మీమదికి క్షోభ జనించును విన్నమాత్ర వ
ర్తకపు హళాహళుల్; శతవిధమ్ముల నుండెడి మర్మకర్మముల్
ప్రకటన మెట్లొనర్తు గురువర్యులసన్నిధి నోట దక్కి; యీ
తికమక లందు నెన్నఁటికి దేవరచిత్తము వ్రాలకుండుతన్. ౧౪౫

చ॥ బకములపోల్కి నియ్యెడల వర్తిలఁగావలె నెప్పుడుం ద్రియం
బకపదపద్మయుగ్మము నుపాస్తి యొనర్చెడి మిమ్మువంటి పా
వకులకు దీనిలోఁ బడెడిపాటు లెటుల్ రుచియించు? దీని కొ
ప్పక భయమందు నన్ను గురువర్యులె దింపితి రిందు దేవరా!

క॥ దిగినపుడుదాననెట్లు మె, లఁగవలెనో! అట్టులేమెలఁగకుండినచో
నగుఁబాటగుననియట్లు మె, లఁగుచుంటిన్ దవ్వుగాఁదొలఁగియఘములకున్

తే॥ గీ॥ అప్పటికి నేదియేనియు నఘ మవశమ
ధ్యై తటస్థింప ననుతాప మంది దేవ
దేవుతో విన్నవింతు నో దేవదేవ!,
తప్పొనర్చితి నని వేఱుదారి లేక. ౧౫౨

తే॥ గీ॥ ఎంత మడిగట్టుకొన్నవాఁ డేని దీనఁ
గొంచెమో? గొప్పయో? సంఘటించి తీరు
నాత్మవంచన; మద్దానికన్న నెక్కు
డైన యఘ మొక్కఁడున్నె విజ్ఞానధుర్య? ౧౫౩

తే॥ గీ॥ తండులార్థి పలాలమ్ము దాఁకకుండ
నెట్లు కాలేఁడో? కృతకృత్యుఁ డట్లె కొన్ని
యంశములు వర్తకమ్మునం దావరించి
యుండు నప్పట్టునఁ దొలంగి యుండు నెట్లు. ౧౫౪

క॥ ధనమూలము వాణిజ్యము,ధన మరిషడ్వర్గమునకుఁ దావలమని యొ
ప్పని ఫిర్యాదెవ్వి?రేమని, మనవి యొనర్పంగలాఁడ మద్దుఃఖమ్ముల్.

వ॥ ఇట్లు తటపటాయించు శిష్యునకు నిర్వ్యాజకృపాభాసురుండు గురు
వరుం డిట్లనియె. ౧౫౬

ఉ॥ బూది మొగాన మెత్తికొని ముక్కు దగం బిగఁబట్టి వార్చు నీ
వైదికుఁడేఁడ? వర్తకపువర్తన లేఁడ? వచించినన్ దదా
స్వాదన మిందునే? యనెడి భావమునన్ వచియింపకుంటి వం
చేఁ దలతున్ యథార్థ మిదియే యగు నైనను జెప్పు చూచెదన్.

మ॥ తిరువంకాడరు స్వాత్మతత్త్వ మిటు నిర్దేశించు నొజ్జన్ సుమ
స్శర తీక్ష్ణప్రతిభానిధిన్ విదితవిశ్వప్రాకృతాచారు సా
దర భక్తిన్ బ్రణమిల్లి "దేవ! కృప నాతప్పున్ క్షమింపన్ వలెన్
పొరఁబాటెయ్యది గర్వినై సలిపితిన్ మోసంబెటుల్ బొంకుదున్.

వ॥ అని యథార్థం బొప్పికొన్న శిష్యునకు గురుం డిట్లను. ౧౫౯

మ॥ ఇట నున్నప్పుడు పారమార్థికమునందే బుద్ధి గీల్కొల్పి యా
డట వ్యాసంగ మొనర్పు మింటికడఁ దత్తద్వ్యాపృతిన్ జిత్త ము
ద్ఘటితంబుం బొనరించి వర్తిలుము చింతన్ సుంతయు న్వీని రెం
డిటి నానింపకు మట్లొనర్చునెడలన్ రెండున్ బొకాలున్ జుమీ.

ఉ॥ ఏకృతి సేయుచున్న నదియే యెదుట న్నటియింపఁగా వలెన్
బ్రాఁకి మనంబునందు వచనమ్ములయందును గాయమందు వే
ఱొకృతి కీయకొన్న యపు డండె త్రిశుద్ధిగ నుండుటొప్ప వాఁ
డే కృతి; యన్యుఁడో? చెడెడి నిందుకు నందుకుఁ గాక లేకిమై. ౧౬౧

ఉ॥ అంతియకాని వర్తకమునందుఁ జరించెడి కాలమందు వే
దాంతము, తత్త్వవిత్త్వసమయమ్మున యందును వర్తకమ్ముఁ గా
వింతువయేని యయ్యది వివేకపథం బనిపించుకోదు నీ
కింత యెఱుంగఁ జెప్పితి నిఁకేని యిటుల్ చరియింపు నేర్పుమై.

వ॥ ఇట్లుపదేశించు గురునివచనంబులు మహాప్రసాదంబని గ్రహించి మఱికొన్నిదినమ్ము లాశ్రమమ్మునందె యుండి గురువకు నానతిం గొని స్వపురమ్మున కరిగి విపులమ్ముగా వాణిజ్యంబు సాఁగించుచుఁ "బట్టినదెల్ల బంగారమ్మును ముట్టినదెల్ల ముత్తెమును"గా సుఖంబుండునంత. ౧౬౩

క॥ 'తిరువళమళదూరు'న న, త్తరుణంబున శైవభక్తితత్పరుఁడు గుణో
త్తరుఁడు శివశర్మయనుభూ, సురవరుఁ డొకఁడుండెసకలసూరినుతుండై.

తే॥ గీ॥ ఆతఁడు మహేశ్వరప్రీతికై సతంబు
తనదు సర్వస్వము వ్యయించి దానికతన
రిక్తుఁడయ్యె నెట్టులొ శివభక్తులకును
భక్త మిడి గాని తాను సాపడఁడు దినము. ౧౬౫

క॥ అసిధారావ్రతముగ నిట్లు సమారాధనము భక్తలోకము మెచ్చన్
వసుధామరుండొనర్చుచు,నసిగా జీవితము గడపు సమయమునందున్.

క॥ విషమాంబకరిపుఁడగున,వ్విషమాంబకుఁ డీశుఁడొకటఁ బృథ్వీసురునిన్
విషమగతిఁ బరీక్షింపం, గ షణ్ముఖునితండ్రి వృద్ధగతిఁగనయ్యెన్.

వ॥ అట్లు రథ్యామధ్యంబున నడుగామడగా నడచుచుఁగనన్నై. ౧౬౮

ఉ॥ ప్రాణము వోవుచున్నయది బ్రాహ్మణవృద్ధుఁడ దాళఁజాల సం
త్రాణపరాయణుం డొకఁడు దారిని బోయెడివారిలో దరి
ద్రాణకృపాళుఁడే కఱవె! ధాత యనాథులపట్ల నింత ని
ద్రాణుఁడె? పుట్టజేసినయతం డిటు లాఁకట మాడ్చి చంపునే? ౧౬౯

క॥ ఏ కులము ప్రాణికేనియు,నాఁకటఁ జానున్నయప్పు డన్నం బిడుచున్
సాఁకినదయామయుల కీ,లోక మ్మాలోకమును గలుగు సుఖదంబై.

వ॥ అని నలుదెసలు పరికించి ప్రాణము చాలివచ్చుట నటించుచుఁ గేల నున్న దండ మ్మూఁతమ్మగా వీథిప్రక్క నిలువలేని చందంబున నిలువంబడి యుసురుస్సు రని నిట్టూర్పు నించి యొక గేస్తు నింటి వేదికకుం జేరి యట గోడ నానికొని పరుండి వెండియుఁ బట్టరాని కోపమ్ము నటించుచు.

ఉ॥ ఎందుకుఁ బుట్టఁ జేయవలె నింత యకించనుఁ డెవ్వ డేడ్చెఁ గ
న్నందు కెఱుంగఁడా? యెవని కన్నమొ? దప్పియొ! యేది లోటొ? యం
చుం దెగి తిట్టు నమ్ముసలి శుద్ధ దరిద్ర ధరాసురున్ సమా
క్రందనవక్త్రుఁ గాంచి కృప గ్రమ్మిన చిత్తముతోడ శర్మయున్.

క॥ అయ్యా! మహానుభావా!, చయ్యన మాయింటికడకుఁ జనుదెమ్ము వృథా
కుయ్యిడఁగ నేల? నాపై, నెయ్యముగనఁ జేయుమనఘ! నేఁడు సుదినమౌ.

వ॥ అల్లదియే మా యిల్లని కరసంజ్ఞన్ జూపించి యరుగ నుంకించుటయు నమ్ముదుకండు. ౧౭౪

తే॥ గీ॥ పెట్టఁ దలచిన నిక్కడఁ బెట్టు దెచ్చి
ఒక్కడుగు వేయుటకుఁ గూడ నోప నింక
నడు గిడెడి శక్తియే యున్నఁ బిడికెఁ డన్న
మునకు విలపింతునే? పుట్టి మునిఁగి నట్లు. ౧౪౬

క॥ ఏసత్రమ్మున కేగ దు, రాసదముగు ముష్టికూడు; ప్రాణము కడు నా
యాసపడిబడలుకతనఁబ, రాసుత ఘటియించునేమొ?యనివిలపింతున్

తే॥ గీ॥ దిక్కు మాలిన ప్రాణమ్ము దీనికొఱకు
వృద్ధునకు నాకు నింతటి వెఱపదేమొ?
"కలిని బ్రాణమ్ము లన్నసంగతము" లనుట
ధ్రువ మనుచు నాకుఁ బూర్తిగాఁ దోఁచె నిపుడు. ౧౪౭

క॥ అసలు పరాన్నము గుడుచుట,
దోసఁగులలోఁ బెద్దదోసఁగు; దురవస్థమెయిన్
మెసవుట తప్పక పాపపు
టసువులకై యిట్టు లంగలార్పఁగవలసెన్. ౧౪౮

వ॥ నాకు మిక్కిలిగా నీతో మాటలాడుటకు నోపిక లేకున్నయది నాలుక తడియాఱుచున్నయది యిఁక మాటలాడఁ జాలను. వారువీరుఁజూచెద రను నెగ్గుతో నా కిప్పు డావశ్యకత లేశమును లేదు "ఆపత్కాలే నాఽస్తి మర్యాదా" యనుట యెఱుఁగవే? యని విసువుతో మఱియును." ౧౪౯

తే॥ గీ॥ పెట్టఁగల్గితివా? తెచ్చిపెట్టు మిచటఁ
బెట్ట లేకున్న నీదారి నట్టె పొమ్ము
పోవుఁగాక ప్రాణ మిపుడు పోకయున్న
నెప్పుడో పోవుఁగద! అది యిపుడె పోవు. ౧౫౦

ఉ॥ నాదగు వాలకమ్ము కనినాఁడవు కన్నులనిండ; నింటికిన్
రాఁదగునంచుఁ బిల్చెదవు "ప్రాణవిభుండు సజీవుఁడేని నా
కీ దిగులేల విస్తరి నెటేనియుఁ గుట్టియె పెట్టు" నన్నటుల్
గాదొకో? యీవిధమ్ము వృథగా నిటు లుందునె? కాలుసాఁగుచో.

తే॥ గీ॥ ఇట్లు వల్కెడి బ్రాహ్మణు నట్టె యిచట
నుండుము మహాత్మ! యిచటికే యోగిరంబు
దెత్తు వేగిర మని యేగి తెచ్చి యరఁటి
యాకునందు వడ్డించె సుశ్లోకుఁ డతఁడు. ౧౫౨

తే॥ గీ॥ ఎంత వడ్డించె నంతయు నింతలోనఁ
దిని యెదురు చూడఁదొడఁగె న ద్దేవమూర్తి
మరల మరల నింటికిఁ జని తిరిగి తిరిగి
శ్రద్ధమై వడ్డనయు శివశర్మ చేసె. ౧౫౩

వ॥ అట్లనేకవారమ్ము లరిగి శివశర్మ వడ్డింప నారగింపందొడంగె. ౧౫౪

మ॥ తనగేహమ్మునెడన్ మహేశ్వరులసంతర్పింపఁగా నాఁడు వం
డిన యవ్వంటకమెల్ల భక్ష్యములతో నిండారు భోజ్యాలతో
ఘనుఁ డా భూసురుఁ డారగించి పొరి నాకంతంబుఁ దేన్చెన్ మతే
మిని దేవల్వదటంచుఁ జెప్పినటులై మిన్నందె నాశర్మయున్. ౧౫౫

తే॥ గీ॥ అంతలో భార్య కబురంపె నతిథులింట
వేచియున్నా రటంచు నిర్విణ్ణుఁ డగుచుఁ
జనియె శివశర్మ చన లేక చనఁగలేక
అతిథిపూజకు నింట ద్రవ్యంబు లేమి. ౧౫౬

చ॥ చని మొనలేనిచింత యను సాగరమందు మునింగి యాఁకటన్
మునుఁగు మహేశులన్ గనఁగ మో మిసుమంతయుఁ జెల్ల కంగనా

జనమణియౌ సుశీలఁగని సాధ్వి యెటుల్ వ్రతదీక్ష నేఁ డనన్
మనమలరన్ సుశీల తన మంగళసూత్ర మొసంగె భర్తకున్. ౧౮౭

వ॥ మహేశ్వరులకు సాష్టాంగం బెఱఁగి యించుక యాలస్యమ్మునకు క్షమింపవలయు నని యుపచారంబు విన్నవించి వారల యంగీకృతిని సంపాదించుకొని. ౧౮౮

తే॥ గీ॥ వెంటనే యంగడికిఁ జని వంట కనుగు
ణంబగు పదార్థములు దెచ్చి నాఁటిగండ
మును దరించెను శివశర్మ యనఘులైన
యతిథులకు నాతిథేయమర్యాద నెఱపి. ౧౮౯

చ॥ "ఒకకల గన్నమాత్రన యినోదయమౌట" యెటుల్ ఘటించు నాఁ
టి కతిథిపూజ దైవము కడిందికృప న్నెఱవేర్చె నెట్లొ, 'శే
పకట! యిఁకెట్లు నెగ్గు' నని యమ్మహనీయుఁడు చింత సేయ భ
ర్తకు శివశర్మ కిట్లు సహధర్మిణి వల్కె సుశీల ధీరతన్. ౧౯౦

మ॥ శివుఁ డుండంగ విచారమే లనఘ! తచ్ఛీలంబు గుర్తింపుఁ డే
రవినాభావముగాఁ దనున్ మనమునం దావిష్టుఁ గావించి స
ర్వవిధాలన్ యజియించుచుందురొ? తదర్థం బెంతయో పూనికన్
విని దైశ్వర్యము లిచ్చి ప్రోచుట పురావిత్ప్రోక్త మౌనే కదా!

ఉ॥ మీరు సదా మహేశ్వరుని మించినభక్తి యజింతు రి సర్వథా
"ఆరెదులే మహేశు" లని యాస్థమెయిన్ వ్రతదీక్షతోడ నిం
డార భుజింపఁజేయుదు రహర్దిన; మీదృశులైన మిమ్ము సం
సారులయందు నీశ్వరుఁ డసారులుగాఁ గని మిన్నకుండునే!. ౧౯౨

తే॥ గీ॥ మీకు నెటు తోఁచెనో? కాని నాకు నిన్న
అంతయన్నము సాపడినట్టి మేటి

శివుఁడై యుండు ననుచుఁ దోఁచెను మహాత్మ
కానిచో నొక్కరుఁడు తినఁగలఁడె యంత. ౧౯౩

వ॥ అది యట్లుంతము, జగమంతయు శివమయంబ. ౧౯౪

చ॥ "అడుగనియండజాదులకునాఁకలిదీరకయున్నె?" యంచు మీ
రడుగరుగాక శంభుఁ డిడ నాస్థ వహింపఁడుగాక లోకమం
"దడుగకయున్నచో నొసఁగ దంబయు" నందు రెఱుంగరే! యిఁకే
నడుగుఁడు తప్పకిచ్చు మన కమ్మహితుం డెనలేనిసంపదల్. ౧౯౫

తే॥ గీ॥ అడుగుటయుఁగూడ వల్వ దయ్యభవుగుడికి
నరిగి యీచింతతో మ్రొక్కుఁ డంతె చాలు
మును కుచేలుని శౌరి మన్చినవిధాన
మనుచు నిస్సంశయమ్ము నామాట వినుఁడు. ౧౯౬

మ॥ తనభక్తుం డెది గోరెనేని యది యుక్తంబైనఁ గాకున్నఁ బి
ల్లనికిన్ దండ్రి ఘటించుచందమున వాలాయమ్ము శంభుండు పే
ర్మి నొసంగున్ వినలేదె? మున్నొడయనంబిం దేల్చెఁ దానేమొ కుం
టెనకాఁడై వెలయాలితోఁ గలిపి; నందేహింపఁ డెప్పట్టునన్. ౧౯౭

ఉ॥ భక్తుఁడొ! కాఁడొ! తేలవలె భక్తుఁడెయైనెడ వాఁడు గోరున
వ్యక్తపుఁగోరికల్ నయిత మయ్యభవుం డొడఁగూర్చు నన్నచో
భక్తిమెయిన్ వ్రితం బొనరుపన్ సమకూర్పఁడె! యమ్మహాత్ముఁడే
రిక్తుఁడుగాని యాశ్రితులు రిక్తులు గారను టెఱుంగరే! ౧౯౮

తే॥ గీ॥ మన మహాలింగదేవుని యనుగుభక్తు
లెంత యైశ్వర్యమోగొని యెసకమెసఁగు
టెఱుఁగుదురు మీరు! నాటుకో జైకృతమున
సంపదల కిక్కలైరో? వచింపుఁ డనఘు.

మ॥ పయి కాతండు "విభూతిరాయఁడు"గఁ గన్పట్టుక్ దరిసుృ్రిందుగాఁ
డయగా ర్భక్తులపాలికల్పకము మీా రద్దేవు దర్శించి మీా
దయనీయంపుటవస్థ వాకొనినమీారిఁదర్క వమ్మ్రు గాఁబోదు మీా
కయమ్మై తీరు మహేశ్వరేశ్వరుఁడు కాఁడా? శంభుఁ డింతేటికిక్.

సీ॥ ఐశ్వర్యము నొసంగు నాయుష్యము ఘటించుఁ
గరులిచ్చు సిరులిచ్చు ఘనతనిచ్చు
సంతానము నొసంగు సౌభాగ్య మొనఁగూర్చు
యశమిచ్చు బలమిచ్చు హర్షమిచ్చు
నాతిథేయునొనర్చు నారాధ్యునొనరించుఁ
గారుణ్యనిధిఁజేయు ఘనునిఁజేయు
విజ్ఞానిఁ గావించు విశ్వజేతృతఁగూర్చు
నన్వయాధికుఁజేయు నమలుఁజేయు
తే॥ గీ॥ నమ్మహాదేవు భక్తిమై నాశ్రయించి
నట్టివారికి లబ్ధి కరామలకము
కోరుఁ డరిగి శివుఁడు మిమ్ము గారవించు
శివునిభక్తులరై చింతఁ జివుకనేల. ౨౦౧

చ॥ అనవుడు శర్మ యిట్టులను నక్కట! చేతను రాగిదమ్మిడీ
యును గనరాదు దేవు నెటు లూరక రిక్తకరాలతోడ ద
ర్శన మొనరించి నాపదు నసహ్య దరిద్రతఁ జెప్పికొందు? దే
వుని విడిచేతులక్ గనఁగఁ బోలదటండ్రు మనీషు లుగ్మలీ. ౨౦౨

వ॥ నావుడు నప్పతివ్రతాతిలకంబు చంటిపిల్లల చిఱుతిండికని భద్ర
ముగా డాఁచిన కొలఁదిపాటివిత్తమునుండి కొండొక యయ్యనఘు
నకు నిచ్చుటయు నయ్యాది కైకొని ఫలాదికంబు సేకరించుకొని
దేవళమ్మున కరిగి మహాలింగనాథుని షోడశోపచారమ్ములఁ నర్చించి
పక్వాన్నభక్ష్యభోజ్యాదిపదార్థంబులు నివేదించి నివేదితపదా

ర్థమ్ము పరిచారకులచే నింటం గల యతిథివర్గమ్మును దనుపుటకై
యనుపుచున్నంత. ౨౦౩

ఉ॥ ఆ గుడిచెంత కొక్క వసుధామరవృద్ధుఁ డుదారమూర్తి య
భ్యాగతుఁడై "క్షుధార్తునకు నన్నము నా కిడు" మన్నయంత న
య్యాగమవేత్త యింటికడ కంపెడి యన్నము నాఁగి యమ్మహా
భాగున కాశివాలయపుఁ బ్రాంగణసీమను జేసె వడ్డనల్. ౨౦౪

క॥ మాయాబ్రాహ్మణవృద్ధుం
డాయన్నము మెతుకు మిగులనట్లాఁకటి కా
హ్యాయముగ నాహరించి "శి
వా! యరుగుము వేగ మింటి"కని విచ్చేసెన్. ౨౦౫

ఆ॥ వె॥ ఇంట నున్న యతిథు లెదురు చూచుచు నుందు
రనుచుఁగూడఁ జెప్పి యరిగినట్టి
వృద్ధవిప్రుచర్య వీక్షించి యితఁడు బ్రా
హ్మణుఁడు గాఁడు శివుఁడె యని తలంచె. ౨౦౬.

క॥ గతిదినమే కొండొకయను,మితితట్టెక్ భార్యగూడమేల్కాల్పఁగడున్
మితిమీఱిన భక్తియె తా,శతవిధముల సౌఖ్యమీయ సంశయమేలా!

తే॥ గీ॥ "ఐన నింటను రాఁగియే గాని కూడ
నాఽస్తి యేఁకొన్న యతిథులయర్చ సాఁగు
టెట్టులని యంతకును శివుఁడే కలం డ
టంచు శివశర్మ గృహమున కరుగుదెంచె. ౨౦౮

క॥ విచ్చేయునప్పటికేఁ గడు,నచ్చెరువుగఁ బక్వమగు పదార్థములు గన
న్వచ్చిన శివశర్మయెటుల్,వచ్చిన విధియంచు మోదవార్ధిఁ దేలెన్

వ॥ అట్లు పరమానంద నిమగ్నమానసుండై కొండొక కాలమ్ము సకల
మ్మును మఱచి స్తంభీభూతుండై పిమ్మట సుశీల నుద్దేశించి. ౨౧౦

ఉ॥ ఎక్కడి దీపదార్థచయ? మెవ్వరు పంపిరి? చెప్పుమన్న మీ
రక్కడనుండి పంపితి రటంచు సుశీల వచించె దానితో
నెక్కడలేని యక్కజము హృద్గగనంబునఁ బొంగి పార్లి య
మ్మక్క! మహేశుపేర్మిఁ గన నయ్యెఁ గృతార్థుఁడనైతి నం చొగిన్.

క॥ సతియును దానును ముదమున
నతిథులఁ దృప్తుల నొనర్చి యభవు విలాసం
బతిమానుష మతిచోద్యము
మతికి నగోచర మటంచు మాటి కలరుచున్. ౨౧౨

మ॥ గతవృత్తాంతము భార్యతో నొడువ నక్కాంతాశిరోరత్న మీ
యితివృత్తానకు మున్నె తెల్పితినిగాదే! నే నటం చాడెఁ ద
త్పతి నాకన్నను నీకె తట్టినది కాంతా! శూలి యమ్మాయ, నీ
వతి ధన్యాత్మ వటంచు మెచ్చె నిటు లన్యోన్యమ్ము భాషించుచున్.

క॥ ఇప్పటికి దీక్ష జరిగిన, దెప్పాటన్ రేపు నెగ్గు నిఁక నని శివుఁడే
యెప్పటికిం గల డితరుల, నెప్పటికిన్ వేడఁగూడ దేమైన సరే.

వ॥ అని తదేకాయత్తచిత్తుండై తన్నామస్మరణం బొనర్చికొంచు నిద్రిం
చునంత నానాఁటిరేయి కడపటి భాగమ్మున. ౨౧౪

క॥ మానసింధనుతుఁడు కలలోఁ, గానఁగనయ్యెన్ శివుండు గంగాధరుఁడున్
తేనెలఁదాల్పును నాగా, నూనాభరణుండునై మనోజ్ఞాకృతితో.

క॥ తనుపట్టియుట్టు లను నో, యనఘా? చింతింపఁబోకు మైశ్వర్యము ని
న్నునువరియించునుపాయమ్మును జేసెద నాలకింపుముద మెదఁగదురన్.

వ॥ కారుణ్యామృత మనుపేరం బరఁగు విశాలంబగు పుష్కరిణి యీ
పురపు దేవళమ్మునకు దాపున నున్నది యని నీ వెఱుంగుదువుకదా!
దాని యొడ్డున నున్న వటవృక్షమ్ము క్రింద రేపటి యుదయమ్మున
జాతమాత్రి స్వరూపమ్ముతో నేన నీకుం బొడసూపుదు నూర్యో

దయమ్మున కించుకమున్న నీవటకు సతీసమేతుండవై చని వేచి యుండుమనది పిమ్మట నన్నుం గొని వెంటనె కావేరీపట్టణమ్మునకుఁ జనునది. ౨౧౮

మ॥ తిరువంకాడ రనన్ బ్రసిద్ధుఁడు కడున్ దేదీప్యమానంబు సు
స్థిర మైశ్వర్య మెలర్చువాఁడు గురుభక్తిస్ఫీతుఁ డవ్వీటిలో
నరయన్ శ్వేటిగృహస్థు, వాని కిడి దగ్రివ్యం బీవు నైకొమ్ము మేల్
సిరియే కాని యపత్య మింతదనుకన్ లేకుండె నవ్వానికిన్. ౨౧౯

వ॥ తప్పక నా చెప్పిన చొప్పున నొనర్పు మనుటయు శివశర్మ శివ! శివా! యని కర్ణపుటంబులు మూసికొని. ౨౨౦

ఉ॥ దేవర నాకు నిట్టులు విధించు టనుగ్రహ మెట్టులొఁ బరీ
భావమ కాక నీవు శిశుభావముఁ జెంది యనుగ్రహించి నా
కీవగఁ జిక్కు టన్నయదియే పది కోటులు నిన్ను విక్రియ
మ్మేవిధిఁ జేయువాఁడ నటులేని యఘం బది నన్ను మ్రింగదే?

వ॥ అదియును గాక. ౨౨౧

క॥ బంగారుకొండ విల్లై, గాంగేయుఁడు కొడుకు వెండిగ ట్టిల్లును నై
రంగారు నిన్నుఁ గొనుగే, స్తుంగలఁడే? ముజ్జగములుతూఁగు నెతూఁపన్.

క॥ అమ్మట యేతప్పగు హా, నమ్మగు క్రయమునకు నమ్మ నన్నును నీలో
కమ్ము మతింత దెగడు దో, నమ్మిది నే నాచరింపఁజాల మహేశా.

క॥ నినుఁ బెంచికొనెద నీదగు, ననికికిఁ దావైనచోట నొక్కటికొదవే?
నను నిట్లనుగ్రహింపుము, ధనమున కాసించి చేయఁదగునే? దొసఁగున్.

వ॥ ఇట్లతిదీనమ్ముగా వేడికొను నేకాంతభక్తునకు శివశర్మకు భక్తపరాధీనుం డుమాకాంతుం డిట్లను. ౨౨౬

ఉ॥ కారణ మొకక్కఁడుండి యిటుగా వచియించితి వాఁడు మిక్కిలిన్
గూరిమి నేయు భక్తిగల కోమటిబిడ్డఁడు నాదునాజ్ఞచే

ధారుణి శ్రీదునంశమును దాల్చి జనించెను నేఁడునాఁడు న
వ్వారిగ భక్తుఁడౌట నలవానిసుతుండుగ నుండనెంచితిర్. ౨౨౭

ఉ॥ నీవును గూర్మిభక్తుఁడవె నీకును వానికి భేదముండు జ
న్మావధి నీదుభక్తి జనవాంతరమందును వాఁడు భక్తుఁ డా
భావన కారణమ్మునను భాగ్యపరీతుఁడుగా జనించి యా
ర్యావనశీలుఁడై సుకృతియై తనరారెడి మేటిగేస్తునై. ౨౨౮

వ॥ కావున నేను నీకన్న నవ్వాని నెక్కుడుగాఁ బ్రేమించుట యావశ్య
కంబు మాఱుమాటాడక మదుపదిష్టప్రకారమ్మున నొనర్పుమని
మహాదేవుం డంతర్హితుండయ్యె. ౨౨౯

ఆశీర్వచనము

తే॥ గీ॥ కొలఁదికాలపు మితుర్రిందు గుణి వితరణి
చదువెఱింగినవాఁడు విశ్వాసపరుఁడు
ఆత్మనామాంకితుఁడు రెడ్డి యలరుఁగాక
చుందురికులాంబురాశికి సోముఁ డగుచు. ౨౩౦

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

గద్య

ఇది శ్రీతిరుపతివేంకటీయం బగు శివభక్తి యను పరమభక్త చరిత్రంబు
నందుఁ జతుర్థాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ
శ్రీమత్సరదేవతాయైనమః.



శ్రీమత్పరదేవతాయై నమః.

శుభమస్తు - అవిఘ్నమస్తు.



శ్రీ

# శివభక్తి

## పంచమాశ్వాసము

క॥ సిరి గలుగు వారలిలఁ బెక్కురుగల రందందు నంద్రు కోటీశ్వరు లె
వ్వారు నీవలె నవలీల వితరణమ్మున కిడిరి రెడ్డి! ధన్యుఁడవుగదా!

వ॥ అవధరింపుము.

ఉ॥ అంతట మేలు కాంచెఁ గల యట్టిది కాంచి ధరాసురుండు; ది
క్ప్రాంతములందుఁ దెల్లఁదన మంకురితంబుగఁ దోఁచెఁ బ్రాగ్దిశా
కాంత ప్రసూతి నొప్పుల వికారపు టెల్గులొ? నాఁగఁ బక్షు ల
త్యంతము గూయఁగాఁ దొడఁగె నంబుజినీసతికూడ మేల్కొనెన్.

క॥ అరుణోదయకాలమునకుఁ, దరుణియుశర్మయునుగుడికిదాపునఁగల పు
ష్కరిణికడనున్న యవ్వట, ధరణీజముక్రిందఁగనిరి తచ్ఛిశుమూర్తిన్.

క॥ కనులు మిఱుమిట్లుగొను తే, జునబుడిబుడియేడ్పు లేడ్చుచుఁ దననటకా
గ్రణితనము వెల్లడించుచు, సనాతనబ్రహ్మ మట్లు సన్నిధి సేయన్.

తే॥ గీ॥ జాతమాత్రుండుగా నున్న జాతరూప
చాపుఁ గన్గొని యానందసాంద్రుఁ డగుచు
నెత్తికొని శివశర్మ తా నిచ్చె సతికి
నాపె ముద్దాడి యక్కున నలమికొనియె. ౬

వ॥ పిమ్మటం గన్న పేదల చందమ్మున నిట్లు నిర్వచింపరాని సంతోషంబున బ్రుంగుచు మరల శివు నాదేశంబు దలంచుకొని. ౭

చ॥ ధనమున కేమి? యెన్నియొ విధాల గడింపఁగవచ్చు నెన్నఁడున్
జని యనియే యెఱుంగని రసం బల బ్రహ్మము రూపు గాంచి చి
క్కిన ధనలోభినై యొకనికిన్ "గయికొ"మ్మని యెట్టు లమ్మెదన్
బనుచునుగాక శంకరుఁడు పంపొనరింపఁ దలంపు రా దహో. ౮

తే॥ గీ॥ శివుఁడు కోపించి నను శిక్ష సేయుఁగాక
యెట్టులో వేడికొని కృప పుట్టునట్లు
చేసికొనియెద నంతియే శిశువు నొరుని
కిచ్చుటకు బుద్ధి పుట్టద యింత ధ్రువము. ౯

క॥ అని భార్యతోడ నొడువుచుఁ
దనయిలు మార్గమును బట్టి తరుణియుఁ దానున్
జనుచో మార్గము శివనే
శుని కొమరుం డున్నయూరు చొప్పించె నెటో. ౧౦

తే॥ గీ॥ ఇంటికిని మట్టికిని దూర మించుకంత
అల్ల శివనేశు కొమరునూ రంతపాటి
వ్యవధిలో నెట్లు చేరె? శివాజ్ఞ కాక
వానియాజ్ఞ లంఘింప నెవ్వని తరంబు. ౧౧

మ॥ తిరువంకాడరు కంతికిన్ మునుపె సందేశించె నీవార్త; నే
నరుదెంతున్ బసిబాలురూపునఁ ద్వదభ్యాశంబు చేకొమ్మ భూ

సురు శర్మఁ బరితుష్టుఁ జేసి యని; యాశుం డిట్లు స్వప్నమ్మునన్
బోరి వాకు9చ్చుటఁ జేసివాఁ డెదురుచూపుల్ చూచుచుండె దగన్.

చ॥ తనగృహమార్గమే యనుచుఁ దాశివశర్మ కుమారుతోఁ జనం
జనఁ దుద కాపథమ్ము శివశర్మ నొగిన్ శివనేశుపుత్రినిల్
చొనిపె మహేశుమాయ కెదఁ జోద్యము నందుచుఁ జూచునంతరం
డని శివనేశుపుత్రికుఁడు స్వాగతమిచ్చి నమస్కరించుచున్. ౧౩

వ॥ అర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి యాదరంబు నెఱపుటయు శివశర్మ
శివుని మాయావిలాసంబున కచ్చెరు వందుచు. ౧౪

ఉ॥ ఇంటికిఁ గొంతదూరమున నేకద? పుష్కరిణీతటంబు; వా
ల్గంటియు నేను నక్కడికిఁ గాల్నడ నేగి కుమారుఁ గొంచుఁబో
నుంటిమి యింటిలోఁ9వఁబడి; యూరును మాఱుపు చెందె నింతలోఁ
గంటికి గంత కట్టిన ప9కారముగాఁ గననయ్యె నంతయున్. ౧౫

చ॥ నినువును వీడు నిచ్చ తరుణీమణికిన్ మఱి నాకుఁగూడ లే
దసువుల నేని వీడఁగల మంతియ కాని మహేశుమూర్తి యీ
నినువును వీడుటెట్టు? లిది నిక్కమటంచు నెఱింగి కాదె? మా
య నలిపి కన్నుగప్పి శివుఁడంపెను గోమటిబిడ్డ యింటికిన్. ౧౬

చ॥ ఇతనిని విందు నీతఁడు మహేశ్వరపూజకుఁ డత్యుదారుఁ డూ
ర్జితమతి నిర్జితేంద్రియుఁడు శిష్టుఁడు కోట్లకొలంది ద9వ్య ము
న్నతఁ డతిభక్తుఁ డక్కటన నాత్మజభావమునన్ శివుండు స
త్కృతు నొనరింపనెంచె నిఁక నే నెనుదీయ శివాజ్ఞ తప్పునే. ౧౭

తే॥ గీ॥ ఎవనియాజ్ఞ బ9హ్మముల కేని దాఁట
నలవి కాదొ? నాబోటికి నదియు దాఁట
నెట్లు వశమగు నదిగాక యితనియెడల
నెక్కుడుగ నుండెఁ బ్రేమ మాయీశ్వరునకు.

తే॥ గీ॥ ఏమహారాజులకు లేని యేన్గులేమి?
యశ్వదళమేమి? పూర్ణచంద్రాననలు మ
తేమి? యిది షాహుకారునియిల్లె యగునొ?
కాక నాకు విభ్రమణము గలిగెనొక్కొ? ౧౯

వ॥ అని కొండొక మరల యోజించి. ౨౦

మ॥ ఇతఁడే యాతఁడు విన్నసద్గుణములాయీయోగ్యునందుఁ సువా
సితముల్ గాఁ గనుపట్టుచుండె శివునాశీర్వాద మివ్వాని యం
దతికెం బూర్తిగ; వీని కిచ్చెదనుగా కల్హారముద్దైన యీ
సుతు నంచుఁ మతి నెంచి యిట్లనియె సంశుద్ధాంతరంగమ్ముతో.

ఉ॥ ఈనిసు వీశ్వరాంశజుఁ డదృష్టపరీతుఁడు నీ కొసంగ నా
మానస మొప్పుచున్నయది మాటలు వేయును నేల? పుచ్చికొ
మ్మ నిదె నీ నిమిత్తమె మహేశ్వరునానతిఁ జేసి వచ్చితి
న్నా నతఁ డాదరించెను మనంబు ఘనంబగు మోద మందఁగఁ.

వ॥ ఇట్లు త్రికరణశుద్ధిగా నాశిశువు నతని కిచ్చు తలంపుతో వాగ్దానం
బొనరించి యీవైభవమ్ము నైకజన్మశివపూజాఫలితంబు గాని
వేఱు కాదని తలంచుచుండు నంత. ౨౩

తే॥ గీ॥ ఎడఁద శివశర్మ కొకశంక పొడమె మరల
శివుఁడు శివనేశసుతున కిచ్చెఱుత నిమ్మ
టంచు శాసించెఁ బేరు నే నడుగ లేదు
కుల మడుగలే దడుగలేదు గోత్రమేని. ౨౪

ఉ॥ ఆకృతిఁ జూచినఁ గృహమునాకృతి వైభవ మెంచి చూచినఁ
రాకొమరుండొ? యేమొ! యని భ్రాంతికిఁ దా వగుపట్టుచున్న దె
ట్లో కద! మాటజాతితి నహో! యిది నొర్మటి కాలుగాదు కా
లేకడ నేని జాతునెడ నెట్టులొ వీలగు సద్దుకొంటకుఁ. ౨౫

చ॥ మతి మతిగాఁ గనంబడక మాంద్యమిటుల్ ఘటియించెఁ బార్వతీ
పతి కిది కోపహేతు వయి బాధకమౌనో? మఱేమొ? సర్వథా
యితఁ డతఁడైన నాగముది యేర్పడ దన్యవిధంబ యైన దు
ర్మతి కగు నాకు శాస్తి; మఱిమాలితి నేమనుకొన్న నేమగుఁ. ౨౬

తే॥ గీ॥ శివుఁడు సకలమ్ము కలవచ్చి చెప్పి పంచి
నప్పటికి నాకు బుద్ధిజాడ్యంబు వొడమె
నతివయేనియు బోధింపదయ్యె నాపె
మఱియు మఱిలోన నుండనిమాట ధ్రువము. ౨౭

ఆ॥ వె॥ ఇట్టినిసువు నెవరికేని యీవలసెఁగా?
యన్న చింత యాపె నావరించి
యుండిటీరు నాకు నున్నంతకంతెను
గాన నాపె చెప్పఁ గలుగుటెట్లు. ౨౮

వ॥ ఇట్లు డోలాందోళితంబగు చిత్తమ్ముతోఁ జింతించు నాతని భావంబు ముఖమ్మై ఖరిం బట్టి యింగితజ్ఞుండు పట్టణత్తారుగ్రహించి యిట్లనియె.

మ॥ తిరువంకాడరటంచు మీకు శివుఁ డాదేశించె నేపేరియ
క్కురముల్; వాఁడను నేనె సందియపడంగా నేల? నా కిచ్చి యి
చ్చిటుతఁ గైకొనుఁ డర్థసంచయము; మీశిష్యుండ మీవంటి స
త్పురుషుల్ వేని ననుగ్రహించెదరొ? తత్పుణ్యంబు గణ్యంబగుఁ. ౩౦

వ॥ అని యంజలి ఘటించి వెండియు. ౩౧

ఉ॥ ఈరు మహానుభావులు మహేశ్వరపూజకు లుత్తమోత్తముల్
దారుణదీక్ష మీయది; యథార్థ మెఱింగి శివుండు మీయెడఁ
గారుణికత్వ మూని కలఁ గన్పడి మీ విషయంబు చెప్పె మి
మ్మారసి పూజ సేయుఫల మబ్బెఁ గృతార్థుఁడనైతి సర్వథా. ౩౨

ఉ॥ సంపద లెప్డు నాపదలె సద్వినియోగము సేయకున్నచో
దంపతు లీర్మహోత్తము లదాంభికు లింతటి పాత్రమే తట
స్థింప దెటో ఘటించునెడ శ్రీగలవార లుపేక్ష సేయరా
దంపవలెన్ గృతార్థులుగ నయ్యనఘాత్ములఁ జేసి వాసిగన్. ౩౫

ఉ॥ ఎంత తపంబు చేసె శివనేశుఁడు మజ్జనకుండు; తల్లి సు
స్వాంత పవిత్ర జ్ఞానకల జన్మము సార్థక మయ్యె మిమ్ముఁ బూ
జింతుఁ దరింతుఁ గాన సుఖజీవిని నే నయితిన్ భవాదృశుల్
హంత! మఱెంతయో సుకృత మబ్బనిపట్ల లభింపరే గదా!

వ॥ ఇట్లుపచారవాక్యమ్ములు పల్కుచు నాశిశువున కెంత ప్రతిఫలం
బిచ్చి కైకొందు నని మనమ్మున యోజించుచున్నంత నశరీరవాణి
యిట్లనియె. ౩౬

ఉ॥ ఎత్తున కెత్తు బంగరువు నీశిశుమూర్తికి గాఁగ నిచ్చి యీ
చిత్తజ సన్నిభుం గొను మశేష జగజ్జన వర్ణనీయుఁ డీ
పొత్తుల బిడ్డ నీసలుపు పున్నెము పండి లభించెఁ దత్త్వ సం
వేత్త యగున్ జుమీ! యితఁడు; విద్వదనారత వందనీయుఁడై. ౩౭

తే॥ గీ॥ శుకుఁడు వైరాగ్యమందు; వ్యాసుండు సకల
వేదవేదాంత సారస్య వేత్తృతయెడఁ
గాఁగలఁడు వీఁడు; వీనినిఁ గన్న సుతుని
కరణిఁ బెంచి తరింపుఁ డంగనయు నీవు. ౩౮

మ॥ బహుజన్మమ్ముల నీవొనర్చిన తపఃప్రాగ్భారముల్ పండి యి
య్యహరీశ ప్రతిమాన తేజుఁడు సురూపానంగుఁ డాజన్మని
స్పృహుఁ డీశుండో! తదంశమో! కొమరుగాఁ బ్రేమింప నీకబ్బె నీ
యిహమే కాదు పరంబుఁగూడ సుజితం బివ్వానిచే నీకగున్. ౩౯

క॥ ఆకాశవాణియిట్లు ల, నేకాంశము లుగ్గడింప నెల్లరు మోద
శ్రీకలితులైరి శిశువున్, జేకొనె శివనేశుసుతుఁడు శివశర్మయిడన్.

మ॥ తులలోఁ బాలకు నుంచి బంగరువుతోఁ దూఁపన్ మొదల్వెట్టఁగా
బలువై బాలకుఁడెంత వైచినఁ దనూభాగంబు ముల్ సూప న
ర్మిలి బంగారము తెండు తెం డనఁగఁ దద్భృత్యు ల్వడిం దెచ్చి య
త్తులలోఁ బెట్టుచునుండి రెంతయుడినం దూఁగండు ముల్ సూపుచున్.

చ॥ మును పల కృష్ణదేవుఁ డొక ముచ్చటకై తులనెక్కి సత్యయున్
తనవనితల్ దదీయము ధనం బఖిలమ్మును గ్రిక్కఁజేసియున్
గనికర మూన కూరకటు గాటముగా బరువెక్కసాఁగె న
య్యనువున నెక్కసాఁగె బలు వర్భకుఁ డెక్కడియక్కజంబహో. ౪౧

క॥ బరువెక్కనకొలఁదిని న, త్తిరువంకాడరు కనకము తెండని సారెల్
బరిచారకులం బంపుచు, నతిముఱిఁదూపందొడంగెనలయర్భకునిల్.

తే॥ గీ॥ శివకలాతన్వి మాత్రము చిత్తమందు
గొమరునకు దృష్టి తగులునోకొ? యటంచు
సందియమ్మందుచుండెను శర్మ యంత
నిట్టులనియె మహేశ్వరు నెదఁ దలంచి. ౪౩

సీ॥ విలుబద్దకరణి నుర్వీధరం బల మేరు
విమిడె నీ కరమందు నీశ్వరేశ!
రథచక్రములుగ మాఱఁగనయ్యె సూర్యచం
ద్రులమండలమ్ము లద్భుత చరిత్ర!
రథమయ్యె భూమి తద్రథచోదకుండయ్యె
బ్రహ్మదేవుఁడు పరబ్రహ్మమూర్తి!
పదునాల్గుభువనముల్ భరియించు శ్రీవిష్ణు
వస్త్రమ్ముగా మాఱె నాదిదేవ!

తే॥ గీ॥ నీ వనుగ్రహ మొక్కింత నెఱపి సరిగఁ
దూఁగవలెఁ గాని హతమూని తూఁగకున్నఁ

గొండ లన్నియు బంగారు కొండ లగుచుఁ
దారిసు నెక్కిన నినుఁ దూఁపఁ దరమె ? దేవ ! ౮౪

తే॥ గీ॥ అదియునుంగాక నాకు ద్రివ్యంబు వలదు
దీనఁ గల దుర్గుణమ్ములు దేవరకు ని
తరులు వచియింపనేల? చిత్తమె యెఱుంగు
నన్నిటే యుండని మొర్కోయనాథనాథ. ౮౫

తే॥ గీ॥ నీదు లీలల కర్థమ్ము గాదుగాక
యెఱుక చాలనియట్టి మాదృశజడులకు;
నీవు శిశువుగ నిట వచ్చి యీ విధమున
భక్తు వంచించు టది యేటిపాడి దేవ ? ౮౬

క॥ సామాన్యులైన యోగుల,బూమెలకే యర్థమెఱుఁగఁబోలదు నీవో!
సామాన్యుఁడవా యోగుల,పై మాటకుఁగూడఁజాలఁబై మాటగదా.

క॥ అని యొక బిల్వదళమ్మును
దన కేలం బూని శర్మ తాగ్రిసునఁ గల య
కట్టనకంబు మీఁదఁ బెట్టిన
వెనుకకు ములుసూపె నదియు విస్మయ మొదవన్. ౮౭

వ॥ పదంపడి శివశర్మకు శివుం డశరీర వాక్కున నిట్లనియె. ౮౮

క॥ తిరువంకాడరు ద్రివ్యము, పరమపవిత్రంబు నీవు భాగవతులలోఁ
బరమపవిత్రుండవు నీ, పరిగ్రిహము సంఘటింపవలసెన్ దానన్.

మ॥ కపటద్యూతపు వర్తకంబులకు వంకాడ ర్మనం బించు కే
నెపుడున్ మెగ్గదు నే నెఱుంగుదును దద్వృత్తంబు;నీవో? యథా
ర్థపు భక్తుండవు నాకు, మీయిరువురన్ ధన్యాత్ములన్ జేయ నే
నిపు డీ లీల నొనర్చినాఁడఁ గయికొ మ్మీకాంచన మ్మాదృతిన్,౮౯

వ॥ ఏ సుకృతకార్యమ్మునకు నేని మొట్టమొదటఁ బరిశీలింప వలసిన యది ద్రవ్యశుద్ధియే యని వెండియు. ౫౨

తే॥ గీ॥ నీదుదీక్ష సక్రమముగా నెఱపికొనుము
నేనె యున్నాఁడ నీకు నన్నిటికిఁ గూడ
నీకుఁ గొదవ యొండుండదు నిన్నుఁ దుదకు
మోక్ష మిచ్చి రక్షింతు శిలాక్షరముగ. ౫౩

క॥ అంబరశీర్షుం డీగతి, నంబరవాణిముఖ మూని ఆనతి యిడ శం
కం బడక శర్మ కనకం, బుంబట్టక పెట్టికొడుకు ముదమున నొసఁగెౕ.

తే॥ గీ॥ బాలునకు నెత్తు కెత్తుగ బంగ రొసఁగి
పేర్మిఁ బూజించి శర్మ నంపె వణిజుండు
తనదుదీక్షకు లోపంబు దవుల కుండ
నెలమి సంస్కృతి శర్మయు మెలఁగు చుండె. ౫౫

మ॥ తిరువంకాడరుభార్య ప్రీతిమెయి సాధ్వీరత్న మబ్బాలు దే
వరగాఁ జూడక కన్నపుత్రుఁ డనుచుౕ భావించి పోషించి సం
బరణానందము నొందె బాలకుఁడు నిచ్చల్ చిత్సుఖానందులౌ
వరయోగీంద్రులచర్యల న్నెఱపుచు న్వర్ధిల్లె నిస్తంద్రుఁడై. ౫౬

తే॥ గీ॥ మరుదవానుఁ డనెడి నామ మఱవభాష
మంచి యర్థ మ్మొసంగెడి దంచితముగఁ
బిల్లనికిఁ బెట్టె శివనేశు పేర్మికొడుకు;
తనపురోహితు ననుమతి ననుసరించి. ౫౭

తే॥ గీ॥ ఎల్లపిల్లకాయలకును నీ కుమారు
నకును నాటలఁ బాటల సకలమందు
భేద మగుపట్టుచుందానఁ బెరుఁగుచుండె
హరునపరమూర్తియైన యయ్యర్భకుండు. ౫౮

తే॥ గీ॥ నామకరణాన కేమి? యన్నంపుఁబ్రాశ
సమ్మునకు నేమి కేశఖండనకు నేమి
యెంతసొమ్మును వంకాడ రెలమిఁ గర్చు
పెట్టెనో? లెక్క యెవ్వరు పెట్టఁగలరు. ౫౯

మ॥ అయిదేఁడుల్ చనకుండ నక్షరపుటభ్యాసంబు గావించెఁ ద
ద్దయు ద్రవ్యంబు వ్యయించి కుఱ్ఱనికి నుత్సాహంబుతో; మీఁద నే
మియు నొజ్జల్ శ్రమసేయకుండఁగనె ప్రేమించెఁ గళల్ వాని; నా
శ్రియ మెవ్వాఁడు సమస్త విద్యలకుఁ దచ్ఛంభుండు వీఁడౌ ననన్.

క॥ ఆ వయసునంద పిల్లని, కేవిజ్ఞులు సాటిరాని దృఢ విజ్ఞానం
బాయత్తమయ్యె వైరా, గ్యాయుతనంబగుచు వృద్ధినందెఁ గ్రమముగన్.

తే॥ గీ॥ అట్టి కొమరుండు దొరకుట కతివ శివక
లయును భర్తయు నానందమయమగు మది
తో నిరామయ సౌఖ్యంబుతోడ సంస
రణమె స్వర్గమ్ముగా విహారము సలిపిరి. ౬౨

చ॥ కొడుకు లభించుటాది తనకున్ గుతుకమ్మది హెచ్చి వైశ్యపు
త్రికుఁడు మఱంత వర్తకము రోజుకు రోజుకు వృద్ధిచేసె నె
క్కుడుగ ధనార్జనం బొదవెఁ గోట్లకుఁగోట్లభివృద్ధి యై కడున్
గడు ధనలక్ష్మి గజ్జెలను గట్టుక తాండవమాడె లోఁగిటన్. ౬౩

తే॥ గీ॥ ఎచటఁ జూచిన ధనరాసు లెచటఁ జూడ
బంగరువు వెండిగా నిల్లు బహుళశోభ
తోడ నలరారె "నౌకరుల్" తొలుతకన్న
నెక్కువైరి సమస్తము హెచ్చె నెలమి. ౬౪

మ॥ అటు రెండేఁడులు పోవు దెంచుటయు నయ్యార్యాత్మజాతుండు మి
క్కుటమౌ వ్యాధికి లోఁగి వ్యాపృతిని గన్గొలేక లోఁగింట నొ

కృట వైద్యుల్ తలచేగుదేర నెటులో కాలమ్ము వెళ్లించు నం
తట విచ్చేసె గురుం డతండు గల యంతర్గేహాపుర్ సీమకున్.

వ॥ అట్లతర్కితోపపన్నంబుగఁ గృష్ణానందుండు విచ్చేయుటయు.

క॥ రోగగ్రస్తున కతనికి, శ్రీగురుదర్శనము కలిగి చిత్త మలరి యె
ట్లాగతుఁడయ్యెననుచున, యోగిచరణములకుమ్రొక్కియున్నెడనంతన్

క॥ గురుఁ డభయ మిచ్చి నీవును
దరుణియు నాయొద్ద భక్తితత్పరులై యీ
శ్వరు స్మరియించుచు నుండుఁడు
సురుఁగున్ రోగమ్ము సకలశుభములు జరుగున్. ౬౮

వ॥ అని సపరివారమ్ముగా వారలం దనయాశ్రమమునకు వెంటఁబెట్టి
కొని చని. ౬౯

క॥ ఏమందు గాని యిడక ని,రామయుఁ గావించి శిష్యునాయుర్దాయ
శ్రీమహితుఁ జేసె గురుఁడన,నామహనీయుండె కాక యందఱుగురులే!

వ॥ తత్ప్రకారంబు కొండొక వివరించెద.

తే॥ గీ॥ వంటలక్కలు మఱియును వంటకోమ
టులును బోలెఁడుమందితో నలరుసెట్టి
కోడలికి వంటతోఁబని కొంచెమేని
యుండదని కనిపెట్టె నయ్యోగివరుఁడు. ౭౧

క॥ కనిపెట్టి ముందు శివకల, కనువుగఁ బాకమ్మునర్పునట్టి నిపుణతన్
ఘనమతి కృష్ణానందుం, డనఘుండలవరిచె నేర్చె నాయమయుఁదగన్

తే॥ గీ॥ ఆపె వండిన వంటకం బౌషధముగఁ
బరమగురు కృపారస మనుపానముగను
బదియునైదురోజులకు నపాస్తమయ్యె
వ్యాధి; యోగులకృప సర్వసాధకంబు. ౭౪

వ॥ అట్లు నిరామయుండై కతిపయమ్ముగఁ బూర్ణారోగ్యమును జెంది గురునికటమ్మున సుఖంబుండునంత నొక్కనాఁ డొక భక్తుండు రుచ్యంబు లగు మామిడిపండ్లొక యేఁబది తెచ్చి సమర్పించుటయు.

క॥ తిరువంకాడరుదృష్టి ప్రసరించె నవ్వానిపైని సరసుఁడు కరుణా
కరుఁడది యానందుం డంతరమున గ్రహియించి శిష్యుదరికిం బిలిచెన్.

క॥ పిలిచి యివి తినెడి కోరిక గలదే? నీకనినఁ జెప్పఁగాఁ గొంకి యెటుల్
బలుకంజాలక కొండొక తలసంజ్ఞ దనమనోరథము సూచించెన్.

వ॥ పిమ్మట నా ఫలములన్నియు లోపలఁ బెట్టించి వేఱొక శిష్యునితో నీ పండ్లు త్వక్కు దొలఁచి యొక్కొక్కటిగా నా కందిమ్మని యాజ్ఞాపింప నతం డట్లొనరించుచుండెను, పదంపడి కృష్ణానందుం డొక్కొక్క పండువంతున ముక్కలుగాఁ గోసి శిష్యుని కందిచ్చుచుండె. ౭౮

మ॥ తిరువంకాడరు పథ్యముల్ విడిచి యేదేనిన్ దినన్ జాల ము
ప్పిరిగొన్కోరికతోడ నున్న కతనన్ "బేశ్బే" కట న్నక్కి న
త్తఱి ముక్కల్ దినఁజొచ్చెఁ దిన్న కొలఁదిన్ దాఁబెట్టఁగాఁజొచ్చె న
గ్గురువర్యుం; డొక రెండుపండ్లు మిగిలెన్ గోయంగ నవ్వానిలో. ౭౯

తే॥ గీ॥ కొలఁదిగా నాలుగైదు ముక్కలు గురుండు
తినియెనో? లేదొ? అన్నియుఁ దినియెఁ బండ్లు
శిష్యుఁడటులేని యతనికిఁ జెఱుపు గలుగ
లేదు గురున కజీర్తి తాఁ బాదుకొనియె. ౮౦

ఉ॥ ఎక్కుడుగా భుజించె మును పేదియొ వ్యాధికి లోఁగి యుండె న
మ్మక్క! అజీర్తి శిష్యునకు నంటక నాలుగొ యైదొ సన్ననౌ
ముక్కలు తిన్న దేశికుని ముట్టు టిదేటి విచిత్ర మెవ్వరో
మెక్కుట యేరికో భరము మేకొను టెక్కడనేని యుండునే? ౮౧

వ॥ ఇది సర్వసామాన్యముగాఁ దట్టైడి శంకయే కాని లోకోత్తరు లగు
గురువర్యుల యోగానుభవం బెఱింగినవారి కిందలి రహస్యం బవ
లీలగ గోచరించు. ౧౨

క॥ పాపడె శిష్యుఁడు జిహ్వా
చాపల్యముకతన గర్భశక్తి నెఱుఁగ కే
యాపద రాకుండఁగఁ దాఁ
గాపాడెఁ గురుఁడు శిష్యుఁ గరుణానిధియై. ౧౩

వ॥ శిష్యుఁ డనుభవింప వలసిన బాధను గురుండు తనయం దారోపించి
కొని శిష్యు ననుగ్రహించినట్లు భావింపవలసియున్నను దీని హేతు
వాదప్రవీణులు లేశమును విశ్వసింపరు. ౧౪

ఉ॥ వీరలు విశ్వసింతురని వేదము పుట్టఁగలేదు శాస్త్రసం
భారము గాని తక్కిన యపారపురాణభరంబు గాని య
వ్వారికినై జనింప దలవారికె వారలబుద్ధిమాత్ర మా
ధారము దానికన్న నిఁకఁ దక్కిన వేవియుఁ గావు మానముల్. ౧౫

క॥ వేదమన శబ్ద మద్ది య,నాదియును నపౌరుషేయ మనియును బ్రాజ్ఞుల్
వాదింతురు దానికి నెవి, గాదో యది విశ్వసింపఁ గాదనిరి మునుల్.

ఆ॥ వె॥ ఆర్యమతముకన్న నన్యమతమ్ములు
యుక్తి యుక్తములుగ నుండుఁగాక
తరణమునకు మంచి దారిఁ జూపింపఁగా
నేర వన్నమాట నిక్క మరయ. ౧౭

ఆ॥ వె॥*ఆర్యపుత్రుఁడు వంకాడ రాశ్రయించి
నట్టి మత మార్యమత మని యందఱుందు
దిగుదు రన్నంత యోగ్యత నెగడ గురుని
దగిలి సేవించె నెంత యుత్తముఁడొ? యతఁడు. ౧౮

*టిప్పణి॥ ఆర్యుఁడనఁగా వైశ్యుఁడు, ఆర్యునిమతము ఆర్యమత మని చమత్క
రింపఁబడినది.

వ॥ అది యటులుండె యోగరహస్యంబులు సామాన్య శుష్కతార్కిక
బుద్ధులకు గోచరింప వనునది వక్తవ్యాంశము. "యతో వాచో నివ
ర్తంతే" అని పరమేశ్వరునిగుఱించి శృతి వక్కాణించినట్లే యీ
యోగశక్తులంగూర్చియుఁ జెప్పనొప్పు. ౯౯

తే॥ గీ॥ అల యగస్త్యుఁడు సంద్రమ్ము నట్టె పీల్చె
జహ్నుముని యంతలో గాంగజలము ద్రావె
ననిన మనశక్తితోఁ బోల్చి యది యసత్య
మనుచు వాదింపరా దుందు రట్టివారు. ౬౦

క॥ దూరశ్రవణము మఱియుఁ
దూరాలోకనము ముఁ బుధుల కున్నయటుల్
వారే వ్రాసిరి యిపు డ
వ్వారిగ నవి మనకు నయ్యెఁ బ్రత్యక్షంబుల్. ౬౧

చ॥ ఇపు డొక యోగి దిగ్వసనుఁ డెంతొ వయస్సులరారువాఁడు మా
నపరుఁడు గౌతమీతటమునం గలఁ డాతని కుష్ణబాధ లే
దెపుడును శీతబాధ లవమేనియు లేదు తురుష్కుఁ డందు రె
ల్లపు డొకటేగతిం బొలుచు నాతనియాయు వెఱుంగ రెవ్వరుఁ. ౬౨

క॥ యోగాయుర్దాయగ్రహ, యోగమ్ములు జాతకజ్ఞు లూహించిరి త
ద్యోగములకు లక్ష్యమ్ములు,గాఁ గన్పట్టుదురు దీర్ఘకాలాయుష్కుల్.

క॥ ఒక యాయుర్దాయమె కా
దిఁక నెన్నియొ కలవు యోగ మెఱుఁగు మహాత్ముల్
ప్రకటింపఁ గలవిశేషము
లు కడుఁ జిత్రముగ నుండు లోకుల కవియుఁ. ౬౪

తే॥ గీ॥ అందు నియ్యది యొకటి శిష్యగతబాధ
గురుఁడు కైకొను టన్న దప్పరము నాశ్రి

మంబునం దాఱునెలలు సుఖంబుగా వ
సించె శివనేశుకొడుకు దేశికునియాజ్ఞ. ౯౫

వ॥ గురునను గ్రహమ్మున నిరామయుండై సత్కాలక్షేపమ్ముతో నట సుఖంబుండు దినమ్ములలో నతం డిట్లు యోజించె. ౯౬

క॥ ఎక్కడిధన మెక్కడిఋణ, మెక్కడిసంసార మెందు కీపీడ పర మ్మెక్కఁదలఁచువా 'ర్కప్పల,తక్కెడ'గా దీనినెంచితగులరు దీనన్. ౯౭

వ॥ కావున దీనినుండి పెందలకడ మేలుకొనుటయె యుక్తంబని తలఁచి యొక్కనాఁ డేకాంతస్థలమ్మున నున్నగురునిం గాంచి నమస్కరించి యిట్లు విన్నవించె. ౯౮

తే॥ గీ॥ తప్పుగాఁ జూడ రేని నే నిప్పు డొక్క
మనవి చేసికొనియెద నామనవి చిత్త
గింపవలెఁ దప్పయిన క్షమియింపవలయు
"దాసరుల తప్పు దండముతో సరి"కద. ౯౯

తే॥ గీ॥ నాకు సంసారమనఁ జిన్ననాఁటనుండి
యంతగా గిట్టకున్నను ననఘులైన
గురులు మీయానతిని జేసి కొనకు దాని
యందు మగ్నుండనై తిఁ బ్రాయంబు సడలె. ౧౦౦

క॥ కామరుఁడుసం(ప్రాప్తించెనిఁ,కమహాత్మా!త్యజింతుదీనిఁగరుణమెయిన్నా దుమనవి మన్నించి భవాబ్ధమునీఁగి పోకుండఁగనుఁడు దేశికవర్యా.

వ॥ నావుడుఁ జిఱునవ్వు నవ్వి గురుఁ డిట్లను. ౧౦౨

క॥ సన్న్యాసమనఁగమాటలె?, అన్యాయమ్ముగను దీనియందునదిగుచున్ ధన్యులమనుకొని చెడియెడి,మాన్యులుగల రెంద జేనిమఱిగనుఁగొం టే?

క॥ ఇతరాశ్రమములఁ దొడరిన,
శతములకొలఁది దొసఁగు లిది సమయించు నిదం
గతము దొసఁగు దొలఁగింపఁగ
శతధృతియును జాలఁడనినఁ జాలుదురె ? యొరుల్. ౧౦౪

తే॥ గీ॥ తల్లి ముదుసలి కొమరుండు తరుణవయసు
రానివాఁ డిపు డింతలో వానిమీఁద
సంసృతి భరమ్ము మోపుట సమ్మతంబు
గాదు చననిమ్ము కొండొక కాల మిట్లు. ౧౦౫

వ॥ నావుడుఁ బట్టణత్తారు గురూత్తమున కిట్లను. ౧౦౬

క॥ అన్నిటికి నాకు మీరే, యున్నారు సమస్తభరము నుంచెద మీపై
నెన్నఁటికిని నే లోపం, బన్నది లేకుండు నెచటి కరిగిన నేమా. ౧౦౭

వ॥ అనవుడు నయ్యోగిపుంగవుండు. ౧౦౮

సీ॥ అర్థముఁ బ్రాణము నాచార్యుని యధీన
మన్న వాక్యము లోకమందుఁగలదు
తదనుసారముగ విత్తము సమస్తము మద
ధీనం బొనర్చెదవేని దాని
నే భరింపంగలనే? కలనేని నా
కట్టి పేరాసలేదని యెఱుఁగుదు
వెఱిఁగియు నన్నుఁ బరీక్షించెదో? యేమొ?
యిట్లె నన్నుండని మ్మేను నిన్నుఁ

తే॥ గీ॥ గంటికిని ఱెప్పచందానఁ గాచుచుండు
నాదు నుపదేశములు మదిఁ బాదుకొల్పి
సంచరింపుము పదపడి సన్న్యసించు
కాలమే తెంచు నపుడు మస్కరివి గమ్ము. ౧౦౯

మ॥ గృహివై చేసెడి పుణ్యకార్యములు లేవే! చేసియేయుంటి వీ
యిహమం దింకను జేయఁగాఁ దగిన వెన్నె నుండె నోయన్న? దు
ర్వహమౌ సన్న్యసనంబుకోస మిపుడే వాంఛింపఁగా నేల? ప్రి
త్యహ మేతెంచెడియర్థులన్ దనిపి పుణ్యం బర్థి నార్జింపుమా. ౧౧౦

వ॥ అని కొండొక యోగదృష్టి నుపయోగించి. ౧౧౧

క॥ నీకొమరుఁడు చిన్మూర్తి గుణాకరుఁ డవ్వానికతన నభివృద్ధం బౌ
నీకున్ విజ్ఞానం బది,లోకోత్తరుఁ జేయఁగా వెలుఁగు దీ వెందున్.

వ॥ అని భవిష్యదర్థ సూచకంబుగాఁ గొండొక నుడివి ఆయురారోగ్య
భాగ్యాభివృద్ధిగా నాశీర్వదించి సపరివారమ్ముగా ననుపుటయు నప్ప
ట్టణత్తూరు ససతీపుత్రిమ్ముగా స్వగృహమ్మునకు నేగి గురూపదిష్ట
ప్రకారమ్మున సర్వధర్మమ్ములు నెఱవేర్చుచు వర్తిలుచుండె. ౧౧౩

క॥ తనకున్ గృష్ణానందుక, తన మును లభియించినట్టి తత్త్వజ్ఞానం
బనఘుండు మరుదవాను క,తన శతగుణమయ్యె సర్వథా వర్ధిలుచున్.

తే॥ గీ॥ మరుదవానుండు తఱచు వితరణమునకు
నేది గనుపడ నద్దియే యిచ్చుచుండుఁ
దండ్రి వంకాడ రడ్డంబు దవులఁ డల్లి
తల్లి శివకలయును బ్రిమదమునఁ జూచు. ౧౧౫

వ॥ అనంతరంబు. ౧౧౬

మ॥ పదియాఱేండ్లు వయస్సు నిండుపిదపన్ వాణిజ్యసంపత్తికై
కదలెన్ వీఁడు విదేశ మంబునిధి నౌకాయానమున్ జేసి; తోఁ
బదుగు రోవ్వయిరి వైశ్యపుత్రకులు; లాభం బొప్ప వార్వచ్చి రే
యదియున్ లేక యితండు వచ్చె నగి యర్యశ్రేష్ఠు లిస్సీ! యనన్.

సీ॥ ఏమి తెచ్చితివని యాతనిఁ బ్రశ్నింపఁ
బిడుకలు సెనగలు నడుకులుఁ గల
గోనెలు చూపించెఁ గోమటులెల్లరు
నపహాస్య మొనరించి రవల గోనె
సంచులు విప్ప నా సంచుల యడుగున
బంగారు టిసుక గన్పట్టెఁ బిడుక
లవి విఱిచిన వానియం దనర్ఘములైన
మణు లుండె "నిది యేమి మాయ" యనుచు

తే॥ గీ॥ నప్పు డక్కజపడిరి యీయద్భుతంబు
గాంచి వంకాడ రట మున్ను గన్న కనలు
వాసి సంతసముం గని వాని నెంతొ
ప్రేమమున గారవించె నప్పిదప నతఁడు. ౧౧౮

క॥ తనయార్జించిన ధనముఁ
దన పితార్జితముఁ దృణవిధమ్మైన సతముఁ
వినియోగించుచుఁ గాల
మ్మును యుక్తమ్మైనరీతిఁ బుచ్చెందొడఁగెన్.

క॥ కొమరునినద్వ ర్తనకు ఘనమునం ద్దాదంపతులు ఘనంబగు మోదం
బును గనుచుఁగాలమును స్సన్మని సమ్మతమైనరీతిఁ బుచ్చిరి పేర్మిన్.

వ॥ పదంపడి మరుదవానునికి వివాహమ్మొనర్చుటయు నవ్వానికి
దీర్ఘాయుర్భాగ్య సమన్వితుం డగు కొమరుం డుదయించి యవ్వాఁడు
శుక్లపక్షపాకరు వడువున వృద్ధి నందుచుంటయు లోనుగాఁ గల
శుభంబులు తామరతంపరగా నలరె నంత నాజన్మవిరక్తుండగు
మరుదవానుం డొక్కనాఁడు జ్ఞానార్థియై యెటకేనిం జను నూహ
వొడమి తనయవతారమ్మునకుఁ బ్రధానప్రయోజనంబు మదిం
దలఁచి పట్టుపేలికలు చుట్టిన యొక చిన్నిపెట్టె తనజననిచేతి కిచ్చి

దీనిని భద్రముగఁ గాపాడవలసినదనియు దీనివలని ప్రయోజనంబు ముందుముందు స్పష్టం బగుననియుఁ దండ్రియే దీని రహస్యంబు వెల్లడి చేయుననియుఁ జెప్పి తనయిచ్చ నెటకేనియుం జని యెప్పటికిని మరల రాకుంటకు నా పుణ్యదంపతులు, ౧౨౧

క॥ విత్తము విభవము నిచ్చియు
విత్తయి వంగడపుఁదరువుఁ బెంచుకొమరు దే
వోత్తముఁ డొసంగఁ డొసఁగక
విత్తముచేఁ గొడుకుఁ గొనెడి విధ మేర్పఱచెన్. ౧౨౨

తే॥ గీ॥ దానికే సంతసముఁ బొంది తనిసి పెండ్లి
పేరటమ్ముల నొనరించి వేడుకలను
గాంచుచుండంగఁ గొడుకు నొక్కరునిఁ గాంచి
యేగెను విరక్తికల్మి వాఁ డెటకు నేని. ౧౨౩

తే॥ గీ॥ వత్సరమ్మేని గడవనివానిఁ గుఱ్ఱ
విడిచి లేఁబ్రాయ మలరారు వెలఁది విడిచి
యెచటికేగెనో? వాని ప్రవృత్తి లేశ
మేని వినరా దటంచు నెంతేనిఁ గుంది. ౧౨౪

తే॥ గీ॥ వర్తకపుమిష వీఁడు ద్వీపములు గొన్ని
చూచియున్నాఁ డెటకుఁబోవఁ జూచెనొక్కొ?
అనుచుఁ గొమరునికొఱకు ద్వీపాంతరములఁ
గూడ వెదకించె శివనేశుకొడుకు కడఁక. ౧౨౫

ఉ॥ జ్ఞాన మదెంత గల్గినను సంసరణంబని పెట్టుకొన్న యె
వ్వానికిఁ గొడ్కు గోడ లని వారల బిడ్డలటంచు నున్నచోఁ
గాని మనంబు తృప్తిపడఁగా గమకింపదు పిన్ననాఁటనే
సూనుఁ డెటో చనెన్ దనదుసుందరిసిన్ గొడుకున్ ద్యజించుచున్

వ॥ ఇట్లు వగలం బొగులుతఱి శివకల కొమరుం డెట కేనియుం జనుటకు
మున్ను తనకు దాఁచ నిచ్చిన పేటికం దెచ్చి "మీావలన రహస్యంబు
వెల్లడియా"నని చెప్పి చనె ననుచుఁ జూపిన నద్దాన నేమేని యతని
చనినజాడ దెలిసికొను నాధారంబు చిక్కునో? యని తెఱచి
చూచుటయు. ౧౨౭

మ॥ చెవి లేనట్టిది సూది యొండు గనిపించెన్ వర్ణముల్ వ్రాల్చు నా
కవలన్ గన్పడె "నేరుఁగూడఁ దుది ద్రివ్యం బింతమాత్రింపు వ
స్తువుగూడన్ గొనిపోవఁ జాల" రనుచున్ సూచించి వ్రాల్ సేసె'నిం
త విరాగుల్ జగమందు నుండ' రనుచున్ దన్వంగితోఁ బల్కుచున్.

ఉ॥ తానునుగూడ ద్రివ్యము నతిశ్వతధా వ్యయముం బొనర్చుచున్
జ్ఞానధనమ్ముఁ బాత్రులకుఁ గైవసముం బొనరించుచున్ మహే
శానునిభక్తి లోకమునఁ జాల విధాల నెసంగఁ జేయుచున్
శ్రీనిధి యయ్యె నాతఁడు చరింపఁగ నెంచె యతీంద్రమాళియై.

ఉ॥ ఏవము పుట్టి సంసరణ మిట్లు త్యజించెడి వేళ నింటిలోఁ
బోవులు పోవులై యొలయుఁ బుత్తడి సర్వము చూఱఁబుచ్చఁగా
వేవురు వచ్చి కైకొనిరి బీదలు; కోమటిబిడ్డ యెంతయున్
భావము సంతసంబునకుఁ బాదుగ నర్తిలె శంభుఁ బాడుచున్. ౧౩౦

క॥ తనభర్త దిగంబరుఁడై, తనసర్వస్వముఁ ద్యజించి తరలెడిచో న
వ్వనితాతిలకము సైతము, చననెంచెం గాని తుదకు సాఁగకపోయెన్

ఆ॥ వె॥ "ఏమియాజ్ఞ?" యనుచు నింతి ప్రాణేశ్వరు
సెలవు వేఁడె నతఁడు చీర విడిచి
నన్నుఁబోలె రమ్మ నావుడుఁ దోరణ
ప్రాంత మేగి చనక యట్టె నిలిచె. ౧౩౨

ఆ॥ వె॥ అంత నితఁడు భార్య "నంతమట్టుకె నీకుఁ
గలదు శక్తి" యనుచుఁ గాలిక్రిందఁ
ముక్కుసూటి త్రోవ నెక్కడికో యేగు
తఱిని మరలుచుటకుఁ దలఁచి పేర్మి. ౧౩౩

చ॥ పురమున నున్న కోమటులు బోరనఁ గన్నుల నీరువెట్టుచున్
దరి కరుదెంచి కాళ్ళఁబడి దైన్యముతో? "నిలు వీడ నేల మ
మ్మరసి గృహమ్మున న్నిలిచి యుండగ నుండు"మటంచు వేడియున్
మరలుపఁజాల కేగి రొగి మానని యయ్యనఘాత్ము పూనికన్. ౧౩౪

వ॥ పిమ్మట నతండు చూఱవిడిచిన ద్రవ్యంబు నెల్లరుఁ గొనిపోయినది
కొనిపోఁగా మిగిలిన యే కొంచెమో భూపాలుండు స్వాధీనపఱిచి
కొని యద్దాని కధికారి యతని మనుమండు కాగలండని
ప్రకటించి పురబాహ్యప్రదేశమ్మున నిశ్చింతుండుగాఁ బిత్రువనమ్ము
నందుఁగ్రీడించు పరమశివుం దలపించు నీతనియొద్ద కమ్మహీపాలుండు
స్వయమ్ముగా నేతెంచి కొండొక యహంభావమ్ముతో నిట్లను ౧౩౫

మ॥ అరరే? అంతటి భోగభాగ్యములతో నత్యంతమున్ బొల్చు నీ
సిరి సర్వమ్ముఁ ద్యజించి సాధ్వియగు నీ సీమంతినిన్ వీడి యె
బ్బెఱికం బంచనుకొంక దిన్నెములతోఁ బీనుంగు లల్లాడు ను
ర్వర నిట్లుంటి మఱేమి లబ్ధి గలిగెన్ వార్ధకు చ్చెదే? నావుడున్. ౧౩౬

మ॥ ధరణీనాథ? భవాదృశుం డిటు నను న్దర్శింప నేతెంచు టె
వ్వరుగన్నన్ మఱి విన్న నేమనెదరో? భావించి చర్చించుచో
స్ఫురియించున్ సకలమ్ము; నీవు నరదేవుండౌదువో? కావా? దే
వరయు న్నీవునుబోలె నాకడ కిటే వచ్చున్ గనుంగొంటివే. ౧౩౭

ఉ॥ ఎత్తగుమేడలున్ సిరియు నేపని? కాయువు మూఁడెనేని "యిం
కెత్తర యెత్తరా" యనుచు నీడ్తురుగాని పసిండిపాలకీ

లిత్తురే? యిత్తురే యను మదేటికహో? శవవైభవంబు కిం
చిత్తు మదిన్ విచారణము చేయునెడన్ సకలంబు తెల్లమౌ. ౧౩౮

తే॥ గీ॥ బ్రదికియున్నప్పు డిదియొక ప్రాభవంబె
యంద మటుమీఁద నొరుల కాయాస మేల?
యనుచు నిచ్చట వసియింతు ననఘ! నేను
మఱియొకటి చెప్పెదను విను ధరణినాథ. ౧౩౯

తే॥ గీ॥ పేదజనులకు సిరులపైఁ బేర్మి యుండు
టర్హమేకాని ధనికుల కది యనర్హ
మల్లబీదల కది పరమార్థమైన
యట్టె వీరికి ముక్తియు నగుట యొప్పు. ౧౪౦

వ॥ ఇట్లు నొడువు నతని నొకపిచ్చివానిఁగా నెంచి నరపాలుండు తన యిచ్చం బోయెఁ బిమ్మట నాతండు విరక్తుండై గ్రామైకరాత్రమ్ముగా సంచరించుచు మానవగ్రంథంబులని కరతలభిక్షతో శరీరయాత్ర నిర్వహించుకొనుచుఁ బరమేశ్వరు జపించుకొను పట్టున నొక సాయంసమయమ్మున బిచ్చమ్మునకై చని. ౧౪౧

శా॥ మానం బేమఱ కోలిఁ జప్పటలతో మ్రానోవలె నిల్చున్న వి
జ్ఞాని న్వాని నెఱుంగలేక తఱిమెన్ గామ్రంబుతో మోఁది య
జ్ఞానుం డొండొక గేస్తుఁ;డక్కతన "యాచ్నాదైన్య మే నొల్ల నీ
శానుండే యిడు నాకుఁ దెచ్చి"యనుచున్ జాలించె భైక్ష్యం బొగిన్

క॥ తనుఁ బడమోఁదెడి తఱిని సు
జనుఁ డొక్కఁడు చూచి మోఁదుజను నాఁపి తనున్
దనయింటికిఁ గొని చని తా
ననుకూలోపచరణముల నలరించెఁ బొరిన్. ౧౪౩

వ॥ అట్లుపచరించు నా గేస్తున్ దీవించి పడమోఁదిన గేస్తునజ్ఞానమ్మునకుఁ జింతించుచు వాని నేమియు ననక సకలమ్మును బర

మేశ్వరవిలాస మ్మని తలఁచుచు నటనుండి మాహాళక్షేత్రమ్మున
కరుగుచు నంతర్గతమ్మున నతండు. ౧౮౪

ఉ॥ ప్రాణము లెంత కష్టపడి పాయక నిల్చినఁగాని దీర్ఘని
ద్రాణము లోట తప్పదు కరంబు శ్రమంపడి వీని నిల్ప వి
న్నాణము గోలుపోయి "యిడు నాకొక యన్నపుముద్ద యీదరి
ద్రాణపుఁబొట్ట" కం చడుగు తప్పిద మింక నొనర్ప నెన్నఁడున్.

ఉ॥ ఏలఁగ "రాజ్య మి"మ్మని మహేశ్వర ! నిన్నును దేవురింపలే
దాలములోన "శత్రుజయ మర్థి నొసంగు" మటంచు వేడలే
దేలొకొ ? బిచ్చ మెత్తికొన నేగినఁ బట్టుక చావమోఁది తో
కాలగళా ? యికెక్కడికిఁ గాని జనన్ జని తెమ్ము నీ వెటో. ౧౮౬

తే॥ గీ॥ నీవు తెచ్చి పెట్టినయప్డె నేను దిందు
లేనిచో మానుకొందు నీయాన దేవ
అంచు నొట్టిడికొంచు మాహాళముఁ జేరి
యచట మాహాళేశ్వరుని దేవాలయమున. ౧౮౭

క॥ ఎవరేని భక్తిమై శివు
సవిధమునకు వచ్చి యిడుప్రసాద మిడిన దా
నివలనఁ బ్రాణము నిలుపుచు
శివుఁ దలఁచుచు నుండుతఱిని జిక్కొకఁ డొదవెన్ ౧౮౮

తే॥ గీ॥ భద్రగిరినాథుఁ డనెడి యప్పట్టణంపు
జేనిగృహమందు దొంగలు జేయి దొంగి
లించి తెలవాఱకయమున్న కాంచనాటి
కమును బంచికొనిరి దేవళమున కేగి. ౧౮౯

ఉ॥ దొంగతనాన కేగునెడ దోయిలి యొగ్గి "మహాత్మ! నేఁడు మ
మ్మొం గరుణించె దేని నిను ముందు సభాజితుఁ జేతు"మంచు నం

ధుం గలవిఘ్నరాజునకుఁ దొల్తనె విన్నప మాచరించియుం
టం దొలుదొల్త సత్కృతు నొనర్చి రుపాయన మిచ్చి హారముల్.

వ॥ ఆ ముక్తాహార మా విఘ్నేశ్వరునికటమ్మున సమాధినిష్ఠుండుగా నున్న యితఁడ యద్దేవుఁ డనుకొని యంధకారబంధురం బగు నిసి వేళఁ గడుంగడు నలజడితో నితని కంఠమ్మునఁ బడవైచి వారలు చరచర నెక్కడికేనియుఁ జనిన పదపడి రాజభటులకు నితని మెడ నున్న హారము గోచరించుకతన నితనిం దొంగగా భావించి కొట్టుచుఁ దిట్టుచు రాజనికటమ్మునకుం గొనిపోయిరి. సమాధినిష్ఠుండై యున్న యితని కేమియుం దెలియనికతన నితఁడు సర్వమునకుఁ బరమేశ్వరుఁడే కలఁడనియు "శివు నాజ్ఞలేనియెడలఁ జీమయేని గుట్ట నేరదనియు మౌనమ్మునఁ మిన్నకుండు వీనితత్త్వమ్ము గ్రహింప నేరక యారాజే డితని కురిశిక్షవిధించెఁ దలారు లితని నురికంబంబు దరికి గొంపోవునెడ. ౧౫౧

క॥ పొగచూరి యకారణముగ
"బగబగ"మని మంట లెగసి భస్మీభావ
మ్మగను నురికంబముం గని
దిగులు వడి తలారు లేగి తెలుపఁగ నృపుఁడుల్. ౧౫౨

వ॥ స్వయమ్ముగ నయ్యెడ కరిగి యా దృశ్యంబు వీక్షించి తా నొనర్చిన యకార్యమ్మువలని యఘము త న్నంటకుండఁ దనయుపాస్యదైవ మగు సదాశివుఁడు తప్పించె నని సంతసించుచు నీతని పదమ్ములం బడి క్షమాపణమ్ము వేడికొని విరాగియై యతని యనుమతి వడసి రాజ్యపరిత్యాగం బొనర్చి తిరువళమడకూరున భిక్షాటనం బొనర్చి కొనుచు మహాలింగనాథుని సేవించుకొనుచుఁ దపస్వియై యట్లు గాలక్షేపం బొనర్చునెడ నితఁ డుత్తర దేశ పుణ్యక్షేత్రంబు లెల్ల సేవించి

కొంతకాలమ్మునకు నమ్మహాలింగనాథునికటమ్ము చేరుకొనియె నట్లు వచ్చినయతనిఁ గని భద్రగిరినాథుం డపరిమితానందంబు నంది మహాత్మా! మీకటాక్షంబున భవబంధమును దరించు మార్గమ్ముఁ గంటి నిన్నినాళ్ళకు మరల మిమ్ము సేవింపఁ గంటి నా కేమి సెల వనుటయు నీతండు. ౧౫౩

చ॥ సెలవున కేమి యున్నయది శీఘ్రగతిన్ సేవ లభించె దారపు
త్రులభ్రమ పూర్తిగా సురిఁగెఁ దూఱుపుద్వారము నాశ్రయించి నేఁ
గొలుతు సదా శివుఁ న్నిలిచి కొల్వుము పశ్చిమమందు నీవు, భ
క్తులు తరియింపఁగాఁ దగినత్రోవ యిదే మఱియొండు లే దిలన్.

వ॥ ఇట్లాదేశించుటయు. ౧౫౪

తే॥ గీ॥ అతఁడు బిచ్చము నెత్తినయన్నమందుఁ
గొంత యితనికి నిడి మిగుల్ గుడుచుఁ దాను
కుక్క యొక్కటి యాతనిఁ గొలిచి తిరుగు
దానికింగూడఁ బెట్టు నా ధర్మమూర్తి. ౧౫౬

వ॥ పిమ్మట నొక్కనాఁడు శివుండు కొండొక బక్క బైరాగి రూపము ధరించి భద్రగిరినాథునిదరిని శివనివేదితప్రసాదంబు మెక్కు కుక్కకుఁ దనలోకం బొసంగు తాత్పర్యమ్ముతో నీతనికడకు వచ్చె.

ఆ॥ వె॥ వచ్చి "అకట ! కడుపుచిచ్చు దహించెడిఁ
బిడికెఁ డన్న మున్నఁ బెట్టు" మనిన
నితఁడు "గేస్తు గాను నే నట నున్నాఁ డో
కండు గేస్తనఁగ నతండు వోయి. ౧౫౭

ఉ॥ తూఱుపుద్వారమం దొకని దోయిలి యొగ్గి యొకింత యన్నమున్
గోరితిఁ గుక్షి మంటకయి కోరిన "నే యతిగాని గాను నం

సారిని బొమ్ము పశ్చిమదిశం గలద్వారమునందు నుండె సం
సారి యతండు పెట్టు" నని సాధున కించుక బిచ్చ పెట్టవే. ౧౫౯

చ॥ అనవుడు నాతఁ డందలి యథార్థము తా గుఱితించి యా నహో!
శునకముఁ బెంచు హేతు విది చూచి గురుం డనె నన్ను గేస్తటం
చని తనభైక్ష్యపాత్రిఁ గొని యా శునకమ్ముశిరమ్ము మోఁదఁ జ
య్యన నది చచ్చి కాశినృపునాత్మజయై జనియించెఁ బిమ్మటన్. ౧౬౦

క॥ జనియించినక్షణ మాదిగఁ, దనపూర్వపుజని నెఱింగి తద్వృత్తంబున్
వినిచి తనునటకుఁ గొంపొ, మ్మనుచు నభిజ్ఞానములను నది వాక్రుచ్చెన్.

వ॥ అవ్విధమ్మునకుఁ దండ్రియగు కాశిరాజును బందుగులును నత్యా
శ్చర్యపర్యాప్తులగుచు రెండేండ్లవఱకు మిన్నకుండి యా పిల్లపోరు
పడలేక యనంతరం బబ్బాలికామణితోఁ. భద్రగిరినాథుఁ డున్న
చోటికి నరిగి యతండు సమాధి చాలించువఱకు వేచిన యనంతర
మ్మున నబ్బాల యమ్మహామహుని పాదమ్ములకుఁ బ్రణమిల్లి.

చ॥ హరవిని వేదితాన్నమున సాదృతిమై నటు సాఁకి పాత్రితోఁ
శిరమున మోఁదుమీఁదట నశించిన కుక్కను నేను గాశి భూ
వరునకుఁ బుత్రినయ్యును భవత్పదసేవఁ దరింప నెంచి మీ
దరి కరుదెంచితిన్ గురులదాస్యముకన్నను భాగ్యమున్న దే? ౧౬౩

వ॥ అని యిట్లు పల్కునబ్బాలికపల్కుల కక్కజంపడుచు గతవృత్తంబు
జ్ఞప్తికిం దెచ్చికొని తత్సహితంబుగాఁ దూఱుపుద్వారమ్మున నున్న
తిరువంకాడరుదరి కరుదెంచి. ౧౬౪

క॥ గురువర! శివప్రసాదము, మరగి తినిన కుక్క కెట్లు మరల జనిపరం
పరఁ బొరలవలసె ముక్తిం, బొరయక యనఁ గర్మశేషమున ఘటియించెన్.

వ॥ అదియును జిరకాలం బుండునది కాదని వచించునంతలో వైద్యు
తాగ్ని చందంబున నొక మహాతేజంబు పొడసూపి యక్కన్ని

యతో నా భద్రగిరినాథునిఁ దనలో నంతర్ధానంబు చేసికొని తాను మహాలింగనాథునందు లీనం బయ్యె. ౧౬౬

క॥ అదిగని యితఁడు మహేశా!, సదాశివా! శిష్యునకుఁ బ్రసాదించి దురాసదమగు లింగైక్యము న, న్వదలితి వలకుక్కపిల్ల పాటియుఁ గానే!

క॥ అని దీనమ్ముగఁ బ్రార్థిం, చినఁ గాలగళుండు నీవు చేయఁదగినదుం డినయది యింక నుగొండొక, పనియని యశరీరుఁడగుచుఁ బలికెం బెలుచన్.

సీ॥ బ్రదికింతు బ్రాహ్మణప్రవరుఁ బంచత్వమ్ము
గనువాని మంత్రితాక్షతలు చల్లి
ఆచార్యశంకరునట్లు తల్లికి నంత్య
కృతి నెఱవేర్చి ముక్తిని ఘటింతు
ద్రావిడంబున రామదాసు తెల్గునఁబోలె
రచియింతు భక్తికీర్తనల నెన్నొ
దేశదేశము లేగి యీశభక్తికి నున్న
విలువ యింతటిదంచుఁ దెలియఁబఱతు

తే॥ గీ॥ తుదకు జీవసమాధి నాతోడఁ గాంతుఁ
బైని నే నుండి నిన్నుఁ గాపాడుచుందుఁ
ద్వరపడకు మెందుకొఱకవతార మెత్తి
నాఁడనో! జ్ఞప్తి దెచ్చుకో నాఁటి మాట. ౧౬౭

శా॥ ఎన్నో క్షేత్రము లేగఁగా వలయు నీ వెన్నో గిరుల్ మెట్టి యె
న్నెన్నో భంగుల భక్తిబీజముల నా యీ భూమి నల్ప్రక్కలన్
జెన్నారన్ మొలపింపఁగావలయు నీచే నింత గానుండె నో
యన్నా! తొందర యేల? నీకని శివుం డత్యాదృతిన్ జూపుదున్.

వ॥ పట్టణత్తారును శివాజ్ఞ దాఁటరామిని బ్రారబ్ధక్షయపర్యంతం బుండక తీరదని తలంచి యయ్యై పుణ్యక్షేత్రంబులు సేవించుచు శివభక్తి

పారమ్యంబు బోధించుచు జీవన్ముక్తి మహాసామ్రాజ్యాభిషిక్తుండై
పరమానందమ్మునం బొదలుచుండె. ౧౭౧

చ॥ అతఁడు చరించినట్టి భువి యంతయు నాఽస్తికతా విదూరమై
శితిగళ భక్తిపూర్ణ మయి చెన్నొసలారెడు నేఁడు గూడ భూ
పతులు శివాలయమ్ము లలవైశ్యశిఖామణిశిష్యు లౌచు వి
స్తృతముగఁ గట్టి నిల్పి రని చెప్పుదు రాతని పున్నెమెట్టిదో, ౧౭౨

తే॥ గీ॥ అఱవమం దాతఁడు రచించినట్టి పెక్కు
గేయములు నేఁడునున్ బ్రీతి పేయములుగఁ
బాడుచుందురు పల్వు; రా వైశ్యయోగి
పుణ్య మిదమిత్థమని చెప్పఁ బోలునెట్లు. ౧౭౩

క॥ ఆతనివచించుగాథలు, చేతఃప్రీతికరమౌచుఁ జెన్నారెడి నె
న్నో తత్త్వవేత్తలందు న, నేతాదృశుఁ డతఁడు జ్ఞాననిధిశ్రీనిధియున్.

తే॥ గీ॥ ఎందఱో భోగులైన నృపేంద్రు లితని
వర్తనము గాంచి వారును "వైభవముల
తోఁ బనే"మని విడనాడి తుదకు నితని
శిష్యులై శైవమతబోధ చేసి రెలమి. ౧౭౪

చ॥ తన యవతారకార్యమును ధన్యముగా నెఱవేర్చి యీశ్వరే
చ్ఛను సఫలీకృతంబయిన చందమునన్ జగమెల్లఁ బేర్చి "యే
ధనికుఁడుగాని యీ తెరువు దాఁటినచోఁ దరియింపఁజాల" డం
చు నెఱుఁగఁజెప్పినట్టి పరిశుద్ధు నుతింపఁగ దుల్లుఁ బాపముల్. ౧౭౫

వ॥ ఇట్లమ్మహనీయుండు సనకసనందనాదులంబలె నెవ్వరికి నందరాని జీవన్ముక్తిసామ్రాజ్యం బేలుచు దివ్యక్షేత్రమ్ములు సేవించుచుండు నప్పటికి మనుమండును యుక్తవయస్సు వచ్చినవాఁ డయ్యె నంతట భూనాయకుండు లోఁగడ భద్రపఱచిన ధనం బెల్ల నతనికి వశ

పఱచి యీ కుటుంబగౌరవ మ్మెఱిఁగినవాఁడు గావునఁ దదనుగుణం
బుగ నప్పిల్లనికి వివాహాది శుభకార్యంబు లొనర్చుటయు. ౧౭౭

చ॥ అలరెడిరీతి నమ్మనుమఁ డార్యహితంబుగఁ దొంటి తండ్రి తా
తలమరియాదలన్ దెలిసి తజ్జ్ఞుల మన్చుచు శైవభక్తి యం
దలిసువిశేషముల్ దనమనంబున నెంచుచు విజ్ఞుఁడై పవి
త్రిలి కుల ముద్ధరించెఁ దనతీరు గనుంగొనువారు మెచ్చఁగన్. ౧౭౮

మ॥ అయము ల్లూర్చు నఘమ్ములన్ దొలఁచు విద్యాబుద్ధులన్ బేర్చు దు
ర్నయమున్ ద్రుంచుద యోదయమ్ముఁ బెనుచున్ నాస్తిక్యదుర్దోషసం
చయ మార్చున్ జయమున్ గడించును మహేశప్రీతి సంధించు,నా
మయపీడల్ దొలఁగించు నీచరిత మామ్నాయించినన్ విన్చినన్.

క॥ శుక్రుఁడు నాదగు జాతక
చక్రమున బలిష్ఠుఁ డతఁడు శనిదశలో భ
క్తిక్రమమున నేతెంచి ప
రాక్రమ మొకకొంతయిచ్చి రచన ముగించెన్. ౧౮౦

తే॥ గీ॥ ఎవనిలో శుక్రుఁ డేతెంచెనేనిఁ గవిత
బల్లిఁ దోలించు శనిలోన వచ్చె నిపుడు
వచ్చుటే తడవన్నట్లు వ్రాయఁ జేసె
నీకృతియె కాదు మఱి కొన్ని కృతులుగూడ. ౧౮౧

క॥ శ్రవణానంద మొనర్చిన
కవియే వీఁడగునో? మఱియొకఁడో? వీఁడనుచున్
గవు లనుమానింపకుఁ డ
య్యవసర మట్టి దిది యిట్టిదని యెఱుఁగరొకో. ౧౮౨

క॥ ప్రాయమ్ము ననుసరించియె
యాయాభావములు కవులయందున్ మఱియు

న్నాయకులయందుఁ దత్త
న్నాయికలందునను మార్పునన్ గనుపట్టున్. ౧౮౩

క॥ శృంగార మొకఁడె రసమని
యెంగాదే భోజనృపతి; యిందది లేశం
బుంగానరాద యట్ల
య్యుంగందురు దీనిఁ గొంద ఱుత్కంఠితులై. ౧౮౪

క॥ అని రచియించితిఁ గృతి వె
వ్వని కిచ్చితి నతని కిది సవాదుగ నున్నన్
దని సెద నే, నితరులతోఁ
బనిలే దిక్కృత యొసంగెఁ బ్రాజ్ఞుం డతఁడే. ౧౮౫

తే॥ గీ॥ అందు ముఖ్యఘట్టమ్ముల నరసి తీసి
దీని రచియించితిని భక్తులైనవారి
కొఱకు, గృతిభర్త భక్తుండు మఱియుఁ గొంద
ఱట్టిభక్తులు లేకుండ రని తలంతు. ౧౮౬

క॥ నా కితనివర్తనము సు
శ్లోక మ్మనిపించెఁ "జర్య"లో వ్రాయుదు నే!
కాకున్నఁ, గవులపని సు
శ్లోకులవర్తనలు తఱచు శోధించుటయే. ౧౮౭

క॥ సద్వినియోగము కొండొక,విద్వత్తయుఁ గలుగు రెడ్డి వేయేడులు సం
పద్వృద్ధితో నలరి సం,విద్వృద్ధులదీవనలకు విం దగుఁగాతన్.

మ॥ సతతం బేలెడుఁగాత రెడ్డిని బురస్కారార్హు విద్వత్సమా
దృతిచిత్తున్ గురుభక్తు నర్థిజనసత్కృత్యాదరున్ భూమిదై

టిప్పణి:— చర్యలో ఇటీవలిచర్య అను నా జీవితచరిత్రలో.

వత పూజారతు ధర్మకార్యనిరతున్ భాస్వద్యశస్సంపద
న్వితుఁగా నిత్యనిరామయాన్వితునిఁగా విశ్వేశుఁ డత్యాప్తుఁడై.

మ॥ రవిసోముల్ గురుశుక్రులున్ శనిబుధుల్ రాహ్వారకేతుల్ సమ
స్తవిధాలన్ స్తవనీయకీర్తి మొదలౌ తత్తద్విధశ్రేయముల్
కవితావర్ణ్యములౌ నటుల్ పొరిఁబొరిం గల్పించి ధర్మార్థకా
మవిభూతిన్ నెగడించి ప్రోతు రభిరమ్యశ్రీకు రెడ్డిన్ గృపన్. ౧౯౦

చ॥ తనయులు బంధుసంతతికిఁ దావలమై తన తండ్రినాఁటి య
ద్దినములు జ్ఞప్తికిం గొలుప దీనులపాలిటి కల్పకం బితం
డని యనసూయులౌ జను లహర్నిశముం దనుఁ బేర్కొనంగ దీ
ప్తినిఁ గనుఁగాక రెడ్డి కవిదేవుల మెచ్చున కాలవాలమై. ౧౯౧

మ॥ ధన మార్జించిన వారికెల్లఁ దనవృత్తమ్మొక్క యాదర్శమై
యనఁవొందన్ దనజ్ఞాన మర్త్యులకు నార్యశ్రేణికిం గూడ ని
ట్లని మార్గమ్ముపదేశమున్ సలుప దీర్ఘాయుర్యశో వైభవం
బున మా వెంకటరెడ్డి మెచ్చుఁ గనుతన్ ముమ్మూర్తు లాశీస్సిడన్.

శా॥ గంగాభంగ తరంగరింగణ కనత్కాపర్దకోటి స్ఫుర
చ్ఛృంగారాబ్జమణీ విభాసురుఁడు గౌరీ భాసమానార్థవా
మాంగుం డంకవిరాజమానతనయుం డత్యాదృతిం బ్రోచు స
త్సంగిన్ వేంకటరెడ్డి నాత్మతులితైశ్వర్యంబుఁ గైసేయుచున్.

మ॥ తనకున్ దేవుఁ డొసంగినట్టి యలవిద్యాసంపదల్ మేటి యా
ధనసంపత్తును భావివంశమున సాంతత్యంబుఁ గైకోఁగ న
వ్వనజాతాసనురాణివాసము రమావామాక్షియుం గూడి యెం
దును బొచ్చెమ్ములు లేక మంతురు కవిస్తోత్రార్హు రెడ్డిన్ గృపన్.

మ॥ మును పీ రెడ్డి యొనర్చు సత్కృతుల కామోదమ్ము రెట్టించి పై
నొనరింపం దలపెట్టినట్టి కృతులం దూఁతమ్ముగా నుండి స

జ్జనులున్ సత్కవులున్ బుధాగ్రిణులు వాత్సల్యంబుతోఁ జేరిణం
బును గావింతురుగాక దైవతకృపాస్ఫూర్తిన్ బ్రిసాదించుచున్.

శా॥ ఆరోగ్యం బెనలేని సంపద మహౌదార్యంబు నిత్యోత్సవ
శ్రీరోచిష్ణుత శాన్తి దాన్తి విబుధాశీర్వాదసంపత్తి సం
సారానంద పరోపకారముఖ మైశ్వర్యంబు మా రెడ్డి సం
సారిన్ బాయక యెల్లవేళ విమలాచారున్ సుఖం జేయుతన్.

మ॥ గురుభక్తుండగు రెడ్డి కెల్లపు డెసంగుంగాక శ్రేయంబు మా
గురుమూర్తుల్ గురుమూర్తులీతనియెడన్ "గొండొక్కలోపంబు మే
మరయం" బోమని దీవనల్ సలుప నత్యంతమ్ము శ్రీవేంకటే
శ్వరునాశీర్వచనమ్ము దాని కిడుతన్ సాహాయ్యమెక్కాలమున్.

తే॥ గీ॥ రెడ్డి తలపెట్టినట్టి సత్కృతులకెల్ల
నప్పరాశక్తి విద్యదుపాస్య తోడు
నీడయై మంచికీరితి నించుఁగాక
యిహపరమ్ముల సుఖ మది యిచ్చుఁగాక. ౧౯౪

తే॥ గీ॥ రెడ్డివా ? రాజవా ? యని వృద్ధు లాడు
పల్కున కొకండె లక్ష్యమై ప్రిబలుఁగాక
రెడ్డి వైకల్పికత్వమ్ము నడ్డగించి
ధనమును యశోధనంబుతోఁ దనరుఁగాక. ౧౯౫

గద్య

ఇది శ్రీ తిరుపతి వేంకటీయంబగు శివభక్తి యను పరమభక్త
చరిత్రిమునందు సర్వంబును బంచమాశ్వాసము
సమస్త సన్మంగళానిభవన్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠము

# కవితిలక గ్రంథమాల

బక్కింగుహాంపేట, బెజవాడ.

---

శ్రీమతి కవితిలక, కవితావిశారద, విద్వాన్

కాంచనపల్లి కనకాంబగారు రచించిన పద్యగ్రంథములు

ప్రథమ కుసుమము.

1. శ్రీ జీవయాత్ర :— వేదాంత ప్రతిపాదక మగు పద్యకావ్యము రు 2-8-0

2. అభిజ్ఞాన శాకుంతలము : కాళిదాస మహాకవి సంస్కృత నాటకమునకు సరసమైన యాంధ్రానువాదము 1-4-0

3. రామాయణ కథాసంగ్రహము : శ్రీ వాల్మీకి ప్రణీత బాలరామాయణమున కాంధ్రానువాదము. బాల బాలికలకు ప్రథమపాఠమునకు నెంతయు దగియున్నది. 0-4-0

4. పద్యముక్తావళి : అఖండ జీవయాత్రాంతర్గత పద్య సంగ్రహము, నానావిషయోపేతము, ప్రౌఢకంఠాభరణము 0-8-0

5. హంసవిజయ నాటకము : నేటి కాలంబున జిజ్ఞాసువులకు సంశయంబు బాపి సులభంబుగ నాత్మవిజ్ఞానంబును బోధించు వేదాంత నాటకము.

6. అమృతసారము : అపూర్వ మనోహరమగు పద్య సముదాయము, కేవల మమృతపాన మొనరించునట్లు వినినంతనే సంసారభారమును దెలియనీక బ్రహ్మానంద పారవశ్యము గలుగజేయు గ్రంథరాజము. 1-0-0

7. ఆనందసారము : తత్త్వబోధము సోపపత్తికముగా సోదాహరణముగా, మహాప్రౌఢమైన యుక్తితో వ్రాయబడిన పద్యసంగ్రహము. 1-0-0

8. తోమాలియ : ప్రాస్తావిక పద్యములు (అచ్చులో నున్నది)

9. బోధకథాసుధ : (వచనము) అచ్చులో నున్నది.

10. గౌతమ బుద్ధచరిత్రము : శ్రీ మహావిష్ణువుయొక్క యవతారమగు బుద్ధదేవుని చరిత్రము. బాలబాలికలకు పఠనయోగ్యమైనది. 0-10-0

11. రాధ : ఇదియొక సాంఘికనవల. ఉన్నతపాఠశాలలలో బాఠ్యగ్రంథముగ చిరకాలమునుండి యుపయోగ పడుచున్నది 0-15-0

12. కనకసూక్తులు : స్త్రీలకుపయుక్తమగు ధర్మశాస్త్రము. (అచ్చులో నున్నది)

## పండితరాజ దంటు సుబ్బావధానిగారి గ్రంథములు

13. ఆంధ్రభామినీ విలాసము : జగన్నాథ పండితరాయుక్త్యశ్లోకి ఆంధ్రానువాదము. 1-0-0

14. పొగడ పూలు : (అచ్చులో నున్నది)

15. చిత్రమాధవ నాటకము : ,,

16. ఆంధ్ర వైద్య విజ్ఞానము : ,,

17. అమృతానందనాథస్వామి చరిత్రము : ,,

18. శ్రీ తులసీదాస చరిత్రము : (ప్రథమభాగము) విద్వాన్ దంటు శ్రీనివాసశర్మ, బి. ఏ., బి. యల్., గారిచే రచింపబడినది. ఆధునిక రచనయయ్యు రసభావధరితమై యార్యవిజ్ఞాన సంప్రదాయ బోధకమగు లలిత పద్య కావ్యము. రు 1-0-0

